# భారతి

సాహిత్య మాసపత్రిక

ఏప్రిల్ : 1990

వెల : 5 రూపాయలు

* పగచిచ్చు
* వాల్మీకి గేయ పరిస్పందము
* చలం సృజన
* సర్వమాత్మానం పశ్యతి
* అంగద రాయబారం




వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# అమృతాంజన్ గ్రైప్ వాటర్




పాప ఆరోగ్యానికి,
సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు,
విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి.
ఆకలి, జీర్ణశక్తి బాగా వుంటాయి పాపాయి
ఆరోగ్యం బాగుపడుతుంది

అమృతాంజన్ లిమిటెడ్
42-45, లజ్ చర్చ్ రోడ్డు,
మద్రాసు 600 004

**Amrutanjan Limited**



# భారతి

మాస పత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంస్థాపకులు
(1938-1972)

*

సంపుటము : 67 — ఏప్రిల్ 1990 — సంచిక : 4

విడిపత్రిక వెల ఐదు రూపాయలు




---

## విషయానుక్రమణిక


| | | |
|---|---|---|
| రావమ్మా! మహాలక్ష్మి! రావమ్మా! రా! | శ్రీ కె. కిశోరుబాబు, శ్రీ కె. అశోకుబాబు | 4 |
| రంగనాథ రామాయణం – అంగద రాయబారం | శ్రీ పి. దామోదర రెడ్డి | 5 |
| నిజం నా యిజం | డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు | 9 |
| ఆంధ్రప్రదేశ పర్వత నామములు – ఒక పరిశీలన | డా॥ ఎ విజయదత్తాత్రేయ శర్మ | 10 |
| శ్రీ – శ్రీ శ్రీ; మినీ కవిత | శ్రీ వేదాటి రఘుపతి | 25 |
| పక్షి | శ్రీ జి. రామశేషయ్య | 25 |
| కర్తవ్యం, ఈ పాట | శ్రీ సి. కామేశ్వరరావు | 26 |
| పగచిచ్చు | "తి" | 27 |
| శబ్దాల్ని ప్రేమిస్తూ!... | శ్రీ భగ్వాన్ | 35 |
| ఒక్క నిస్పృహే....! | శ్రీ పసునూరు శ్రీధర్‌బాబు | 35 |
| చలం – సృజన | డా॥ యు. ఎ నరసింహమూర్తి | 36 |
| వైఫల్యం | శ్రీ కలువకొలను సదానంద | 40 |
| వాల్మీకి గేయ పరిస్పందము | కన్నడ మూలం: కీ.శే. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ<br>తెనిగింపు: శ్రీ శంకరగంటి రంగాచార్యులు | 42 |
| అలలుగా సాగిన నీ గీతం.... | శ్రీ కోడిమెల శ్రీరామమూర్తి | 47 |
| 'సర్వమాత్మానం పశ్యతి' | శ్రీ శివలింగం | 48 |
| మైత్రీబంధం | శ్రీ డి. యమునాచార్య | 48 |
| కలగూరగంప | | 49 |
| గ్రంథవిమర్శలు | | 59 |

# స్వ విషయం

ఈ నెల భారతిలో "పగచిచ్చు" అనే నాటికను అందిస్తున్నాము. రాయలసీమలోని ఏ పల్లెటూరు తీసుకున్నా - కనిపించే మనుషులు - ఇందులోని పాత్రలు!

"గెలిసే కాలం రాకపోతాద్యా. కడాకి మ్యాకల్దే గెలుపనుకో" వంటి మాటలు వింటూ ఉంటే సహజసిద్ధమైన భాష ఎంత జీవాన్ని నింపుకుని ఉంటుందో అర్థమవుతుంది. ఇక ఈ మాటల వెనక ఉన్న అర్థం గురించి ఆలోచిస్తే ఎంత శక్తివంతమైందో తెలుస్తుంది.

మంచి కథలు, మంచి నాటికలు భారతిలో పడడం లేదని విమర్శించేవారి కందరికీ ఈనాటికి కాసింతైనా ఉపశాంతిని కలిగించగలదు. ఉత్తమమైన, ఉదాత్తమైన రచనల కోసం భారతి ఎప్పుడూ తలుపులు తెరిచే ఉంటుందని సవినయంగా మనవి చేసుకుంటోంది.

ఆంధ్రప్రదేశ్ పర్వత నామాలపై డా॥ విజయదత్తాత్రేయ శర్మ అందించిన పరిశీలాత్మక వ్యాసం చరిత్ర పరిశోధకులకు, భాషా శాస్త్రజ్ఞులకు ఉపయుక్తంగా ఉండ గలదని ఆశిస్తున్నాము.

ఈ పరిశోధనా వ్యాసాల స్థాయి మరింతగా ఎదగవలసి ఉందని అభిప్రాయపడు తున్న ఎంతోమందితో పాటు భారతి కూడా ఉంది. ఏ కోవకు చెందిన పరిశోధకులైనా ఈ వాస్తవాన్ని గుర్తించి ఈ కొరతను చాలవరకు తీర్చగలరని నమ్ముతున్నాము.

కవిత్వం విషయంలో కూడా ఆశించిన ప్రమాణాలు ఉండడం లేదన్నది ఎక్కువ మంది అభిప్రాయం. ప్రతి విత్తూ అంకురించి మహావృక్షం కాలేనట్లే ప్రతి భావం వికసించి గొప్ప కవిత్వం కాలేదు. ఇజాల మత్తు వదలి నిజాల సత్తా తెలియాలి. జీవితంలో సాహిత్యం, సాహిత్యంలో కవిత్వం ఎంత ప్రగాఢంగా ఉంటుంది, ఎంతగా ప్రభావితం చేస్తుంది - అన్న విషయాలు ఎల్లవేళలా చర్చనీయాంశాలే మారుతున్న కాలానికి అను గుణంగా మారిపోయే జీవితపు విలువల వంటివి విషయాలు. నిత్యం సంస్కరించబడుతూనే ఉండాలి.

ఈ విషయంలో భారతి తన వంతు పాత్రను తాను నిర్వహిస్తోందనే అను కుంటోంది. ఈ పాత్రను మరింత సమర్ధవంతంగా నిర్వహించడానికి రాసేవారి, చదివేవారి తోడ్పాటు ఎంతయినా అవసరం.

అభిమానుల సూచనలకు ముకుళిత హస్తాలతో భారతి స్వాగతం పలుకుతోంది.



# రావమ్మా! మహాలక్ష్మీ! రావమ్మా! రా!

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు

విరిసెన పువ్వయిన అమ్మ ఒడిలో
కేరింతలు కొడుతూ
పాలు త్రాగుతూ ఉన్నాను!
ఆ తీపి క్షణాల్లో నువ్వు వచ్చావు
నడువూ అన్నావు.
నేనేమో వీడుకోలుకు సిద్ధపడి లేను!
అప్పుడు అమ్మ అనురాగ క్షీరం
నన్ను పోషించింది!
తామర మొగ్గల ప్రియురాలి కౌగిళ్ళలో
పరవశిస్తూ
పులకరించిపోతూ ఉన్నాను!
ఆ లాహిరీ గడియల్లో మళ్ళీ నువ్వు వచ్చావు!
పదమన్నావు
నేనేమో ప్రయాణానికి తయారుగా లేను.
అప్పుడు ప్రియురాలి ప్రేమామృతం
నన్ను సాకింది
ఇప్పుడేమో
ఆ విరిసెన పువ్వు ఆ తామర మొగ్గ
ఆ అనురాగ క్షీరం ఆ ప్రేమామృతం
ఆ తీపి ఆ లాహిరీ
ఏవీ లేవు!

మురికిలో రోగాలతో నొప్పులతో
ఆలోచనలతో
బెంబేలు పడుతూ
ఒంటరిగా మిడుకుతున్నాను!
ఈ గడ్డు రోజుల్లో నువ్వు రావటం లేదు!
యాత్రకు తొందర పెట్టడంలేదు.
నేనేమో నీ అంకాన్ని జేరి
నీ వాత్సల్య దుగ్ధాన్ని కడుపారా పీల్చి
పెన్నిద్దుర పోవాలని
ఉబలాటపడుతూ ఉన్నాను!
మూడుకాళ్ళ ముసలి నయ్యానని
బెండు మానిసి నయ్యానని
నువ్వు నన్ను ఏవగించుకుంటున్నావేమో!
వద్దు వద్దు తల్లీ!
రావమ్మా! మహాలక్ష్మీ! రావమ్మా! రా!
వచ్చి పెద్ద మనసుతో
నా తల నిమురు
నన్ను ఆదరించు
ఆదరించి చాల పెద్దమ్మ వనిపించుకో!
తెల తెలబోయిన నా బ్రతుకుకు
వేకువను చూపించు!
చూపించి నువ్వు కలుముల రాణివనిపించుకో!

శ్రీ పి. దామోదరరెడ్డి

# రంగనాథ రామాయణం - అంగద రాయబారం

"దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్ర విశారదమ్
ఇంగితాకార చేష్టజ్ఞం శుచిందక్షం కులోద్గతమ్"
(మను స్మృతి 7-63)

దూత అనేవాడు సర్వశాస్త్ర విశారదుడు, ఇంగిత జ్ఞానం కలవాడు, చేష్టల చేతనే భావాలను గ్రహించగలవాడు, ధనాశ, స్త్రీ వ్యసనం లేనివాడు, దక్షుడు, సమర్థుడు, మరుపు లేనివాడు, ఉత్తమ కులానికి చెందినవాడు అయిఉండాలి శత్రువుల మధ్య సంధి చేకూర్చడంలో దూత పాత్ర కీలకమైందని మనువు చెప్పాడు

"నానా శాస్త్రవిచక్షణుండు నయనాసందాంగుఁడున్ సత్కుల
స్థాన శ్రేష్ఠుడు నిస్పృహుండు పరచిత్తజ్ఞుండు వాక్సిద్ధుడున్
శ్రీ నిత్యుండును లోకమాన్యుఁడగు నిశ్చింతుండునై యుండినన్
వానిన్ మానుగ రాజదూతయని తల్పన్‌వచ్చు నుర్వీస్థలిన్"
(సకలనీతి సమ్మతం - 2.339)

రాజ సందేశాన్ని మిత్రులకు గాని, శత్రువులకు గాని యథాతథంగా వినిపించేవాడే నిజమైన దూత. ఈ దూతనే రాయబారి అని కూడ అంటారు. రెండు రాజ్యాల మధ్య సంబంధాలు నెలకొల్పడానికి రాజకీయ పురోభివృద్ధికి రాయబారి మూల స్తంభం చేపట్టిన కార్యం ఫలవంతం కావడం, కాకపోవడం రాయబారి చాకచక్యంపై ఆధారపడివుంటుంది.

రామ లక్ష్మణులు వానర సైన్యంతో కలిసి లంకను ముట్టడించారు రాముడు రావణుని దగ్గరికి దూతను పంపాలనుకున్నాడు అప్పుడు ఎవరిని పంపాలనే ప్రశ్న ఎదురైంది. ఆలోచించాడు

"కపి కులోత్తముడైన కంజాప్తసుతుని
కపిరాజుఁ బంపుట కార్యంబు గా"దని
(యుద్ధకాండం పుట-297, పంక్తి-22)

తన మనస్సులో అనుకున్నాడు. ఇది సహేతుకమైనదే. ఎందుకంటే సుగ్రీవుడు ఆవేశపరుడు. పగను మరచిపోలేనివాడు. పుర గోపురంపై నిలిచి ప్రకాశిస్తున్న రావణుడి వైభవాన్ని చూడలేక సువేలాద్రి నుండి సుగ్రీవుడు రావణుడిపైకి ఎగిసి "రావణ, వినుయేను రాముని బంట, మాకు నీ వైభవమా చూపె"దనుచు, పరాక్రమంతో వేగంగా అతని కిరీటాన్ని కిందికి తోసేశాడు. రావణుడు కోపించి మల్లయుద్ధం చేస్తూ సుగ్రీవుని చంపడానికి ప్రయత్నించాడు. అది తెలిసిన సుగ్రీవుడు తప్పించుకొని రాముని దగ్గరికి వచ్చాడు ఈ సంఘటన ద్వారా సుగ్రీవుని మనస్సులో రావణునిపట్ల రగులుతున్న పగను రాముడు గుర్తించాడు. కాబట్టి సుగ్రీవుని రాయబారిగా పంపితే కార్యం ఫలవంతం కాదని భావించాడు.

"బల్లిదుండగు జాంబవంతుఁ బంపుటకు
నెల్లవిధంబుల నెఱుగడు వాడు"
(యుద్ధకాండం, పుట-297)

జాంబవంతుడు బలవంతుడే, కాని రాయబార కార్యం గురించి సరిగా తెలియనివాడు. కాబట్టి అతనిని పంపితే ప్రయోజనం లేదు

"పరమ విక్రమశాలి పవమాన సుతుని
మరల పంపుట మర్యాద గాదు"
(యుద్ధకాండం, పుట-297)

అంతకు మునుపే రామకార్యం నెరవేర్చడానికి లంకకు వెళ్ళి సీతాదేవిని చూడడమే కాక, రాక్షసులు బంధించి తోకకు నిప్పు పెడితే, ఆ నిప్పుతోనే లంకను కాల్చివచ్చిన గొప్ప యోధుడు హనుమంతుడు. అలాంటి వీరుని మళ్ళీ పంపడం సమంజసం కాదని తెలివిగల రాముడు భావించాడు.

"భుజ విక్రమంబున భూరి వేగమున
భుజగ వైరికి సరిపోలు నంగదుని"
(యుద్ధకాండం, పుట-297)

పంపడం మేలని, రాముడు మంత్రుల అనుమతి తీసుకొని అతనిని పిలిచాడు. అంగదుని రాయబారిగా పంపడానికి కారణం-

భుజ పరాక్రమంలో అత్యంత వేగంలో అంగదుడు గరుత్మంతునికి సాటి రాగలవాడని రాముడు గుర్తించాడు గరుత్మంతునితో పోలిక వల్ల అంగదుని సూక్ష్మదృష్టి, నిశిత పరిశీలనాశక్తి, సూచించబడుతున్నాయి రాయబారికి ఉండాల్సిన లక్షణాలు పరిపూర్ణంగా అంగదునిలో ఉన్నాయా? సుగ్రీవాది ప్రముఖులతో పోల్చి అంగదుని రాయబారిగా రాముడు ఎన్నుకొన్నాడు కాబట్టి రాయబారి లక్షణాలన్నీ పరిపూర్ణంగా అతనిలో ఉన్నాయన్న మాట.

యువరాజయిన అంగదుని ప్రతిభకు ఈ రాయబార కార్యం ఒక పరీక్ష ఇంతటి రాయబార కార్యం నెత్తిన పడిన అంగదుని మనస్తత్వం ఎలాంటిదో చూద్దాం.

అంగదుడు సుగ్రీవాజ్ఞ మేరకు వానర యోధులతో కలిసి దక్షిణ దిశకు సీతాన్వేషణకై వెళ్ళి ఆమె జాడ తెలియక పోవడంతో తిరిగి సుగ్రీవుణ్ణి చూడబోవడం న్యాయం కాదని తన సహచరులతో అన్నాడు.

"వనజాక్షిఁ బొడగన్న వారము గాము
ఆజ్ఞా ధురంధురుడైన సుగ్రీవుఁ
డాజ్ఞ దప్పిరి పీరలంచును నునల
బొడ గన్నయప్పుడే భూపతి మెచ్చ
నడిమికి రెండుగా నటికించు నుబక"

(కిష్కింధాకాండం, పుట-201)

కాబట్టి అక్కడికి వెళ్ళడం తగదు ఇక్కడే బిలంలో వుండిపోతే ఎవరూ తెలుసుకోలేరు అని అన్నాడు.

శ్రీరాము కార్యంబు సేయక పోయి
యారవి సూనుచే నట జచ్చుకంటె
నీయెడఁ జచ్చుట యది లెస్స మనకు

(కిష్కింధాకాండం, పుట-201)

అని చావడానికి సిద్ధపడ్డాడు. ఇక్కడ అంగదుని చిత్తవృత్తిని బట్టి సుగ్రీవునిపట్ల అతనికున్న ద్వేషం వెల్లడైంది. ఒకవైపు రాముని కార్యం నెరవేర్చలేదు కాబట్టి ఆ నెపంతో సుగ్రీవుడు తనను చంపవచ్చునని దూరదృష్టితో ఆలోచించినట్లు తెలుస్తోంది. రామకార్యం పట్ల పట్టుదల సుగ్రీవుని పట్ల అనుమానాన్ని అంగదుడు వ్యక్తపరిచాడు.

సంపాతి ద్వారా సీత జాడ తెలుసుకొన్న వానర వీరులు సముద్రాన్ని దాటేందుకు తమ శక్తి సామర్థ్యాల్ని తెలియజేస్తున్నారు. అప్పుడు అంగదుడు తన శక్తిని, లోపాన్ని ఇలా బేరీజు వేసుకున్నాడు. బేరీజు వేసుకోవడమే కాదు కంఠోక్తిగా చెప్పాడు.

"వాలిన కడిమిమైవడి నూఱు దాటఁ
జాలుదు మగిడి రాఁజాలను గాని"

(కిష్కింధాకాండము, పుట-205)

అని అన్నాడు. ఇలా బేరీజు వేసుకోవడం రాయబారి ప్రముఖ లక్షణాలలో ఒకటి

ఇలాంటి అంగదుని రాముడు రాయబారిగా రావణుని దగ్గరికి పంపుతున్నాడు. అక్కడ లంకలో "ఎంతమంది ఆప్తులు చెప్పినప్పటికీ సీతను మాత్రం రాముడికి తిరిగి ఇవ్వను" అని రావణుడు భీష్మించుకొని కూర్చున్నాడు రాయబారిగా వెళుతున్న అంగదుడు తన ప్రజ్ఞతో రావణునికి నచ్చచెప్పి, సీతాదేవిని రాముని వద్దకు చేర్చి, రామ రావణుల మధ్య సయోధ్య కుదర్చాలి. ఇదెంతవరకు సాధ్యం? అసాధ్యమైతే రాముడి గొప్పతనాన్ని చెప్పి రావణుని బెదరగొట్టాలి అంతేకాక అక్కడివాళ్ల శక్తి సామర్థ్యాల్ని అంచనా వేయాలి. ఇంతటి మహత్తర కార్యాన్ని అంగదుడు నెరవేర్చాలి.

తన మాటలుగా రావణునికి చెప్పమని రాముడు రాయబారితో ఇలా అన్నాడు.

"పరగర్వంతో మునులను, దేవతలను, బాధించడం కాదు ఇప్పుడు రాముడు నీపైకి దండెత్తి వచ్చాడు

"ఏలావు నమ్మి నీ వెలనాగ దెచ్చి
తాలావు జూప రమ్మను యాజిలోన"

(యుద్ధకాండం, పుట-297)

రాముని బాణాల దెబ్బలకు తట్టుకోలేక పిరికివాడిలా పరుగెత్తవద్దని చెప్పు, లేదా సీతను తెచ్చి ఇచ్చి బ్రతకడం మంచిదని చెప్పమనీ చెప్పాడు. లంకకు రాజుగా విభీషణునికి పట్టం కట్టానని చెప్పి, రాముడు చంపకముందే నీ సకల బంధువులను చూసుకోమనీ, నీవు నీ బంధువులు అందరూ చస్తారు, చచ్చిన తరువాత కార్యం నిష్ఫలమవుతుంది. సంధి కార్యం జరగడానికి నేను చెప్పిన విధంగా వినుమని చెప్పాడు ఇక నీవు రావణుడి దగ్గరకు పొమ్మని రాముడు అంగదుడికి ఆనతిచ్చాడు

రాముడు అంగదుని రాయబారిగా ఎన్నుకునే ముందు మంత్రుల అనుమతిని తీసుకొన్నాడు ఇక్కడ రాజు-మంత్రుల సయోధ్య తెలుస్తోంది. ముఖ్యంగా మన ప్రాచీన భారతీయ

రాజరిక వ్యవస్థలో రాయబారి పదవి స్థిరమైంది కాదని సంద ర్భాన్ని బట్టి నియమిస్తారని అంగద రాయబారంవల్ల తెలుస్తూంది.

రాముని అనతితో అంగదుడు సంతోషంగా లంకను చేరాడు. రాముని మాటలను మనస్సులో తలచుకొని నిర్భయంగా రావణుని కొలువులో నిలబడ్డాడు రాక్షసులు చుట్టుముడితే రావణుడు వారిని వారించి,

"క్రొవ్వి వానరుఁడ యీ కొలువు లోపలికి
నెవ్వగ నొంచక నేఁడు వచ్చితివి
ఎవ్వరు బంచి నారెవ్వండ వీవు
ఎవ్వని తనయుండవేమి నీ పేరు
నివ్వటిల్లెడు లంక నీ విటు చొచ్చి
యెవ్వరి పనిఁ బూని యేగుదెంచితివి
వనచర చెప్పరా వచ్చిన కార్య"మని....

(యుద్ధకాండం, పుట-298)

అంగదుణ్ణి అదలించినాడు

ఓ రావణ! నేనెవరైంది తెలియదా? అయితే విను. నేను రాముని బంటును. రాముడంటే ఎవరనుకున్నావు? పరాక్రమంతో పరశురాముని గెలిచిన రణ విచక్షణుడు, అని అంగదుడు రాముని గొప్పతనాన్ని వర్ణించాడు అంతటితో ఆగక, నేనెవరి కొడుకునో తెలియదా?

"నివ్వటిల్లఁగ బట్టి నినుఁ దోఁకఁ గట్టి
ముఱపెట్టు వార్థుల ముంచి ముంచీడ్చి
కరుణించి విడువడే ఘనుడైన వాలి"

(యుద్ధకాండం, పుట-298)

ఆ వాలి కొడుకైన అంగదుడను వాడను మా తండ్రివలె నిన్ను వార్థులలో ముంచుతానని పలికాడు. రావణుని అహంకారపు ప్రశ్నలకు అంగదుని గంభీరపు సమాధానాలవి

రావణుడికి కోపం వచ్చింది రాయబారి పట్ల చూపవలసిన మర్యాద మరచి-

"వనచరాధమ నీవు వచ్చిన దూత
జెనఁకి నిన్నిట శిక్ష సేయ రాదనుచు
ఘనముగా బెడిదంపు గాఋలాడెదవు"

(యుద్ధకాండం, పుట-298)

ఇంతకు ముందు వచ్చిన హనుమంతుడు ఇదేవిధంగా కారుకూతలు కూసి మాచేత దండన పొందాడు. వాడున్నాడో లేదో భయపడకుండా చెప్పమన్నాడు. హనుమంతుడికి కలిగిన దండనే నీకు కలుగుతుందని హెచ్చరించడమే రావణుని మాటల లోని ఆంతర్యం. అందుకు అంగదుడి దీటైన సమాధానమిది.

రావణునితో తోక కాల్పించుకొని వచ్చావని కపియోధులంతా హనుమంతుని వాయించారు. వానరులలోకెల్ల అల్పులమైన హనుమంతుని, నన్ను ఇలాంటి రాయబారపు పనులకు సుగ్రీవుడు నియమించాడని అంగదుడు రావణుడితో చెప్పడం రావణుడికి చెంపదెబ్బ లాంటిది ఇలా అనడంవల్ల తక్కిన వానరులంతా ఇంకా ఎంతో బలవంతులని, తమనే ఎదురించలేని రావణుడు వారి నేమి ఎదురించగలడని అంగదుడు వ్యంగ్యంగా రావణునికి విసిరిన సవాలు. బాగా ఎక్కుపెట్టిన వింటినుండి వెలువడిన బాణం

ఆ మాటలకు రావణుడు త్తరపడ్డాడు. అప్పుడు అంగదుడు,

" . రావణ రాము నెఱుగుదు గాక
యీ రీతి గర్వింప నేటికి నీకు
లోక విక్రముడు త్రిలోక భీకరుడు
లోక శరణ్యుండు లోకైక నుతుడు"

(యుద్ధకాండం, పుట-299)

అంటూ రాముని గొప్పతనాన్ని మరోసారి నోరారా వర్ణించి,

"వద్దురా రాక్షస వైదేహి నిమ్ము
మది మది నుండి రామాధిపు తోడఁ
గదిసి కయ్యముకకు గాలు ద్రవ్వకుము
రాక్షసాధమ యోరి రాముని దేవి
నీక్షితి మొఱగి నీ విట్లు తేదగునె"

(యుద్ధకాండం, పుట-299)

అని చెప్పడమే కాక, రాక్షస అని రాక్షసాధమ అని కించపరుస్తూ,

"నీ పుత్త్రి మిత్రాది నిఖిల రాక్షసులు
నే వటి రాముచే నీల్గక మున్నె"

(యుద్ధకాండం, పుట-300)

సంధికి సమ్మతించి బతుకు సంధి వద్దని యుద్ధానికి సిద్ధమైతే చుట్టాలు, భార్యలు, పిల్లలు, అన్నదమ్ములు మొదలైన వాళ్ళనింక చూడలేవు చివరికి,

"హరిహర బ్రహ్మాదు లడ్డగించినను
దురము లోపల నిన్నుఁ ద్రుంచు రాఘవుఁడు"

(యుద్ధకాండం, పుట-300)

అని హెచ్చరించి, "ఆ రాముని భార్య సీత నొప్పించి బతుకు"మని సలహా ఇచ్చాడు. రావణుడు కూడ తన పరాక్రమాన్ని పొగడుకొని-

"పగవాడు దండెత్తి పైవచ్చినంత
మగటిమి చెడి సంధి మఱి సేయునపుడె
జగతి రాజులు నన్ను సరకు సేయుదురె
తగదు రా సంధి యిత్తఱి....." అని అనడం.

(యుద్ధకాండం, పుట-300)

రావణుడి అహంకారాన్ని, మితిమీరిన ఆత్మ విశ్వాసాన్ని తెలియచేస్తుంది

ఈసారి అంగదుడు రాముడి ధనుర్విద్యా కౌశలాన్ని గురించి వివరిస్తూ 'మూడు లోకాలకు తెలిసేటట్లు నీవెత్తలేని విలును గడ్డిపోచవలె విరిచె గదా రాముడు" అని అతని విజయ పరంపరను వివరించాడు అలాంటి రాముని శరణు వేడుమని సలహా ఇచ్చాడు

'ఓరి వానరుడా! మాటిమాటికి రాముని పొగడడం ఎందుకు? స్త్రీయైన తాటకిని, వృద్ధులైన ఖరదూషణాది రాక్షసులను, జింకతో సమానమైన మారీచుని చంపడం, విల్లు విరవడం, బ్రాహ్మణుడైన పరశురాముని గెలవడం.... ఇలాంటి పనులన్నీ రాముని గెలుపునకు తార్కాణాలు కావు' అని రావణుడు ఆక్షేపించాడు.

చివరగా అంగదుడు రాముడి పవిత్రత గూర్చి మహిమల గూర్చి వివరించాడు రావణుడు మాత్రం రాముని చేతకానివానిగా పేర్కొన్నాడు. రాముడు వివేకం చెడి రాజ్యాన్నంతటినీ తమ్ముని చేతిలో పెట్టి అడవుల్లో తిరుగుతూ భార్యను కోల్పోయి సుగ్రీవాది వానరులను ఆశ్రయించి శూరత్వం చూపుతున్నాడు. యుద్ధంలో నన్ను తాకగలడా? అని రాముని శూరత్వాన్ని హేళన చేయడం అంగదుని వంచించడానికి అవసరం. రావణుడు అంగదుని రెచ్చగొట్టి భేదోపాయాన్ని ప్రయోగించడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఓరి అంగదా! మీ తండ్రిని చంపిన రాముని చంపక అతనిని కొలవడానికి నీకు సిగ్గులేదా?

"నీ మగటిమికిని నీదు పెంపునకు
సీమ వార్లెల్లను సీయని నగరె"

(యుద్ధకాండం, పుట-302)

నిన్ను వాలి కొడుకని నమ్మవచ్చా? బుద్ధి లేని నీకు బుద్ధి చెబుతున్నాను విను, రాముని విడిచి నన్ను కొలిస్తే నిన్ను వనచరులందరికీ ప్రభువును చేసి ఘనమైన భూషణాల్ని, వాహనాల్ని ఇప్పుడే ఇస్తానని ప్రలోభ పెట్టాడు.

రావణుని మాటలకు అంగదుడు రెచ్చిపోక, అతని ప్రలోభానికి లొంగక, రాముడు విష్ణుమూర్తి, అతని చేత చచ్చిన తన తండ్రి వాలి పవిత్రుడై వైకుంఠం చేరాడు. దీనిని చెడుగా అనుకోవడం ఎందుకని ప్రశ్నించి, వేయి విధాలుగా చెప్పడమెందులకు? నీ చావు దగ్గర పడుతోంది. ఇక నీ గర్వాలు చెల్లవు. కాబట్టి ఆ రామునికి సీతాదేవిని అప్పచెప్పి పవిత్రంగా బతుకు.

"తొడరిన బలవంతుతో సంధి యగుట
పుడమి రాజులకెల్ల బుద్ధియె సుమ్ము"

(యుద్ధకాండం, పుట-303)

అని చిట్టచివరగా సంధికి ప్రయత్నించాడు.

రావణుడు మూర్ఖత్వంతో కోపించి అంగదుని బంధించమన్నాడు తన శక్తిని చూపడానికి అంగదుడు రాక్షసులకు పట్టుబడ్డాడు ఉన్నట్టుండి రాక్షసభటులతో గూడి ఆకాశం పైకెగసి వాళ్ళను విదిలిస్తే, వాళ్లు భూమిపై పడి నుగ్గునుగ్గయినారు. కొలువు కూటపు గోడలను కూలదోశాడు రావణుని ఆజ్ఞతో రాక్షస వీరులు పరశు, భిండివాల శూల, కరవాల, మరగదలతో దాడి చేశారు అంగదుడు పిడికిళ్ళతో వాళ్ళ పేగులు బయటికి వచ్చేటట్లు పొడిచి వెళుతుంటే సుకరుడు విల్లెత్తి నిలవమని కేక వేశాడు అంగదుడు వాని తల ముక్కలయ్యేటట్లు పిడికిళ్ళతో కొట్టాడు అది చూసి రావణుడు చింతలో మునిగిపోయాడు

అంగదుడు రాముని దగ్గరికి చేరి దేవా! చెప్పవలసిన మాటలు చెప్పాను. చావుకు సిద్ధమై "ఉట్టిగట్టుకొని ఊగుతున్న" రావణుడు వాటిని లెక్క చేయలేదు. వానిని యుద్ధంలో చంపమని చెప్పిన మాటలకు రాముడు ఎంతో సంతోషించాడు.

కార్యం ఫలవంతం కాకపోయినా రాముని శక్తిని తెలిపి అంగదుడు రావణుని అదరగొట్టాడు. తన శక్తిని ప్రదర్శించి భయపెట్టాడు రావణుడి ఆత్మ విశ్వాసాన్ని సడలించాడు. రాక్షస వీరుల శక్తిసామర్థ్యాల్ని, లోపాల్ని గుర్తించాడు ఇలా రాయబారిగా తాను వచ్చిన పనిని అంగదుడు పూర్తిగా నెరవేర్చాడు.



# నిజం నా యిజం

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

* ఈ చేదు జీవితాన్ని
స్వాదు కవిత్వంగా మూస పోసి
గాయాల కహానీ వినిపిస్తూ
నిట్టూర్పుల నిషానీ ప్రదర్శిస్తూ
కనురెప్పల కింద కలతలు దాచి
చిరునగవుల వెనుక చింతలు మరచి
ము 'భావ' కవిలా అడుగులు వేసుకుంటూ
ముంచుకొస్తున్న ఉప్పెనకు భయపడి
మూలనున్న సత్రంలో కూచొని
చలి కాచుకునే బాటసారిని కాను నేను
నేను .. నేనే!

ఓటమిలోంచి పుట్టుకొచ్చే గెలుపుని
చీకటిలోంచి తన్నుకొచ్చే వెలుగుని
బూడిదలోంచి బతికివచ్చే ఫీనిక్స్ పక్షిని
నేను స్వేచ్ఛాజీవిని!

* * *

సంప్రదాయ వాదాలకు తలవంచి
సంకుచిత మత గజాల నధిరోహించి
(—)
జీవితపు ఇంగితపు లోతుపాతుల్ని విడచి
అతీతానంద సంధాయకంలో అసలు స్పృహను మరచి
సుఖశాంతుల కోసం తల్లడిల్లుతున్న
పిడికెడు హృదయంలోని కడలి ఆరాటాన్ని
జానెడు కడుపు నింపుకోవడం కోసం
వెంపర్లాడుతున్న నిత్యజీవన పోరాటాన్ని
పట్టించుకోక తలకెక్కించుకోక
వృథా ప్రణయగీతాలు అల్లుకుంటూ
మధుపాత్రల్లో కవితానికషోపలాలు చల్లుకుంటూ
జిందగీని జాదూ చేసే
జంతర్ మంతర్ కవిని కాను నేను
నేను.... నేనే!

బాధల బస్తీలోంచి వెలికి వచ్చిన ఆక్రోశాన్ని
అన్యాయాన్ని అకృత్యాన్ని నిరసించే ఆవేశాన్ని
అభ్యుదయాన్ని కోరుకునే ఆశని
నిఖార్సైన సగటు మనిషి నిండు శ్వాసని!

* * *

విప్లవమంటూ విచ్చుకత్తుల
విపరీత ధోరణులను అదేపనిగా నింపి
విపరిమాణాల వికృత మనస్తత్త్వాలను
విచ్చలవిడిగా రెచ్చగొట్టి చిచ్చుపెట్టి
స్వార్థంతో పట్టం కట్టి
సర్వం దోచుకోవాలని పట్టుబట్టి
పెనుమంటను దీపంగా చూపి
వెలుగుకై ఆశపడి వచ్చే రెక్కల పురుగుల
రెపరెపలాడే నూరేళ్ల జీవితాలతో
కలాలు పెట్టి ఆడుకునే
ఇంక్వి"లాభ" కవిని కాను నేను
నేను .. నేనే!

బందిఖానా నుంచి బతుకును తప్పించే నేస్తాన్ని
మరణమే పరిష్కారమైతే ప్రాణమిచ్చే సమస్తాన్ని
దీపంలా కాలినా వెలుగునిచ్చే జవసత్త్వాన్ని-
ఈ సమాజానికి నిండు జీవాన్ని
రాబోయే కాలానికి మూల భావాన్ని —
నిజం నా యిజం
నిజాయితే నా నైజం! *

డా॥ ఎం. విజయదత్తాత్రేయ శర్మ

# ఆంధ్రప్రదేశ పర్వత నామములు- ఒక పరిశీలన

'ఒనమాస్టిక్స్'లో ఒక విభాగమైన 'ఒరోనమి' పర్వతాలకు సంబంధించిన పేర్లను గూర్చి అధ్యయనం చేయునది

దేశ చరిత్రలో పర్వతాల పాత్ర ఆ ప్రమాణంలోనే ఉంటుంది.

**పర్వతాలు - జాతీయ గీతాలు[1] :**

**ఉదా: భారతదేశ జాతీయగీతంలో** వింధ్య, **హిమాచలములు** ప్రస్తుతింపబడినవి. ఆస్ట్రియా (యూరప్ ఖండం) జాతీయగీతం 'ల్యాండ్ డెర్ బెర్జ్, ల్యాండ్ అమ్‌స్ట్రోమి' (పర్వతమయ భూమీ, నదీమహిత భూమీ) అను చరణముతో మొదలవుతుంది జెకోస్లోవాకియా (యూరప్) జాతీయగీతం దేశపు ప్రముఖ జాతులగు జెక్కుల 'క్డేదో మోవ్‌మూజ్' (నా మాతృభూమి ఎచట) అను గీతమును, స్లోవాకుల 'నద్ తత్రే స బ్లిస్కా' (తత్రాపై తుఫాను రేగినది) అను గీతమును ఒకదాని వెనుక మరియొకటి అమరియుండునది తత్రా అనునది ఆ దేశములో ఒక పర్వతము. స్విజర్‌లాండ్ (యూరప్) జాతీయగీతం (ట్రిట్స్ట్ ఇన్ మోర్గాన్ రాట్ ద హేర్, సెహ్ ఇక్‌డిక్ ఇన్‌స్ట్రాలెన్ మీర్" (ఆ పర్వత సీమలపై దివ్య ప్రభావమును సూర్యుడు వెలయించినపుడు) అను చరణము తొలుత కలది స్వీడెన్ (యూరప్) జాతీయగీతం 'దూగామ్లాదాఫ్రియా, దూఖాల్ హోగూనోర్డ్ (హే పర్వత సంశోభిత ప్రాచీన ఔత్తరాహభూమీ) అని మొదలవుతుంది-

**పర్వతాలు - దేశాల పేర్లు :**

కెన్యా (ఆఫ్రికా)కు ఆ పేరు ఆ దేశంలో గల కెన్యా పర్వతముల వలన వచ్చినది.

లెబనాన్ (పశ్చిమ ఆసియా) "అరబిక్ భాషలో లెబనాన్ అంటే తెల్లగా ఉండటం అని అర్థం ఆ దేశంలో కొండలన్నీ తెల్లగా ఉంటాయి కాబట్టి ఆ దేశానికా పేరు వచ్చింది"

సియెర్రాలియోని (పశ్చిమ ఆఫ్రికా తీరమున నున్నది). దేశమున పశ్చిమపు కొననున్న భూభాగము పర్వతమయము. ఇచ్చటి అత్యున్నత శిఖరపు ఎత్తు 880 మీ దీనినే సియెర్రారియోని (సింహగిరులు) అని పోర్చుగీజులు వ్యవహరించిరి. క్రమముగా ఆ పేరే దేశమునకు లభించినది.

హయిటీ (ఉత్తర అమెరికా) ఫ్రెంచివారు ఈ దేశమునకు సెయింట్ డొమింగ్ అను పేరును కల్పించి పాలించిరి.... 1803లో ఫ్రెంచి సేనలు పరాజితము కాగా దేశమును డెస్సాలైన్ స్వతంత్ర రాజ్యముగా ప్రకటించి, తొలుతగ ఆ దేశమునకు ఆదిమ అమెరికనులు వాడిన 'హయిటీ' (పర్వతభూమి) అను పేరునే తిరిగి ఏర్పరిచి, తనను ఆ దేశపు తొలుతటి సార్వభౌముడుగ ప్రకటించుకొనెను."

భారతదేశంలో ఒక రాష్ట్రం - హిమాచల్ ప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లో రెండు జిల్లాలు - ఖమ్మం, నల్గొండ పర్వతనామ సంబంధితములుగ ఉన్నాయి.

అసలు, ఆంధ్ర - తెలుగు - తెనుగు పదములకే పర్వత సంబంధ మూహింపబడినది

ఆంధ్ర - తెలుగు - తెనుగులకు పర్వత సంబంధము

"శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సయుతం
ప్రాకారాంతు మహత్కృత్వాత్రీణి ద్వారా మపాకరోత్"

బ్రహ్మాండ పురాణములోనిదగు పై శ్లోకము శ్రీశైల, మహేంద్రాచలములు త్రిలింగదేశపు ఎల్లలుగా పేర్కొనినది.

"స్వామిం త్రిలింగదేశ పరమేశ్వరః
యెద్దేశ శ్రీభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతి రాజకీర్తి విభవైః కైలాసశైలాః కృతాః
తేదేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయ జాగ్రతు"

కడపటి కాకతీయ చక్రవర్తియగు ప్రతాపరుద్రుని యాస్థాన పండితుడగు విద్యానాధ కవి త్రిలింగదేశపు ఎల్లలులో నొకటిగా శ్రీశైలమును పేర్కొనినాడు.

'కావ్యాలంకార చూడామణి' కర్తయగు విన్నకోట పెద్దన్న (1402 ప్రా)

క. "ధరశ్రీ పర్వత కాళే
శ్వర ద్రాక్షారామ సంజ్ఞవలలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగ దేశమునఁ జను గృతులన్"

అని త్రిలింగదేశ సీమా నిర్ణయము కావించాడు.[2]

"మరికొందరు త్రినగ శబ్దము తెనుఁగయి అందలి నకారము లకారము కాఁగా తెలుఁగయినదని కూడ ఊహించిరి... ఇది తెనుగు) త్రినగ శబ్దభవమని కొందరనిరి. మహేంద్రగిరి, కాళహస్తి, శ్రీశైలము అను మూడు నగములచే చుట్టబడుటచే ఆంధ్రదేశము త్రినగ మయినదని మొదటివారి అభిప్రాయము"[3]

"మన యాంధ్ర దేశమునకు పూర్వోక్తమైన సంజ్ఞలతో ఆంధ్రము, త్రిలింగము, తెనుగు 1-3-4 సంజ్ఞలు పర్వతములచే గలిగినవి. ఆంధ్రశబ్ద నిర్వచనము.

శ్లో॥ "అనంతం ధారమత్లేష దేశశ్శైలా కృతియతః
అనంత ధ్రస్సపవాద్రః పరోక్షేణేంద్ర వత్స్మృతః"

అని పర్వతరూపియైన యనంతుని(శేషాహిని)ధరించుచున్నది గాన యీ దేశము అనంత ధ్రమవంబడెను. అనగా పర్వతరూపియైన అనంతుని ధరించుటచే ఆంధ్రం మనంబరిగెనని యర్థము... ఇవ్విషయ మింకను యతి విపులముగ ఈ శ్లోక వ్యాఖ్యయందు తెలుపబడియున్నది. అహోబలాద్రి, భద్రాద్రి, వెంకటాచలము, (తిరుపతి) అంగము (చిహ్నము)లుగా గల యీ దేశము త్రిలింగ మనంబడుననియు కొందరందురు. ఈ త్రిలింగ శబ్దమే వైకృత రూపముతో తెలుఁగు తెలుగుయని చెప్పబడుచున్నది ఈ యహోబలము మున్నగునవి మూడు పర్వతములు. పర్వతమునకు నగమనియు మరియొక పేరు గలదు. ఈ మూడు నగములు గలది త్రినగంబనబడు. ఈ త్రినగ శబ్దమే వికృత రూపములో తెనుగు అని అయ్యెను. త్రిలింగమను పేరు దేశమునకు గిరిత్రయ చిహ్నమైన కారణముచే వచ్చెనని ముందే చెప్పియున్నది కదా?"[4]

ఆంధ్ర-తెలుగు-తెనుగు శబ్దోత్పత్తి చరిత్ర ప్రస్తుత వ్యాస పరిధిలోనిది కాదు. కేవలము, పర్వతాలకు, దేశ, భాషలకు గల సంబంధ మెంత ప్రగాఢమయినదో తెలుపుటకు మాత్రమే పై చర్చ ప్రస్తావింపబడినది.

పూర్వ శాసనములలో కాలగణనము - పర్వత సంజ్ఞలు[5] :

పూర్వము శాసనములలో కాలమును చెప్పు సందర్భములలో అంకెలకు బదులుగా తత్సూచకములైన గుర్తులను పేర్కొను పద్ధతి కూడ ఉండెడిది. ఏడు (7) సంకేతముగా అద్రి, గిరి, పర్వత, మహీధర, శైల ఇత్యాదిగా పేర్కొనువారు

ఉదా -

శకాబ్దము విభాద్రి ఢగ్నతమున వెలయు (యస్ ఐ.ఐ 10 నెం-138 శ 1078)

గిరి రామఖేందు గణితే (పైది. నెం-74, శ 1037)

శకాబ్దే శైల బాణక్షితి శశిగణితే (పైది నెం-284, శ. 1157)

రాజ్యసీమల సరిహద్దులు : పర్వతములు :

పూర్వ కాలమున పర్వతములు, నదులు రాజ్యములకు ప్రకృతిసిద్ధములైన సరిహద్దులుగా నుండెడివి.

ఉదా :-

"శ్రీ చోడగంగ దేవః.... యన్నేటి మహేంద్ర మధ్యవర్తినో రాష్ట్రకూట
ప్రముఖాన్ కుటుంబి సర్వాన్ సమాహూయ.... ఇద్ద మాజ్ఞాపయతి"

శ సం. 1006 నాటిదైన రాజరాజ చోడగంగు పేకి శాసనం[6]

శ.సం. 1091 నాటిదైన వెలనాటి రెండవ రాజేంద్రచోళుని నండూరు శాసనం[7] ఆంధ్ర విషయ సరిహద్దుల నీ విధంగా పేర్కొనినది

శ్లో॥ పూర్వాభోనిధి కాళహస్తి శిఖరీ
శ్రీమన్మహేంద్రాచల శ్రీశైలేర్వల యీ
కృతాంధ్ర విషయాం శ్రీ రాజరాజ స్వయం॥

బిరుదులు - పర్వతములు :

పై విధంగా శాసనములలో ఒకటికి రెండుసార్లు ప్రస్తావింపబడిన మహేంద్ర పర్వతములు సప్త కులాచములలో నొకటి యని పురాణములు, శాస్త్ర గ్రంథములు పేర్కొన్నాయి.

"మహేంద్రో మలయః సహ్యః శుక్తిమాన్ ఋక్షపర్వతః
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైవాత కులాచలః

-మార్కండేయ పురాణము, అధ్యా-57, శ్లో-10

"వింధ్యశ్చ పారియాత్రశ్చ శుక్తిమాన్ ఋక్షపర్వతః
మహేంద్ర సహ్యమలయాః సప్తైతే కులపర్వతాః"
-కావ్య మీమాంస - 17వ అధ్యా

ఈ మహేంద్ర పర్వతములు చారిత్రక కాలములో కళింగము నందుండినవి. కనుకనే కళింగాధిపతులు తాము మహేంద్రాధినాథులమని చెప్పుకొనుట గలదు

"శాతవాహనానంతరీకులలో నొకరైన ఆనంద గోత్రజులు తాము 'త్రికూట పర్వతాధిపు'లమని చెప్పుకున్నారు. (యస్. ఐ ఐ 6 నెం-594, 95) "త్రికూట పర్వతం నేటి కోటప్ప కొండగా చరిత్రకారులు గుర్తిస్తున్నారు. ఈ కొండ వీరి రాజ్యానికి ఆయువుపట్టు వంటిదై ఉంటుంది"[8]

"విష్ణుకుండిన ప్రభువులకు 'త్రికూట మలయాధిప' అను విశేషణము శాసనములలో కానవచ్చుచున్నది. త్రికూట మనగా గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకాలోని కోటప్పకొండ. మలయ మనగా తూర్పు కనుమలు. ఈ ప్రాంతములకు విష్ణుకుండినులు ప్రభువులని దీని భావము"[9]

"విష్ణుకుండి పదం వినుకొండ (గుంటూరు జిల్లా)కు సంస్కృతీకరణమని అది వారి ప్రథమ నివాసమని కీల్‌హారన్ పండితుని సూచన కాని వేల్పూరు శాసనాన్ని బట్టి విష్ణుకుండి అనేది గోత్రనామం అని తెలుస్తున్నది ఏమైనా విష్ణుకుండులకు వినుకొండతో సంబంధం లేకపోలేదని చాలమంది చరిత్రకారుల విశ్వాసం. విష్ణుకుండులు త్రికూట మలయాధిపులమని, అమరపురీశులమని చెప్పుకొన్నారు త్రికూటం సహ్యాద్రుల లోనిదని అమరపురి అమ్రమెత్ అని అందుచే వీరు మహారాష్ట్ర ప్రాంతం నుండి వలస వచ్చినారనే కొందరి అభిప్రాయంతో ఇప్పుడు ఏకీభవించేవారు లేరనే చెప్పవచ్చు 'త్రికూట మలయాధిప బిరుదాన్ని విష్ణుకుండులు కందార రాజులనుండి గ్రహించినారని తెలుస్తున్నది. త్రికూట మలయం కోటప్పకొండే గాని వేరేమీ కాదు"[10]

గిరి దుర్గములు

'సర్వజ్ఞ' బిరుదధారియైన పశ్చిమ చాళుక్య ప్రభువు నందన సోమేశ్వరుడు (1126-1139) 'సకల భారత విజ్ఞాన పేటిక' యని ప్రశంసను గన్న 'మానసోల్లాస' మను నామాంతరము గల 'అభిలషితార్థ చింతామణి'లో నవ విధములైన దుర్గములను పేర్కొన్నాడు. 'శుక్రనీతిసారము' ధన్వ, మహి, జల, వృక్ష, గిరి, నృ దుర్గములని ఆరు విధములైన దుర్గములను పేర్కొన్నది.

ఆంధ్రదేశమునందు స్థల, గిరి, వన, జల దుర్గములుండినవి. "ఎంత విషయములైన స్థల, జల, వన, గిరి దుర్గములను భేదించి కైవసము చేసికొనగల సమర్థుడగుటవలన తూర్పు చాళుక్య రాజ్యస్థాపకుడగు కుబ్జ విష్ణువర్ధనునకు 'విషమసిద్ధి' అను బిరుదు సిద్ధించింది.[11]

రెడ్డిరాజులు 'సంగర గౌతమీ సలిల (సంగమ) సకల జల దుర్గన్ సాధన రఘురామ'; 'రాజమహేంద్ర నిరవద్య నగరాది బహువిధ స్థలదుర్గన్ వర్గన్ విదళన బలరామ', 'దివిజల దుర్గన్ విభాళా'ది బిరుదులు వహించారు.[12]

రాచకొండ వెలమలు 'స్థలదుర్గ విభాళ', 'జలదుర్గ బడబానల', 'వనదుర్గ దావానల', 'గిరిదుర్గ మల్లా'ది బిరుదులు గైకొన్నారు.

ఆరెవీటివారు 'సప్తదుర్గ ప్రవర్తి స్థలదుర్గ, జలదుర్గ, గిరిదుర్గ, వనదుర్గ చేరాసిదుర్గ విభాళుల' మని చెప్పుకున్నారు

ఆంధ్రదేశమున వన, అచల, జల, స్థల దుర్గము లుండినట్లు శాసనములు విదితము చేయుచున్నవి

"ముమ్మడి నాయకుని శ సం 1275 క్రీ.శ. 1353 కోరుకొండ శాసనములో, శ. సం. 1280 క్రీ శ. 1358 శ్రీరంగం శాసనములో

శ్లో॥ పానార - కోన - కురవాటక - చెంగరాదీన్
గోదావరీ ముభయతోయ ముపాంతదేశాన్
జిత్వా వనాచల జలస్థల దుర్గరమ్యా
నేకః ప్రశాస్తి చిరమ ప్రతి శాసనం సః॥

సింగయనాయకుని శ.సం. 1290 క్రీ.శ. 1368 అక్కలపూడి శాసనములో

ప్రథితోభయ గోదావరి మధ్య ప్రాంతేషు
మహిత సౌభాగ్యే పాలయతి ముంమ్మడేం
ద్రశ్చైలగర - కురవాట కొనపానారాః స్థల
జలగిరి వనదుర్గా నాక్రమోపేత...

అనియు దుర్గములు వర్ణింపబడియున్నవి.

పై మూడు (కోరుకొండ, శ్రీరంగము, అక్కలపూడి) శాసనములను బట్టి పానార - కోన - కురవారు - చెంగర ప్రాంతములు క్రమముగా వన - అచల - జల - స్థల దుర్గములుగా తెలియుచున్నవి."[13]

గిరిదుర్గము మిగిలినవాటికంటె ఎక్కువ సురక్షితమని 'మనుధర్మ శాస్త్రము' నుడువుటను బట్టియా అన్నట్లు ఆంధ్రదేశమున గిరిదుర్గములు ఎక్కువగనే కానవస్తాయి.

ఆంధ్రదేశస్థ గిరిదుర్గములలో ప్రధానమైనటువంటివి.[14]

1) అనంతగిరి (నల్గొండ జిల్లా, హుజుర్‌నగర్ తా॥)
2) ఆదవాని (కర్నూలు జిల్లా, ఆదోని తా॥)
3) ఇంద్రుకొండ (నల్గొండ జిల్లా, సూర్యాపేట తా॥)
4) ఉదయగిరి (నెల్లూరు జిల్లా, ఉదయగిరి తా॥)
5) కొండపల్లి (కృష్ణాజిల్లా, విజయవాడ తా॥)
6) కొండవీడు (గుంటూరు జిల్లా, నరసరావుపేట తా॥)
7) కొయ్యలకొండ (మహబూబ్‌నగర్ జిల్లా & తా॥)
8) కోరుకొండ (తూర్పు గోదావరి జిల్లా, రాజమండ్రి తా॥)
9) ఖమ్మముమెట్టు (ఖమ్మం జిల్లా & తా॥)
10) గండికోట (కడప జిల్లా, జమ్మలమడుగు తా॥)
11) గుత్తి (అనంతపురం జిల్లా, గుత్తి తా॥)
12) గోలకొండ (హైదరాబాద్)
13) దేవరకొండ (నల్గొండ జిల్లా, దేవరకొండ తా॥)
14) నల్గొండ (నల్గొండ జిల్లా & తా॥)
15) ప్రతాపగిరి (కరీంనగర్ జిల్లా, మంథెన తా॥)
16) పెనుగొండ (అనంతపురం జిల్లా, పెనుగొండ తా॥)
17) బెల్లంకొండ (గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తా॥)
18) బోనగిరి (నల్గొండ జిల్లా, భువనగిరి తా॥)
19) మెదక్ (మెదక్ జిల్లా & తా॥)
20) రామగిరి (తూ॥ గో॥ జిల్లా, రాజమండ్రి తా॥)
21) రాచకొండ (నల్గొండ జిల్లా)
22) వినుకొండ (గుంటూరు జిల్లా, వినుకొండ తా॥)
23) వేలుపుకొండ (వరంగల్ జిల్లా & తా॥)

ఆంధ్రప్రదేశ్‌లో 23 జిల్లాలు కలవు. కావున 23 ఉదాహరణలు పైనీయబడినవి. పై జాబితా ప్రకారం రాయల సీమలో 4, ఆంధ్ర ప్రాంతములో 7, తెలంగాణాలో 12 గిరి దుర్గములు కానవస్తాయి. అట్లుండుటకు ఆయా ప్రాంత భౌగోళిక స్వరూప స్వభావములు కారణములు కావచ్చును.

మధ్యాంధ్రయుగములో అశ్వపతి, గజపతి, నరపతుల పెనుగులాటలలో గిరిదుర్గముల ప్రాముఖ్యత మరింత హెచ్చైనది. ఇందులకు సాక్ష్యము శ్రీనాథుడు.

సీ. పరరాజ పరదుర్గ పైభవశ్రీల
గొనకొని విడనాడు కొండవీడు
పరపంథి రాజన్య బలముల బంధించు
గురుతైన మురితాడు కొండవీడు
ముగ్గురు రాజులకును మోహంబు బుట్టించు
కొమరు మీరిన వీడు కొండవీడు
చటుల విక్రమ కళా సాహసం బొనరించు
కుటిలాత్ములకు సూడు కొండవీడు

కొండవీటిపై మోహము గొన్న ముగ్గురు రాజులు 1) అశ్వపతులైన బహమనీ సుల్తానులు 2) గజపతులైన కటక సూర్యవంశజులు 3) నరపతులుగా విఖ్యాతులైన విజయనగర రాజులు.

ఈ కొండవీడు దుర్గమును నొక చాటువు ఈ విధంగా ప్రశంసించినది.

ఉ. ఘోటక భోటహాటకురు కొంకణ సింధు మరాట లాటక
ర్ణాట కళింగ వంగ ద్రవిళాంగ విదేహ కరూశ దుర్గముల్
పాటియె యన్న వేమ విపులా విభుఁడేలిన దుర్గమైన యా
ఘోటక హాటక ప్రకట కుంజర ధాటికి కొండవీటికిన్

దుర్ఘటములైన ఆయా గిరిదుర్గములను హరించుట ఘన కార్యమై యుండెననుటకు ఆయా విజేతలు, వారి ఆశ్రిత కవులు ఆ విషయములను శాసన, సాహిత్యములందు ప్రత్యేకముగా పేర్కొనుట వలన తెలియనగును.

నంది మల్లయ, ఘంట సింగయ్య కవులు తమ వరాహ పురాణ కృతిభర్తయైన తుళువ నరసరాయల తండ్రి ఈశ్వర నాయకుని విజయ వర్ణనా సందర్భమున గిరిదుర్గములను పేర్కొన్నారు.

సీ ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోట పురంబు గదలఁ ద్రవ్వె
.... .... .... .... .... .... ....

పిల్లలమర్రి పిన వీరభద్రుడు జైమిని భారతములో సాళువ నరసింహరాయలు జయించెనని చెప్పినవాటిలో కొన్ని గిరి దుర్గములు.

మ. కనకాద్రి ప్రతిమాన ధైర్య జగదేక స్తుత్య సౌభాగ్య మో
హన లీలానవ పంచబాణ నిజ బాహాశౌర్య వీరా విరా
జినయోపాయ విహార భోనగిరి చెంజేకొంగుదారాపురీ
పెనుకొండా ద్యఖిలైక దుర్గహరణ ప్రేంఖత్ప్రతాపోదయా

ఈ క్రింది శ్లోకములో శ్రీకృష్ణదేవరాయల కాలమున (**1509-1530**) గల రాజ్యములను గమనించిన మధ్యాంధ్ర యుగమున గిరిదుర్గ రాజ్యముల ప్రాముఖ్యము తేటపడగలదు.

ఘనగిర్యాఖ్య రాజ్యేచ గుత్తి రాజ్యేచ విశ్రుతే
రాజ్యే కందనవోల రాజ్యే గండికోట స్థలో పిచ
సిద్ధవట రాఖ్యయో సిద్ధ పౌత్తపి సీమాఖ్య విశ్రుతే
చంద్రగిరాఖ్య రాజ్యస్య నామ మండల సీమని

"శ్రీ వీర ప్రతాప శ్రీకృష్ణదేవరాయ మహారాయలు విజయనగరాన నుండ్డి పూర్వన్ దిగ్విజయ యాత్రకు విచ్చేసి వుదయగిరి దుగ్గనం సాద్దించ్చి తిరుమల రౌతురాయ మహాపాత్రునిం బట్టుకొని అద్దంకి వినికొండ్డ తంగ్గేడ కేతవరం మొదలైన గిరిదుగ్గన్ స్థలదుగ్గాన్ లనిన్ని యేకధాటం గైకొని...."

మ ఇది కర్ణాట ధరం ధృతిస్థిర భుజా హేహా కలద్బే ధరా
డుదయోర్వీధర తల్పితృవ్యకృత నవ్యోపాయనోష్టేష ర
త్న దృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోది తాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్య పద్యముల నాద్యంబై మహిం
బొల్చుగున్

-శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద'

మ. ఇది పాత్రప్రహరేశ్వర ప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్తదివిప్ప్రుక్పటుయంత్ర కొండపల్లి హృద్భాహాసి కద్రూజ దీ
వ్యదుదారోద్యమ కృష్ణరాయ నృప సంజ్ఞా స్మృతక్స్రుదాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం
బొల్చుగున్

- ఆముక్తమాల్యద.

సీ. ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
వినుకొండ మాట మాత్రాన హరించెఁ
గూటముల్చెదరంగఁ గొండవీడ గలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండ యద్భుతభంగము సేసె
జల్లిపల్లి సమగ్రశక్తిఁ గూల్చె
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁ జేసె
గంబముమెట్టు గ్రక్కున గదల్చె

ముక్కు తిమ్మన పారిజాతాపహరణ కావ్యంలో శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయ వర్ణన పైవిధంగా గావించాడు.

అళియ రామరాయలు జయించిన గిరిదుర్గములను రామరాజీయ మీవిధంగా పేర్కొన్నది.

తే. సకలవిభు తిమ్మరాజు సేనలను ద్రుంచి
గుత్తి పెనుకొండ మలయ గండికోటఁ గంద
వోలు పురమా దవే నవలీలఁ గెల్చి
దొలు దొలుత రామనృపతి దోర్బలము మెఱసె

అద్దంకి గంగాధర కవి తన 'తపతీ సంవరణోపాఖ్యాన' కృతిపతియైన ఇబ్రహీం కుతుబ్ షా(**1530-80**) 'గిరిదుర్గలుండను' దని ఈ విధంగా వర్ణించాడు

సీ. పడమటను సవాయి బసవనిగా జేపి
యచట గోయ్యలకొండ నావరించె
దమరి మల్లాఖాను దక్షిణంబునఁ గొట్టి
హరియించెఁ బానుగల్లాది గిరుల
నుత్తరంబున బరీదోడి పాఱగదోలి
మెతుకు దుర్గం బాక్రమించె
బ్రథమ దిక్కున నొడ్డి పాత్ర సామంతుల
ధట్టించి కంభముమెట్టు గొనియె

సీ. కటకేశ్వరుని దోలి కైవసంబుగ జేసె
కొండంత జయముతో కొండపల్లి

ఖమ్మం జిల్లా ఎత్తు 300 అడుగులు మాత్రమే. అయితే హరిభట్టు 'వరాహ పురాణం'లో ఈ స్తంభాచలాన్ని ఇలా వర్ణించాడు

గీ ఆంధ్ర మండల గిరిదుర్గ హారలతకు
విమల నాయక రత్నభావము భజించి
యున్నతోన్నత శైలసంపన్న యగుచు
సకల పుట భేదనముల నెన్నికకు నెక్క

ఇక శాసనములలో ఘనాద్రి, ఘనగిరి అని ప్రస్తుతింపబడిన పెనుగొండను వసుచరిత్రకారుడీ విధంగా అభివర్ణించ దానికి అభ్యంతరం ఏమీ ఉండకూడదు.

చం. తిరుమలరాయ శేఖరుని ధీరచమూ భటరాజియాజి భీ
కర యవనేశ్వర ప్రహిత ఖానబలంబుల జక్కుసేయ ని
ద్దర పెనుగొండ కొండలు మదద్విప చర్మ కపాలమాలికా
పతికర భూషితంబులయి బల్విడిగాంచె గిరీశ భావమున్

ప్రాచీన, మధ్య-యుగములలో పాలనా విభాగములు-పర్వతములు

కంపనము, క్షితి, దండపాట, దేశము, నాడు, పదము, పాంచాలి, భూమి, భోగము, మండలము, మార్గము, రాజ్యము, రాష్ట్రము, వాడి (పాడి, బడి), వళితము, విషయము, సీమ వంటి పరిపాలనా విభాగములు ప్రాచీన, మధ్యయుగములలో ఆంధ్ర దేశ మున ప్రాచుర్యములో నుండెడివి ఇందు కొన్ని సమానార్థకములు కాగా మరికొన్ని అంతర్గత విభాగములై యుండెడివి ఒకే విభాగమునకు వివిధ కాలములలో వేరు వేరు పేర్లు వాడుటను కలదు

గిరిదుర్గములను బట్టియో, పర్వత సూచక నామములు గల కేంద్ర స్థానములైన ఊర్లను బట్టియో ఏర్పడిన ఈ క్రింది పాలనా విభాగములను గమనింపవచ్చును.

అ(హ)నుమకొండ విషయము :

శ. సం. **1012** (క్రీ శ. **1090**) నాటిదగు ఖాజీపేట శాసనము[15] ఈ విషయాన్ని పేర్కొనినది. "తత్తద్భూయత మన్మకొండ విషయం త్రైలోక్యమల్ల క్షమాధీశచ్ఛాసన బద్ధ యుద్ధతజయీ సంలబ్దవాన్మాశ్వతం" ఈ శాసనంలో నేడు వరంగల్ అని వ్యవహరింపబడే 'ఓరుగల్లు' అని పూర్వము చెప్పబడే 'ఏకశిలా' నగరాన్ని 'ఒంటికొణ్డ' అని పేర్కొన్నది.

ఆదివాని[16], రాజ్యము, వళితము, సీమ :

శ. సం. **1436** నాటి శాసనములో 'రాజ్య'మనియు, శ సం. **1436** నాటి శాసనములో 'వళిత' మనియు, శ సం. **1482** నాటి శాసనములో 'సీమ' యనియు 'ఆదవాని' పేర్కొనబడినది. ఈ భాగము నేటి ఆదోని, కర్నూలు తాలూకాల ప్రాంతములకు సరి పోవునదిగా గుర్తింపబడినది.[17]

ఉదయగిరి రాజ్యము, సీమ :

నేటి ప్రకాశం జిల్లాలోని పొదిలి, కందుకూరు, కనిగిరి తాలూకాలు, ఉదయగిరి రాజ్యములోనివై యుండగా ఉదయగిరి సీమ నేటి నెల్లూరు జిల్లాలోని కావలి, ఆత్మకూరు తాలూకాలకు పరిమితమై యుండెడిది.[18]

ఉదయగిరి మాజన్‌వాడి శ సం. **1442** నాటి నొక శాసన ములో ప్రస్తావించబడినది.[19]

ఉరవకొండ సీమ[20] .

**16**వ శతాబ్దము నాటి శాసనములనుబట్టి ఈ సీమ నేటి అనంతపురం జిల్లాలోని అనంతపురం, ఉరవకొండ, గుత్తి తాలూకాల ప్రాంతమని గ్రహింపవచ్చును.

కొండనతవాడి :

నతవాడి, క్రొన్నాతవాడి అని కూడ శాసనములందు ప్రశక్త మైన ఈ విభాగపు పరిధిని గూర్చి విభిన్నాభిప్రాయములు గలవు. డా॥ నేలటూరి వెంకట రమణయ్యగారు[21] ఇది కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకా ప్రాంతమనియు, ఈశ్వరదత్తుగారు[22] సత్తెనపల్లి తాలూకా ప్రాంతమనియు, డా॥ యశోదాదేవిగారు[23] బెజవాడ - అమరావతి ప్రాంతమనియు అభిప్రాయపడినారు.

డా॥ యస్ జె మంగళంగారు[24] ఇది గుంటూరు జిల్లాలోని గుంటూరు, సత్తెనపల్లి తాలూకాలకు సరిపోవు ప్రాంతమని నిశ్చ యించి కొండనతవాడి నతవాడి విషయము,' కొండ పడుమటి ప్రాంతము కలిసి రూపెత్తిన విభాగమని గమనించారు

కొండనాడు :

శ. సం. 1235 నాటి శాసనములో[25] ఈనాడు ప్రస్తావింప బడినది. కొండ పడుమటిలోని ఒక భాగముగా గుర్తింపబడినది [26]

కొండపడుమటిదేశము :

శాసనములలో గిరిపశ్చిమ[27], గిరిప్రతీచి[28], కుత్కీల ప్రత్యగుర్వి[29] అని కూడ పేర్కొనబడి కొండవీటి కొండకు పశ్చిమదిశలో నుండిన ఈ దేశము నేటి గుంటూరు జిల్ల గుంటూరు, సత్తెనపల్లి, నరసరావుపేట తాలూకాలలో విస్తరించ కొనియుండెడిది.[30]

కొండపల్లినాడు :

శ. సం. **1107** నాటి శాసనములో ప్రసక్తము[31]. కృష్ణ జిల్లాలోని కొండపల్లికి సంబంధించినది కాదనియు, నల్గొండ జిల్ల సూర్యాపేట తాలూకాలోని నేలకొండపల్లి కేంద్రస్థానముగా కలిగి విభాగమనియు గుర్తింపబడినది.[32]

శ. సం. 1452 నాటి కులీకుతుబ్‌షా శాసనములో[33] ప్రసక్తమైన కొండపల్లి రాజ్యము, వేరొక శాసనములో[34] పేర్కొనబడిన కొండపల్లి దండపాట కృష్ణాజిల్లాలోని కొండపల్లి సంబంధించినవై యున్నవి.

కొండవీడు :

వేరు వేరు శాసనములలో కొండవీడు కేంద్రంగా దండపాట[35], రాజ్యము[36], విషయము[37], సీమ[38] అను పాలన విభాగము లుండినట్లు తెలియజేయుచున్నవి.

కొండూరు స్థలము.

శ సం. 1239 నాటి ఒక శాసనంలో[39] కొండూరి స్థలము పేర్కొనబడినది. ఇది గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని పెద కొండూరునకు సంబంధించినది. అయితే అదే స్థలానికి చెందిన అంతకుపూర్వపు శాసనములలో శ సం. 1092,[40] శ. సం 1095,[41] కొండూరు కొంద్రూరుగా చెప్పబడినది. ఈ పెదకొండూరి దాపున ఏ చిన్న కొండ కూడా లేకపోవుట బట్టియూ మరి ఇతర సాక్ష్యముల బట్టియూ ఈ కొండూరు, దేవరకొండ (కృష్ణాజిల్లా, దివి తా॥), ఉప్పుగొండూరు (పెదగంజాం సమీపం), పెనుగొండ (పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తా॥) వంటివి వర్తక వాణిజ్య కేంద్ర స్థానములని (కొని-కొన్రు-కొండ్రు) పరిశోధకులు గుర్తించారు[42]

కోరుకొండ స్థలము

సూర్యవంశ గజపతుల పాలనమందు రాజమహేంద్రవర రాజ్యము లేక దండపాటలోనిదైన కోరుకొండ స్థలము[43] తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రి తాలూకాకు చెందినది.

గిరి కళింగము:

5వ శతాబ్దినాటి నొక్క శాసనములో ప్రసక్తమైన గిరికళింగము నేటి శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ, వీరవల్లి, నరసన్నపేట తాలూకాలలోని కొండచానుల ప్రాంతముగా గుర్తించబడినది.[44]

గుత్తి రాజ్యము, సీమ:

16వ శతాబ్దినాటి శాసనములలో గుత్తి రాజ్యము[45], సీమ[46] పేర్కొనబడినవి గుత్తి అనంతపురం జిల్లాలోని గుత్తి తాలూకాకు ముఖ్యనగరము. "ఇదియొక బలిష్ఠమైన గిరిదుర్గము... గుత్తి రాజ్యము అనంతపురం మండలంలోని గుత్తి, తాడిపత్రి తాలూకా ప్రాంతమని యూహింపనగును "[47]

గోలకొండ రాజ్యము:

"నేటి ఆంధ్రప్రదేశ భూభాగము నందలి వివిధ మండలము లన్నియు ఆనాడు గోలకొండ రాజ్యాంతర్గతములే యని తెలియ నగును."[48]

చంద్రగిరి రాజ్యము

చిత్తూరు మండలములోని చంద్రగిరి, కాళహస్తి తాలూకాలలో విస్తరించుకొని యుండెడిది.[49]

చరిగొండ సీమ:

మహబూబ్ నగర్ జిల్లా ఉత్తర ప్రాంతము.[50]

దేవరకొండ రాజ్యము, సీమ

దేవరకొండ నేటికిని నల్గొండ జిల్లాలో ఒక తాలూకాకు ప్రధాన నగరమై యున్నది.

నల్గొండసీమ.

గోల్కొండసీమ కుతుబ్‌షాహీల పాలనమున ఒక సీమకు ప్రధాన స్థానము. ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో ఒక జిల్లా కేంద్రము

నాగార్జునకొండ సీమ:

శ సం 1519నాటి శాసనములో[51] ప్రసక్తము. గుంటూరు జిల్లా పల్నాటి తాలూకాలో అంతర్భాగముగా గుర్తింపబడినది

పాలకొండ రాజ్యము:

శ. సం 1392, 1393 నాటివగు శ్రీకూర్మ శాసనము లలో[52] పాలకొండ రాజ్యము పేర్కొనబడినది. పాలకొండ నేటికిని శ్రీకాకుళం జిల్లాలో నొక తాలూకా కేంద్రమై యున్నది.

పెనుగొండ మాజన్‌వాడి.

శ. సం. 1442 నాటి శాసనమున ప్రసక్తము.[53] అనంతపుర మండలములోనిది.

పొలిగొండ స్థలము:

ప్రకాశం జిల్లా దర్శి తాలూకా ప్రాంతము.[54]

బెల్లముకొండ సీమ:

16, 17, 18 శతాబ్దములలో కొన్ని శాసనములలో ఈ సీమలోనివిగా చెప్పబడిన గ్రామముల నిర్దేశనమును బట్టి నిది బెల్లముకొండ గిరిదుర్గ సమీప ప్రాంతమగు నేటి సత్తెనపల్లి తాలూకా (గుంటూరు జిల్లా) లోని కొంత ప్రాంతమై యుండునని పరిశోధ కాభిప్రాయము.[55]

మంచికొండనాడు, విషయము:

తూర్పు చాళుక్య మొదటి భీముని కాలమునకు చెందిన కొరవి శాసనములో[56] మంచి కొణ్డనాడు ప్రస్తావింపబడినది

"వేములవాడ చాళుక్య రాజ్యమునకు తూర్పున వేంగి దేశము నంటి ముదిగొండ చాళుక్యుల సామంతరాజ్య ముండెను. కృష్ణాజిల్లాలోని కొండపల్లి నుండి వరంగల్లు జిల్లాలోని కొరవి వరకును గల దేశమును మంచికొండ విషయమందురు.... పూర్వ కాలమున పల్లవ సార్వభౌముడగు ముక్కంటి (త్రిలోచన పల్లవుడు) గంగాతీరము నుండి ఇరువురు సర్దారులను ఆంధ్ర

దేశమునకు తీసికొని వచ్చెను వారు ఆంధ్రదేశమున మంచికొండ అను పట్టణమును స్థాపించిరి. ఆంధ్రదేశ విభాగములోని మంచి కొండ అను సీమ కొరవిసీమ (వరంగల్ జిల్లా మానుకోట ప్రాంతము) ప్రక్కన ఉండెను "[57]

మలై మండలము :

కడప - నెల్లూరు ప్రాంతపు పర్వతశ్రేణుల ననుసరించి ఈ విభాగ ముండినట్లు గమనింపబడినది.[58]

మలయ మండలము

శ. సం. 1051 నాటిదగు ఒక శాసనం[59] మలయ మండలము వేంగినాటి లోనిదిగా పేర్కొన్నది. ఈ మండలము ఇప్పటి పడుమటి గోదావరి జిల్లా కోవూరు, నిడదవోలు తాలూకాలలో గోదావరి తీరము నంటియున్న కొంత భాగముగా గుర్తింప బడినది.[60]

మహేంద్రభోగము :

మాఠర వంశీయుడైన ఉమావర్మ (400 - 430) ధవళపేట శాసనము[61] నందలి స్థల నిర్దేశనమునుబట్టి మహేంద్రభోగము శ్రీకాకుళం తాలూకా ప్రాంతమని నిశ్చయించుటకు వీలగుచున్నది.

వినుకొండ సీమ :

హంపీ విజయనగర, సూర్యవంశ గజపతుల శాసనములలో ప్రసక్తమైన ఈ సీమ వినుకొండ గిరిదుర్గ సమీప ప్రాంతమైన వినుకొండ తాలూకా (గుంటూరు జిల్లా) ప్రాంతముగా ఎంచవచ్చును.[62]

వేల్పుగొండ ·

కళ్యాణి చాళుక్య ఆరవ విక్రమాదిత్యుని శాసనము[63] (క్రీ.శ. 1124) వేల్పుగొండ-24ను పేర్కొన్నది వరంగల్ జిల్లాలోని ప్రస్తుత జఫర్‌ఘడ్ పూర్వము వేల్పుగొండ. దీనికి అమోఘ కూటగిరి యని పేరుండెను[64] రాష్ట్రకూట ప్రభువైన అమోఘవర్షుని మూలకముగా ఆ పేరు వచ్చియుండవచ్చును

## రాజవంశ నామములు - పర్వతములు

శ్రీపర్వతీయాంధ్రులు :

"సాతవాహన సామ్రాజ్యము భగ్నమయిన తర్వాత కృష్ణా ప్రాంతపు ప్రాగాంధ్ర దేశమును పరిపాలించినవారు ఇక్ష్వాకు వంశజులు. వీరినే పురాణములు శ్రీ పర్వతీయాంధ్రులని, ఆంధ్ర భృత్యులు (ఆంధ్ర సాతవాహన భృత్యులు) అని పేర్కొనుచున్నవి. నాగార్జునకొండకు క్రీస్తుశకారంభ శతాబ్దములలో శ్రీపర్వతము అనెడి పేరు ఉండినట్లు తెలియుచున్నది శ్రీపర్వతము అనునది నాగార్జునకొండకు మాత్రమే పేరు కాదనియు, అప్పటినుండి కృష్ణానదీ తీరముననే కర్నూలు జిల్లలోనికి వ్యాపించిన నల్లమల కొండల చాలునంతటికిని ఆ పేరు చెల్లెననియు, కొందరు చెప్పుదురు... పురాణములు పేర్కొన శ్రీపర్వతీయాంధ్రులు ఇక్ష్వాకులు గారనియు, వారు 'చుటు' కులమునకు చెందిన వేరొండు సాతవాహన సామంత వంశ లనియు-కొందరు చెప్పుదురు "[65]

ఏమైనా ఒక సాతవాహన సామంత వంశనామాని శ్రీపర్వత నామమునకు అనుబంధమున్నది.

ముదిగొండ చాళుక్యులు

"పూర్వ మధ్యయుగమున తెలుగుదేశమున వేంగీ చాళుక్య పక్షము వహించి రాష్ట్రకూటులకు ఎదురొడ్డి నిల్చి తరువాత కాలమున కాకతీయులను సైతము, కొంత దనుక ప్రతిఘటించి సామంత రాజవంశములలో ముదిగొండ చాళుక్య వంశము ఒకటి ముదుగొండూరు తొలి రాజధానిగా వెలుగులోనికి వచ్చిన వంశ మగుటచేత ఇది ముదిగొండ చాళుక్య వంశమని వ్యవహరింపబడ చున్నది. ఈ ముదుగొండూరు ప్రస్తుతము ఖమ్మం ప్రాంతములో ముదిగొండ గ్రామమే."[66]

మలయావని సూర్యవంశజులు :

"ఇప్పటి తూర్పు, పడమటి గోదావరి జిల్లాలలోని పాపికొండల ప్రాంతమునకు మలయ మండలమని, మలయావని యని పేరు. పాపికొండకు మాల్యవంతమని పేరు ఈ మలయ వనిని తాము సూర్యవంశ్యులమని చెప్పుకొనిన రాజుల పరిపాలించిరి. వీరు చాళుక్య రాజ్యసౌధమునకు మూల స్తంభముల వంటివారు."[67]

కొండపడుమట రాజులు :

'గిరి పశ్చిమ శాసన'[68] కులమని చెప్పుకున్న కొండపడపడుమటి రాజులు తూర్పు చాళుక్యచోడ చక్రవర్తుల సామంతులు. ఈ కొండపడుమటి దేశమునకే సంస్కృత రూపములు గిరి పశ్చిమ దేశము, గిరిప్రతీచీ దేశము, కుత్కీల ప్రత్యగుర్వి. కొండవీటి కొండకు పశ్చిమమ దిశలోనున్న దేశమునకే కొండపడుమటి దేశమని పేరు.

కొండపడుమటి దేశము నేలిన దుర్జయ వంశజుడొకడు తాను 'కుత్కీల ప్రత్యగుర్వి విభుడనని' చెప్పుకున్నాడు.[69]

కొండవీటి రెడ్డిరాజులు :

మధ్యాంధ్రయుగమున విఖ్యాతమైన రెడ్డిరాజులకు కొండవీడు రాజధాని. అందుచే వారు కొండవీటి రెడ్డి రాజులుగ చరిత్రలో వ్యవహృతులు.

మంచికొండ నాయకులు :

ముసునూరి కాపయ నాయకునకు తీరాంధ్రమున బాసటగా నుండి కోరుకొండ (రాజమండ్రి తా॥) కేంద్రంగా పాలించినవారు మంచికొండ వంశీయులు. "మంచికొండ అనునది గోత్రనామమో, గృహ నామమో "[70]

శైలేంద్ర రాజులు :

క్రీ. శ. 8వ శతాబ్దమున మలయా యందు స్థాపితమైన శైలేంద్ర రాజ్యము 9వ శతాబ్దిలో ఇండోనీషియా అంతటినీ లోగొనినది "ఫూనాన్ సామ్రాజ్యాన్ని అన్నాం నుండి మలయా వరకు పాలించినవారు శైలరాజులని చెప్పబడింది. వారు శివారాధకులు. వారి వంశము పవిత్ర శైలరాజ్యమైన శ్రీపర్వతము నుండి ఉద్భవించినదని చెపుతారు "[71]

## హిందూమత సంబంధిత పర్వత నామములు

అక్కదేవతలకొండ (కడప జిల్లా, రాయచోటి తాలూకా):

స్థానిక గాథ ప్రకారం ఒకానొక కాలంలో ఒకానొక పాలకుని ఏడుగురు కుమార్తెలు తమని బలవంతంగా పరిణయ మాడటానికి ఎత్తివచ్చిన పరరాజు నుంచి తమ మానాభిమానాలను కాపాడుకోవడానికి అక్కడ గల కొండపై నుంచి మడుగులో పడి ప్రాణాలు విడిచారు కాబట్టి ఆ కొండకు 'అక్కదేవతల కొండ' అని పేరు వచ్చింది.[72]

కడప జిల్లా, బద్వేలు తాలూకాలోని అక్కంగుండ్ల గ్రామ నామం గురించి వివరిస్తూ కొత్త విశ్వనాథరెడ్డి. "అక్కమ్మ, అక్కన్న, అక్కప్ప, అక్కయ్య, అక్కారెడ్డి, అక్కిరెడ్డి, అక్కి, అక్కు, అక్కులు మొదలైన పేర్లు అక్కదేవతలను సూచించేవే. వీరినే సప్తకన్యలనీ, ఆకాశ కన్యలని కూడా వ్యవహరిస్తారు. వీరు జలాశయాల అధిదేవతలు (వైట్ హెడ్). ద్రావిడ దేవతలయినప్పటికీ, వీరు పార్వతికి సద్యోగర్భాన జన్మించిన లక్ష్మీదేవి అంశమని ఐతిహ్యం రాయలసీమలో అక్కదేవతల పూజకు అధిక ప్రచారం ఉంది. కడప జిల్లాలో రాయచోటి తాలూకాలో 'అక్కదేవతల కొండ' ఉంది "[73]

అనంతగిరి

"రాజనీతి రత్నాకరము" అను ప్రబంధమును వ్రాసిన నేబతి కృష్ణయామాత్యుడొక అనంతగిరిని పేర్కొనియున్నాడు. ఈతని కాలము క్రీ.శ 1580-1612 సిద్దలూరుకు సమీపము నందున్న అనంతగిరి నరసింహస్వామి ఈతని ఇలవేల్పు. సిద్దలూరు గ్రామము హైదరాబాదు జిల్లా, వికారాబాదు తాలూకాలో ఉన్నది. వికారాబాదు తాలూకాలో అనంతగిరి కొండలున్నవి నేబతి కృష్ణయామాత్యుడు పేర్కొనిన అనంతగిరి ఇదియేనని చెప్ప వీలగుచున్నది. ఈ కొండమీద నరసింహస్వామి ఆలయము ఉన్నవైనము ధ్రువపడలేదు ఇంకను విచారింపవలసి యున్నది. ఇచ్చట నేడు అనంత పద్మనాభస్వామి ఆలయము మాత్రమే ఉన్నట్లు తెలియుచున్నది నృసింహస్వామి ఆలయము లేదు.

గుంటూరు మండలం పల్నాటి సీమలో కొండవీటి పాలకు డగు కుమారగిరి రెడ్డి కాలమున (క్రీ.శ 1386 - 1402) అతని ప్రతినిధిగా తంగెడ సీమను ఏలుతూ ఉండిన చొక్కన సింగన తనకు స్వప్నంలో వినవచ్చిన భగవంతుని ఆజ్ఞ మేరకు అనంత గిరి వద్ద నరసింహస్వామి ఆలయం నిర్మించాడు. "ఈ సందర్భ మున మరియొక విశేషాంశము గమనింపదగియున్నది క్రీ శ. 14వ శతాబ్దమునందు నరసింహస్వామి ఆరాధనము తెలుగు దేశములో వ్యాప్తిని చెందెను. రెడ్డి రాజ్యస్థాపకుడగు ప్రోలయ వేమారెడ్డి అహోబల నృసింహస్వామి భక్తుడు. కుమారగిరిరెడ్డి ప్రోలయ వేమారెడ్డికన్న వైష్ణవ మతమునందు ఎక్కువ ప్రత్య యము కలవాడు. కావుననే అతని ప్రాంత పరిపాలకుడైన చొక్కన సింగనగారు అనంతగిరిలో నరసింహాలయములు వెల యించెను."[74]

అనంతగిరులకు సంబంధించిన పై రెండు ఉదాహరణ లను బట్టి వైష్ణవ సంబంధిత ఆలయములు వెలసిన కొన్ని కొండలకు ఆ పేరు వచ్చినట్లు విదితమగుచున్నది మత విశ్వాసా లను పక్కన పెడితే కాస్త ఒడ్డూ, పొడుగూ ఉండిన ఏ కొండ నైనా ఆ ప్రాంతీయులు తమదైన అభిమానంకొద్దీ ఆది, మధ్యాంతాలు లేనిదానిగా ఎంచి అనంతగిరి అని పేరు ఉంచి ఉండవచ్చును.

అనంతశైలము (పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు తా॥) :

ద్వారకా తిరుమల ఆంధ్రదేశంలో చిన్న తిరుపతి వంటిదిగా ఎంచబడుతోంది. శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయం నెలకొన్న అక్కడ కొండ ఎత్తు 36.58 మీ [75] అయితేనేం, దాని పేరు అనంతశైలం.[76]

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

757-TG

అర్జునగుట్ట (ఆదిలాబాదు జిల్లా) :

అర్జునుడు పాశుపతాస్త్రం కోసం ఇక్కడే తపస్సు చేసాడట. అందుకే ఆ పేరు వచ్చిందట.[77] ఈ 'ట'కారాలే ఇటు వంటి కట్టుకథలకి శిరచ్ఛేద శిక్ష విధింప చేయిస్తాయి.

అహోబిలం (కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ తా॥) :

"కర్నూలు మండలమున ఎత్తైన నల్లమల కొండలు కలవు. అహోబిల క్షేత్రము కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ తాలూకాలో కలదు. ఈ ప్రాంతము నందలి వల్లమల కొండలను, అహోబిల కొండలని పిలిచెదరు. అహోబిల కొండలలో వేదాద్రి, గరుడాద్రి అను రెండు శిఖరములు గలవు.

ఈ క్షేత్రమునకు అహోబిలము, అహోబలము అని రెండు విధముల వ్యవహరించుటకు గల కారణములను పరిశీలింతము. 'అహో' అనునది సంస్కృత అవ్యయము. ఇది ఆశ్చర్యార్థకము లను సూచించును. 'బిలము' అనగా గుహ. అనగా నల్లమల కొండలలోని నృసింహస్వామి నివసించు పెద్ద గుహ అని దీని భావము. ఈ క్షేత్రమును 'అహోబలము' అని వ్యవహరించుటకు గల కారణము - ఎర్రాప్రెగడ తన నరసింహ పురాణమున ఇట్లు చెప్పెను. "మీరు మదీయ బలంబు అహోబల శబ్దపూర్వకంబుగాc బ్రశంసించితిరి గావున నీ తీర్థం బహోబల నామధేయంబునc ద్రిభువన పావనంబై వెలయు గాత"

(నృసిం - 5.అశ్వా. 122 వచ.)

2,800 అడుగుల ఎత్తు గల కొండ పైభాగమున అహోబిలము కలదు. దిగువ బిలమును వేదాద్రి అనియు, ఎగువ అహోబిలమును గరుడాద్రి అనియు వ్యవహరింతురు. ఎగువ అహోబిలమును గరుడాద్రి అని పిలుచుటకు ఎర్రాప్రెగడ నృసింహ పురాణమునందలి 'నాచేత నధిరూఢంబయిన యగ్గిరియును గరుడాద్రియన బ్రఖ్యాతి వహించు' (నృసిం - 5 అశ్వా. 122 వచ) అను నారసింహుని వాక్యము ప్రామాణికముగ కనవచ్చుచున్నది.

అహోబిలమునకు 'సింగవేలు కుంద్రము' అను నామాంతరము కనవచ్చుచున్నది. (ఫెయిర్స్ - ఫెస్టివల్స్, కర్నూలు జిల్లా, పు-41). సింగవేలు కుంద్రము అనునది 'సింగవేల్పు కుండము' అయిఉండవచ్చును. జనవ్యవహారమున 'వేల్పు' అను శబ్దములోని పకారము లుప్తమై 'వేలు' అనియు ఇట్లే 'కుండము' అనునది 'కుంద్రము' అనియు మారియుండవచ్చును. 'సింగవేల్పు కుండము' అను శబ్దమునకు 'నృసింహస్వామికొండ' అను అర్థము గోచరించుచున్నది. నృసింహుడు హిరణ్యకశిపుని వధించిన స్థానము గనుక దానికి ఈ పేరుండుట సముచితముగా నున్నది."[78]

ఇంద్రకీలాద్రి (కృష్ణాజిల్లా, విజయవాడ తా॥) :

"దుర్గాదేవికి నెలవైన ఇంద్రకీలాద్రి కృష్ణానది వక్కన ఉన్నది.... ఇంద్రకీలాద్రి ఆవిర్భావమును గూర్చి కథ యిట్లు చెప్పుదురు. ఇంద్రకీలుడను యక్షుడు పరమేశ్వరిని గూర్చి తప మొనర్చెను. దేవి ఎల్లప్పుడు తనపై నివసించునట్లు అతడు వరము కోరెను. అతనిని శైలరూపమును పొందుమని చెప్పి, దేవి ఆ శైలముపై దుర్గారూపమున అవతరించెను. యక్షుని పేర ఆ నగము ఇంద్రకీలాద్రి యని ప్రసిద్ధి గాంచెను. ఇంద్రకీలాద్రికే దుర్గాద్రి యను నామాంతరము కానవచ్చుచున్నది."[79]

కందికొండ (వరంగల్ జిల్లా, మహబూబాబాద్ తా॥) :

శ. సం. 1297 (క్రీ.శ. 1375) నాటి రేచెర్ల వెలమ నాయకుడు వెన్నమహీపాలుని శాసనం[80] కందికొండ కుండిన సంస్కృత రూపమైన 'స్కందాద్రి'ని తెలుపుచున్నది. అతనిదే వేరొక శాసనం[81]. అతడు స్కందాద్రిపై స్కందాద్రినాధుని (శివుని) ఆలయం నిర్మించిన వైనాన్ని తెలియజేస్తోంది. ఈ శాసనములలో కందికొండ స్కందాద్రి, స్కందాచలమని చెప్ప బడినది.

కోరుకొండ (తూర్పు గోదావరి జిల్లా, రాజమండ్రి తా॥) :

"దీనికి కోరుకొండ, పరాశర శైలము లేక పరాశరగిరి, సువర్ణగిరి, వేదాద్రి, పారిజాతగిరి, పరుసవేది శైలము అను పలు పేర్లతో వ్యవహరింపబడినట్లు కోరుకొండ క్షేత్ర చరిత్రను బట్టి తెలియుచున్నది.[82] పరాశరభట్టను వైష్ణవ శిఖామణి మూలక ముగా దానికి పరాశరగిరి అని పేరు వచ్చినట్లు శ. సం. 1275 నాటి ముమ్మడినాయకుని కోరుకొండ శాసనం[83] విదితము చేయు చున్నది. దీనికి 'వేదాద్రి' అని పేరుండినట్లు మరికొన్ని శాసనముల[84] వలన తెలియుచున్నది.

కోటప్పకొండ (గుంటూరు జిల్లా, నరసరావుపేట తా॥).

ఈ పర్వత మెటుచూచినను మూడు కూటములు (బోళ్ళు)గా కన్పడుటచే దీనిని త్రికూట పర్వతమనియు, ఇందు వెలసిన స్వామిని త్రికూటేశ్వరు డనియు పిలుచుచున్నారు.... ఈ కోటప్ప కొండపై రుద్రశిఖరము (దక్షిణామూర్తి గురుమూర్తి పేరుతో వెలసినది), విష్ణు శిఖరము (విష్ణువు తపమాచరించునది), బ్రహ్మ

శిఖరము (బ్రహ్మ తపమాచరించినది) అను మూడు బోళ్ళున్నవి."[85]

**ఖమ్మము (ఖమ్మం జిల్లా) :**

దీని మొట్టమొదటి పేరు కంబముమెట్టు. మెట్టు అనగా కొండ. కంబము సంబంధమయిన కొండ అని అర్థము. ఈ పట్టణమునకు ఈశాన్య భాగమున కొండమీద శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి ఆలయము గలదు ఇచ్చటనే శ్రీ నరసింహస్వామి కంబము నుండి వెడలివచ్చి హిరణ్యకశిపుని సంహరించినాడని స్థానిక గాధ.[86]

**గోశ్రింగ పర్వతము (కడప జిల్లా, బద్వేలు తా॥) :**

శ. సం. 1205 నాటి శాసనము[87] ఈ కొండ గోశ్రింగ దేవర (శివ) మహాస్థాన మగుటచే గోశ్రింగ పర్వతమను పేరన బరగిన వైనాన్ని తెలియజేస్తోంది.

**చంద్రగిరి (చిత్తూరు జిల్లా, చంద్రగిరి తా॥) :**

"శివానుగ్రహార్థమై చంద్రుడు తపమాచరించిన నెలవుగా దీనిని పురాణకథలు వచించుచుండుటచేతనో, ఈ స్థానమునకు 'చంద్రగిరి' యను నామకరణము యేర్పడియుండవచ్చును. రామరాజభూషణుడు తన వసుచరిత్రమున 'తారకశైల' మనియు, తరిగొప్పుల మల్లన తన చంద్రభాను చరిత్రమున 'చంద్రగోత్ర' మనియు ఈ చంద్రగిరిని చమత్కారముగా పేర్కొని యున్నారు."[88]

**తిరుమలగిరి (కృష్ణాజిల్లా, జగ్గయ్యపేట తా॥) :**

"తిరుమలగిరి గుట్టమీద 250 అడుగుల ఎత్తుపై శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయం ఉంది. త్రేతాయుగంలో భరద్వాజ ఋషి తపస్సు చేసి మహావిష్ణువును తిరుమల గిరిమీద ప్రత్యక్షం చేసుకుని ఆయనను అక్కడే ఉండిపొమ్మని కోరాడట. శ్రీ మహావిష్ణువు శ్రీ వెంకటేశ్వర స్వామి రూపంలో అక్కడే ఉండిపోవటానికి అంగీకరించాడట. అందువల్లనే ఈ కొండ తిరుమలగిరి అయిందని అంటారు."[89]

**నారాయణగిరి (వరంగల్ జిల్లా, ఖాజీపేట తా॥) :**

"నారాయణగిరిని కోవెలపల్లి అనేవారు. అందుకు కారణం చాలా దేవాలయాలు ఉండటమే... ఈ ప్రాంతంలోని కొండలను బగ్గిగుట్ట, ఎల్లగుట్ట, నరసింహుల గుట్ట, గట్టుమల్లన్న గుట్ట అని పిలుస్తారు.... నారాయణగిరికి ఆ పేరు అచటి నరసింహ దేవాలయం వల్ల వచ్చివుంటుంది. కాకతీయుల కాలంలో ఈ నరసింహుని ప్రతిష్ఠ జరిగి వుంటుంది "[90]

**పట్టిసము (పశ్చిమ గోదావరి జిల్లా, పోలవరం తా॥) :**

"భారతదేశము నందలి పంచమహా శివక్షేత్రములలో పట్టసాచల క్షేత్రమొకటి.... శిలాదుడను మహర్షి కుమారుడగు నీలుడను నాతడు ఈ పర్వతముపై అగ్రతప మొనర్చి కృతకృత్యుడయ్యెను. ఆ కారణముననే దీనికి నీలాద్రి అని పేరు.... శ్రీనాధుడీ పర్వతమును వీరభద్రగిరి యనెను. దీనికి 'పట్టసాద్రి' 'పట్టసాచలము' అనునవి నామాంతరములు. దేవకూటుడు అనువాడు అనుష్ఠించిన ఘోర తపమునకు మెచ్చి ఈశ్వరుడు ఈ అద్రిపై ప్రత్యక్షమైనందున దీనికి 'దేవకూటాద్రి' యను పేరు కలిగెను.... తన తండ్రియగు దక్షుడొనర్చిన యాగ సందర్భమున సతీదేవి అవమానింపబడి యోగ విసృష్టదేహ యయ్యెను. తన్మూలమున అత్యంత కుపితుడై ఆమె భర్తయగు మహాదేవుడు వీరభద్రావతారము తాల్చి దక్షుని శిరము త్తరింప పట్టసము అను ఆయుధమును ప్రయోగించెను. ఆ దివ్యాయుధము దక్షుని శిరము ఖండించి, మహావేగమున, పాతాళమున దూరి అందాగక తిరిగి భూతలమును భేదించుకొని ఈ దేవకూటాచల మధ్యభాగము నుండి పైకి వచ్చి అందు నిలిచెను. ఈ కారణముచే నాటినుండి ఈ దేవకూటాద్రి పట్టసాద్రి లేక పట్టసాచలము అను నామములచే వ్యవహరింపబడుచు వచ్చెను."[91]

**పుష్పగిరి (కడప జిల్లా & తా) :**

ఉత్తర పినాకినీ నదీతీరమున గల ఈ క్షేత్రమును వైష్ణవులు మధ్యాహోబిల మందురు.... ఈ నదికి తూర్పుభాగమున నొక కొండ గలదు. దానినే పుష్పగిరి యందురు. పుష్పాచలేశ్వరుడు లింగరూపమున గనబడును......... ఈ గట్టు గల ప్రదేశమున నొక మడుగు 'అమృత సరోవర' మనునది యుండి నట్లును, ఇందు మునిగిన ముదుసలులు యువకు లగుచున్నట్లును తెలుపు కథలు ప్రచారము నందున్నవి. ఇవి అన్నియు పుష్పగిరి స్థల పురాణమున గలవు. వాయుభట్టారకుడు శంకరుని ఆజ్ఞపై బర్వతము కొనివచ్చి యా మడుగుపై వగ, అది పుష్పమువలె తేలుచుండుట జూచి శివకేశవులు పదమట, తూర్పున దమ పాదములచే త్రొక్కగా ఆ పర్వతము కదలక నిలిచిన దనియు.... పురాణము తెల్పుచున్నది. కొండ పుష్పమువలె తేలుట వలన పుష్పగిరి అను నామము వచ్చినది."[92]

భద్రాచలం (ఖమ్మం జిల్లా) :

"మేరు పర్వతుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి పుత్రుని బడసి వానికి భద్రుడని పేరిడెననియు, భద్రుడు గౌతమిలో స్నాన మొనరించుచు శ్రీరాముని గూర్చి తపమొనరించి, రామ సాక్షాత్కార మొంది, ఆ దేవుడట నివసించునట్లు వర మొందె ననియు నాటినుండి ఆ కొండ భద్రాద్రి యని ప్రసిద్ధమాయెననియు బ్రహ్మాండ పురాణము వలన తెలియుచున్నది."[93]

భైరవకొండ (నెల్లూరు జిల్లా, ఉదయగిరి తా॥) :

"భైరవకొండ నెల్లూరు జిల్లాలోని ఉదయగిరికి వాయువ్య దిశను 28 మైళ్ళ దూరంలో నున్నది. రాతిమయమైన గుట్టలమీద గుళ్ళు తొలచబడినవి. ఈ గుళ్ళు అత్యంత ప్రాచీనమైనవిగా కనబడుచున్నవి. ఈ గుళ్ళు ఒక మనోహరమైన కోనయందు కలవు.... ఈ కోనయొక్క తూర్పు దిశాంతమున, ఒక పెద్ద బండమీద భైరవస్వామి విగ్రహము చెక్కబడినది. ఈ స్వామిని బట్టియే ఈ కొండకు 'భైరవకొండ' అను పేరు వచ్చినది."[94]

మంగళగిరి (గుంటూరు జిల్లా & తా) :

"నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించి మహోగ్ర రూపుడై ఉన్నప్పుడు సర్వమంగళ స్వరూపిణి అయిన లక్ష్మీదేవి ఇక్కడ ఉన్న కొండపై తపస్సు చేసి పానకాన్ని స్వామికి నివేదించి ఆయన్ని శాంతపరిచింది. ఆ సర్వమంగళ తపస్సు చేసినందున ఆ కొండకు మంగళగిరి అని పేరు వచ్చింది."[95]

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు ఎంత ధర్మంగా ప్రవర్తించినా ముక్తి పొందలేదనీ, అందువల్ల ముక్తికోసం ఈ క్షేత్రం దర్శింపవలసిందిగా ఉపదేశం పొందాడని అంటారు. అందువల్లనే ఈ కొండను 'తోతాద్రి' అంటారు.[96] "దేవతర్య ఙ్మనుష్యాదుల పాపములు హరించి శ్రీ స్వామి మంగళములను ప్రసాదించుచుండుట వలన 'మంగళాద్రి' అను పేరేర్పడినది."[97]

మోహనాచలం (కడప జిల్లా, పులివెందుల తా॥) :

శ. సం. 1415 నాటి శాసన[98] మొకటి మోహనాచలమందు భైరవక్షేత్రాన్ని పేర్కొన్నది.

యాదగిరి (నల్గొండ జిల్లా, భోనగిరి తా॥) :

యాదర్షి(యాదవ) అనే భక్తునికి (శాంత, ఋష్యశృంగుల కొడుకని అంటారు) నృసింహస్వామి ఇక్కడ ప్రత్యక్షమైనాడని అంటారు".[99]

రామప్పకొండ (అనంతపూర్ జిల్లా, కళ్యాణదుర్గ్ తా॥) :

కళ్యాణదుర్గానికి తూర్పున మూడుమైళ్ళ దూరంలో బోరాంపల్లి గ్రామంలో 30 అడుగుల ఎత్తుగల గట్టుపైనున్న శ్రీ రామేశ్వరస్వామి వలన దానికి రామప్ప కొండయని వ్యవహారం."[100]

రామగిరి (కరీంనగర్ జిల్లా, మంధని తా॥) :

"ఇక్కడ కొండపై రామ పాదాలున్నాయి. ఇక్కడే మతంగ మహర్షి ఆశ్రమం ఉండేదని ప్రతీతి."[101]

రామగిరి (చిత్తూరు జిల్లా) :

"రావణుని చంపిన పాప పరిహారార్థం రాముడు శివలింగ ప్రతిష్ఠ చేయాలని తలపెడతాడు. ఆంజనేయుడు కాశీ నుంచి శివలింగాన్ని తెస్తూ ఉండగా కాలభైరవుని వలన ఆ లింగం ఈ ప్రాంతంలో స్థిరపడిపోతుంది. రాముని కోసం శివలింగం తెచ్చి ఇక్కడ పెట్టి అరణ్యంగా కామని శపించడంవల్ల 'రామగిరి' అని పేరు కలిగింది."[102]

వినుకొండ (గుంటూరు జిల్లా, వినుకొండ తా॥) :

రామలక్ష్మణులు జటాయువు ద్వారా సీతాపహరణ వార్త నా చోట వినుటచే నిది 'విన్నకొండ'యై తరువాత వినుకొండగా మారినదని నమ్మిక.[103] "శ్రీరాముడీ కొండ శిఖరమునఁ గన్నీట నాలించె సీతాపహరణ వార్త" అని నవయుగ కవిచక్రవర్తి జాషువా. శృతపర్వతమని దీనికి పూర్వ సాహిత్య వ్యవహారం.

వేణుగోపాలస్వామి కొండ (కడప జిల్లా, సిద్ధవటం తా॥) :

సిద్ధవటానికి ఉత్తరంగా ఏడుమైళ్ళ దూరంలో గల వేణుగోపాల స్వామి కొండకు ఆ పేరు ఆ స్వామి పరంగా వచ్చినట్లున్నది.[104]

వేదాద్రి (కృష్ణాజిల్లా, జగ్గయ్యపేట తా॥) :

"శ్రీ యోగానంద లక్ష్మీనృసింహస్వామి ఇచ్చట క్షేత్ర దైవము.... వేదములు పర్వతరూపము దాల్చి స్వామిని ధరించి యుండెనట."[105]

"వేదాద్రి శిఖర నృసింహ కలయామి విమల విద్యుజ్జ్వలిత జిహ్వామ్" అని సుప్రసిద్ధ తరంగ రచయిత నారాయణతీర్థులు. కవిసార్వభౌముడు శ్రీనాథుడు తన సాహిత్య సౌష్ఠవమునకు ఉద్బోధకములని పేర్కొనినవానిలో "...వేదాద్రి నృసింహ విపుల వక్షః స్థలీకల్హార మాలికా గంధలహరి" ఒకటి.

**వేదాద్రి (కోరుకొండ, తూర్పు గోదావరి జిల్లా) :**

"రాజమహేంద్రవర సమీపమున 'పరాశర శైల' మను నామాంతరము గల కోరుకొండకు కూడ 'వేదాద్రి' యని శాసన వ్యవహారమున్నది"[106]

**వేలుపుగొండ (వరంగల్ జిల్లా & తా॥) :**

"ఈ గిరిని అగస్త్య మహర్షి పూజించిన సాలగ్రామమని యందురు. ఈ పర్వతముపై యోగానంద నృసింహస్వామి స్వయం వ్యక్తుడయ్యెనని చెప్పుదురు.[107] కాబట్టి ఇది వేలుపుగొండ.

**వేల్పుగొండ (మెదక్ జిల్లా, అందోల్ తా॥) .**

"ఈ గ్రామంలో చెరువు మధ్య ఓ కొండ ఉంది. చాలా కాలం క్రితం ప్రతి శుక్రవారం అర్ధరాత్రి ఆ కొండమీద నుంచి భజన చేస్తున్నట్లుగా శబ్దం వచ్చేదట. దానిని వేల్పుల (దేవతల) భజనగా గ్రామస్థులు భావించారు. అందుకే ఆ కొండకు వేల్పుల కొండ అనే పేరు వచ్చి కాలక్రమేణా అది వేల్పుగొండగా మారింది."[108]

**శింగనమల (అనంతపురం జిల్లా & తా॥) :**

"ఋష్యశృంగ మహర్షి ఇక్కడ ఉన్న కొండమీద కొంతకాలం తపస్సు చేసాడని అందువల్ల ఈ ఊరికి శృంగునిమల అని పేరు వచ్చి కాలక్రమేణా అదే శింగనమలగా మారిందంటారు."[109]

**శింగరికొండ (ప్రకాశం జిల్లా, అద్దంకి తా॥) :**

ఇచట గల 100 మీ. ఎత్తున ఉన్న కొండపై 550 సం॥ పూర్వము శ్రీ లక్ష్మీ నరసింహ, నర నారసింహ విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి.[110]

**శ్రీరామగిరి (ఖమ్మం జిల్లా, భద్రాచలం తా॥) :**

రేకపల్లికి దక్షిణంగా మూడు మైళ్ళ దూరంలో గల కొండపై శ్రీరామాలయం ఉండుటనుబట్టి ఆ పేరు వచ్చినది.[111]

**శ్రీశైలము (కర్నూలు జిల్లా) :**

యంధర, మేరు, మైనాక, గంధమాదనములతోపాటుగా శ్రీశైలము పంచమహా పర్వతములలో నొకటిగా ఎంచబడినది. "వ్యాసప్రోక్తంగా ఎంచబడే 'స్కంద సంహిత'లో నొక భాగమైన 'శ్రీగిరి మహత్మ్యము' అను ఖండమునందు శ్రీశైలము అను నామము కల్గుటకు నిమిత్తము వివరింపబడినది.... కృతయుగమున శిలాదుడను బ్రహ్మర్షి కుమారులలో నొకడగు పర్వతుడు ఘోర తపమాచరించి శివ సాక్షాత్కారము నొంది "నా పేరుకు తగినట్లుగానే నన్ను పర్వత రూపముగా ననుగ్రహింపుము. నాపై నీవు నిత్య నివాసివై ఉండుము" అని వరము కోరెను శివు డనుగ్రహించెను. "పర్వతము" అను పేరు కొండలకెల్ల సామాన్య నామమైనను 'పర్వతుడు' శ్రీశైలముగా మారిపోవుటచే ఆ శ్రీగిరికి 'పర్వతము' అనునది విశేష నామమై వెలసినది. నేటికిని శ్రీశైల యాత్రికులు 'పర్వతము వెళ్ళితి' మనియు, 'పర్వతము నుండి వచ్చితి' మనియు చెప్పుచుందురు.... చారిత్రక కాలంలో శ్రీముఖుడను ఆంధ్రరాజు కుమార్తె శ్రీ. 'నా పేరు నీ పర్వతముతో జతపరిచి శాశ్వతము కావింపుము అని 'శ్రీ' ప్రార్థించినది. పరమేశ్వరుడా వరమొసగెను. తదాదిగా ఈ పర్వతము శ్రీశైల పర్వతమనియు, శ్రీశైలమనియు ప్రసిద్ధి గాంచినది."[112]

**శేషాచలం (చిత్తూరు జిల్లా) :**

"నల్లమల కొండల వరుసలలో దశ యోజన విస్తీర్ణంబై ముప్పది యోజనముల నిడివి గలిగియుండు పర్వత ప్రదేశమొకటి శేషుని రూపముతో నలరారుచుండెడిదని పురాణముల వలన తెలియు చున్నది.... కృతయుగమున ఈ అద్రికి వృషభాద్రి యనియు, త్రేతాయుగమున అంజనాద్రి అనియు, ద్వాపరమున శేషశైల మనియు, కలియుగమున వేంకటాద్రి యనియు నామము లున్నట్లు పురాణములు తెల్పుచున్నవి.... మరియు, కల్పభేదముల ననుసరించి నారాయణాద్రి, గరుడాద్రి, తీర్థాద్రి, వరాహాద్రి, జ్ఞానాద్రి, శ్రీనివాసాద్రి, వృషాద్రి, పుష్కరాద్రి అని వేంకటాద్రికి పర్యాయ నామములు కనబడుచున్నవి."[113]

**శోభనాద్రి (కృష్ణా జిల్లా, నూజివీడు తా॥) :**

అగి(కి)రిపల్లిలో శోభనాద్రి లేక శోభనాచల కొండపై దేవాలయము లున్నవి. "కృతయుగములో శుభావ్రతుడను రాజు విష్ణుదేవుని గూర్చి చాలకాలము ఓర్మితో తపస్సు చేసెను. మహా విష్ణువు ప్రత్యక్షమయ్యెను. రాజు మహా విష్ణువును లక్ష్మీదేవితో అవతరింపుమని ప్రార్థించెను. అట్లయినచో కోరిక ఫలించుటకు మహాశివుని కూడ ప్రార్థించమనెను. ఘోర తపమాచరించుటచే రాజు కొండగా మారెను. దానినే శోభనాద్రి, శోభానగిరి, శోభనాచలము అని అందురు."[114]

సింగరాయకొండ (ప్రకాశం జిల్లా, కందుకూరు తా॥) :

ఇచట కొండపై గల పురాతన వరాహ లక్ష్మీనరసింహ స్వామి ఆలయము ననుసరించి ఈ పేరేర్పడినది.[115]

సిద్దులకొండ (నెల్లూరు జిల్లా, కావలి తా॥) :

దీని సంస్కృత నామం సిద్ధగిరి.[116] రెండు - మూడు వందల అడుగుల ఎత్తుగల కొండమీద ప్రాచీన సిద్దేశ్వరస్వామి ఆలయమున్నది. అందువల్ల సమీప గ్రామానికి సిద్దన్న కొండూరు అనే పేరు కూడా వచ్చింది.[117]

సింహాచలం (విశాఖపట్నం జిల్లా & తా॥) :

"అచట 'సింహగిరి' అను నామాంతరము గల కొండపై నెలకొనియున్న ఆలయమందు వరాహ నారసింహమూర్తుల సమ్మేళనముతో వరాహ నరసింహమూర్తి పేరున విష్ణువు వెలసి యున్నాడు "[118]

ఇంకా, ఈ క్రింది కొండలు కూడ తమ పేర్లలో పౌరాణిక, దైవ, మత సంబంధములు కలిగియున్నవిగా కాన వచ్చుచున్నవి.

ఈశ్వరమల[119] (అనంతపురం జిల్లా, కదిరి తా॥)

ఋషికొండ[120] (విశాఖపట్టణం జిల్లా & తా॥)

కైలాసం కొండ[121] (విశాఖపట్టణం జిల్లా & తా॥)

కోయిలకొండ[122] (కర్నూలు జిల్లా, కోయిలకుంట్ల తా॥)

గుడిబండ[123] (అనంతపురం జిల్లా, మడకశిర తా॥) దీనికి బండకొండ అని పేరు కూడా ఉంది.

గుత్తికొండ (అనంతపురం జిల్లా, గుత్తి తా॥)

"గౌతముడు ఇక్కడ గౌరిగుట్టమీద తపస్సు చేసాడని, గౌతమపురి కాలక్రమేణా గుత్తి అయిందని అంటారు"[124]

దేవకూటము[125] (తూ॥ గో॥ జిల్లా, అమలాపురం తా॥)

దేవరకొండ (నల్గొండ జిల్లా, దేవరకొండ తా॥) :

"ఆంధ్రదేశ చరిత్రలో సుప్రసిద్ధమైన ప్రాచీన నగరము. దీనిని శాసనములలో దేవగిరి, దేవనగము అని వ్యవహరించారు."[126]

'పాపి'కొండలు (తూర్పు గోదావరి జిల్లా) :

"తూర్పు గోదావరి మండలములో కూనవర గ్రామము చెంత శబరి యను నది గోదావరి నదిని కలియుచున్నది. ఈ నదీ సంగమ పరిసరములందు పాపికొండలు గలవు. విశాలమగు గోదావరి నది రాను రాను సన్నగిల్లి, పాపికొండలను తాకి వాటిని చీల్చి రెండు వందల అడుగుల విషమగిరి కందరము నుండి మహా వేగముతో ప్రవహించుచున్నది. ఈ దృశ్య మత్యంత రమణీయము "[127] రమణీయం మాట ఆలా ఉండగా విషమ ప్రయాణ మార్గం కావున కాబోలు ఈ కొండలకు పాపి సంబంధం కల్పించబడింది.

"ఆకాశం పైభాగం నుండి యీ కొండలను చూస్తే అవి పాపిడి తీసికొన్నట్లుగా కనబడతాయనీ, అందుచే వాటిని పాపిడి కొండలు అనేవారు. వాడుకలో అవి పాపి కొండలుగా ప్రసిద్ధికెక్కినాయని చెబుతారు."[128] విని నమ్మేవారుంటే....

పాండవుల కొండ[129] (విశాఖపట్నం జి॥ నరసాపట్నం తా॥)

పుణ్యగిరి (విజయనగరం జిల్లా, శృంగవరపు కోట తా॥) :

ఈ కొండమీద పుట్టుదార అనే ప్రదేశంలో ప్రాచీన శివాలయం ఉంది. ధార గంగమ్మ లోయలో గల గుహలో గిరిజన కన్య విగ్రహం ధార గంగమ్మ పేర పూజింపబడుతోంది.[130]

పెంచలకొండ (నెల్లూరు జిల్లా, రాపూరు తా॥) :

రాపూరుకు వాయువ్యంగా 9 మైళ్ళ దూరంలో గల పెంచలకోనలో గల విష్ణ్వాలయం వలన ఈ పేరు వచ్చినట్లు తోచును.[131]

బొగ్గుల'మారి' కొండ (అనంతపురం జిల్లా, గుత్తి తా॥) :

పై కొండ పేరులో గల 'మారి' గ్రామ దేవతగా ఎంచబడి ఆ కొండ కాపేరు రావడానికి కారణమైనట్లున్నది.[132]

మహానంది (కర్నూలు జిల్లా, నంద్యాల తా॥) :

"పూర్వము నందీశ్వరుడను మహర్షి శంకరుని గురించి వందలకొద్ది సంవత్సరాలు ఘోర తపస్సు చేయగా పరమేశ్వరుడతని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై వరములను కోరుకొమ్మనగా, నందీశ్వరుడు స్వామీ! యుగాంతరము వరకు నిన్ను నేను మోయవలయునన్న కోరిక వున్నది. కావున నీవు నాపై శాశ్వతముగా నివాస మేర్పరచుకొమ్ము" అని వేడగా శివుడు భక్తుని కోరిక ఆమోదించాడు. వెంటనే నందీశ్వరుడు పర్వత రూపమును

దాడు. ఆ పర్వతముపై ఈశుడు లింగరూపమున నివాస ఏరచుకొన్నాడు. ఆనాటినుండి పర్వతాన్ని శివలింగాన్ని ూపి నందీశ్వరుని పేర 'నందీశ్వరాలయం' యని వ్యవహరించు చున్నారు."[133]

లింగగిరి[134] (కృష్ణాజిల్లా, నందిగామ తా॥)

వీరభద్ర, నరసింహస్వాముల కొండలు (వరంగల్ జిల్లా & తా॥):

వరంగల్‌కు దక్షిణంగా 40 కి.మీ. దూరంలో ఉన్న జఫర్ ఘడ్ గ్రామంలో శిధిలమైన కోట గుర్తులు వీరభద్ర, నరసింహస్వాముల కొండలపై కానవస్తాయి. లక్ష్మీ నరసింహ స్వామి ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి.[135]

సంగమయ్యకొండ (శ్రీకాకుళం జిల్లా & తా):

కొండపై గల గుహలోని శివుని సంగమేశ్వరునిగా అర్చిస్తున్నందున అది సంగమయ్య కొండ అని పిలువబడు తోంది.[136]

సైలాదకొండ (శ్రీకాకుళం జిల్లా & తా):

"దీని పూర్వ నామం శిలాద పర్వతం. శిలాదుడు శివ భక్తుడు. పురాణప్రసిద్ధుడు.[137]

హిడింబాచలము :

శ. సం. 1141 (క్రీ.శ. 1219) నాటిదగు కాకతీయ గణపతి దేవుని సోదరి, నతవాటి రుద్రుని భార్యయైన కుందమాంబ శాసన మొకటి[138] జీడికల్లువద్ద హిడింబ పర్వతముపై శివాలయాన్ని నిర్మింపజేసినట్లు తెలుపుతోంది. కాకతి రుద్రదేవికి మంత్రియైన గంగాధరుని శ. సం. 1092 (క్రీ.శ. 1171) నాటి శాసన మొకటి[139] ఆతడు హిండిబ తీర్థమున ఆలయం నిర్మించినట్లు తెలుపుచున్నది.

హనుమద్గిరి (వరంగల్ జిల్లా & తా॥):

ఒక స్థానిక గాథ ప్రకారం హనుమకొండ అను పేరు హనుమాద్రి లేక హనుమద్గిరి నుంచి ఉత్పన్నమైనదని తెలుస్తోంది.[140]

[ఇంకా ఉంది]

## శ్రీ - శ్రీశ్రీ

ప్రాచీన కవిత్వమంతా
శ్రీకారంతో చిక్కుపడితే,
ఆధునిక కవిత్వం
రెండు శ్రీలతో ముడిపడ్డది.

## మినీ కవిత

నేటి కవితా వాహిని
'మినీ' మార్గాల ద్వార
ప్రవహిస్తుంది కాబట్టే
దీని "ధ్వని" వేగం పెరిగింది.

—శ్రీ వేదాటి రఘుపతి

## పక్షి

కాళ్ళు కాస్తంత కదలిక కోటకే
కాకుంటే మరింత నిలకడ కోసం_
తూర్పు వాకిట్లో
వెలుతురు పొడగడితే చాలు
గాలిని స్పర్శిస్తూ, పలకరిస్తూ
రెక్కల కుంచెతో
రోదసిని చిత్రిస్తూ
గమన శిల్పంతో
కనిపించే పాట
అనిపించే స్వేచ్ఛ.

—శ్రీ జి. రామశేషయ్య



# కర్తవ్యం

ఏ రాగం పాడాలో నీకే తెలియకపోతే
వేణువు మూగది కాక ఏమౌతుంది....
ఏ పరిమళ పుష్పమై పరవశించాలో నీకే తెలియకపోతే
మనసు శిశిరం కాక ఏమౌతుంది....
ఏ కరుణ తరంగమై ఎగసిపడాలో నీకే తెలియకపోతే
గుండె రాయి కాక ఏమౌతుంది....
కలల అలల సవ్వడి మీద
తేలియాడుతున్న జీవిత నౌకను
మధుర స్వప్న తీరాలకు చేర్చి
మమతల కోవెల నిర్మించాల్సింది నీవే!
అదృష్ట దురదృష్టాల
వెలుగు చీకట్ల మధ్య
వసంత శిశిరాల
ఆశా నిరాశల మధ్య
ఆత్మీయతా బంధాల్ని ముడివేయవలసింది నీవే!
బాహ్య వికార స్వరూప స్వభావాల్ని
సౌందర్య సుందరంగా మలిచే శిల్పివి నీవే!
నీ గుండె గొంతులో తారట్లాడే
ఓ అనంత మధురనాదం నీవే!
ఈ వికృతి కాలభ్రమణంలో
ప్రకృతి ప్రణవవేదం నీవే!
వెన్నెల తేటతిన్నెలపై విహరించి
ఆలోచనాంతశ్చేతన హృదయమై
వ్యథల కథల గుండెలలో
సుధలు కురిపించాల్సింది నీవే....!

# ఈ పాట

మమత—
మాటల కందని మనోజ్ఞ పల్లవీ వల్లరియై
పలుకుల సుధా లహరియై ప్రవహిస్తూ
శ్రవణేంద్రియాలను ప్రకంపిస్తూ
అవ్యక్తానుభూతుల్ని ప్రవచిస్తుంది!

సమత—
చరణ మంజీర సజీవ నాద ప్రస్తారమై
జిలుగు వెలుగుల చిగురు జొంపాల పాటయై
పిల్ల తెమ్మెరల మల్లెపందిరియై
ఎద లోతులలో పరిమళిస్తుంది!

మానవత—
రాగ పరిణామ ప్రస్తాన రూపమై
లతాంత కుసుమాధర కదలికయై
అంతర్గత ఆలోచనా లోచనమై
కరుణామృత కిరణంగా ప్రభవిస్తుంది!

మమకారం—
నిసర్గ రమణీయ తానమై
రాగలయాన్విత గానమై
భాసుర రస సంపద్విలసితమై
అనురాగ మందిరంగా భాసిస్తుంది!
శిలాలోలిత తలాల మధ్య
శిల్పీకరించుకున్న జీవనరథ్య ఈ పాట!
శిశిర పుష్ప వృంతాల నడుమ
శిరసెత్తిన చిగురు ఈ పాట.!

శ్రీ సి. కామేశ్వరరావు

“త్రి”

# పగచిచ్చు

## (నాటిక)

### — పాత్రలు —

రంగము మీదికి వచ్చు పాత్రలు :

సుంకన్న, నాగప్ప — ఇరుగు పొరుగు చిన్న రైతులు. వీరు బంధువులు కాదు. కేవలము పిల్చుకోవడంలో మాత్రమే వరుస బాంధవ్యములు.

యెంకడు (బాలుడు) : సుంకన్న కొడుకు

పుల్లమ్మ (ముసలిది) : నాగప్ప తల్లి

యల్లప్ప (ముసలివాడు) : సుంకన్న తండ్రి

ఇంకా రెడ్డి (గ్రామ మునసబు), జిల్లేదారుడు, జప్తు అధికారి, అమీను, పోలీసులు, మేస్ట్రీటు, ప్రాసిక్యూటరు, గుమాస్తా, బంట్రోతు, కోడిపెట్ట, పసిపాప.

రంగము మీదికి రాని పాత్రలు :

సుంకన్న నాగప్పల భార్యలు, సుంకన్న బిడ్డ రంగమ్మ, కుక్క.

స్థలం : రాయలసీమ (ముఖ్యంగా అనంతపురం, కర్నూలు జిల్లాలు) లోని ఏ పల్లెటూరైనా సరే!

కాలం : భారత స్వాతంత్ర్యానికి (1947) పూర్వము.

థియేటరు క్రిక్కిరిసి ఉంటుంది.

రంగముపై తెర వేసి వుంటుంది. ప్రేక్షకులలో నుండి ఒకాయన లేచి రంగమెక్కి తెరముందు నిలబడి ఇట్లు ఉపన్యసించును.

రసిక ప్రేక్షకులారా,

“ఈ నాటకం ప్రపంచంలో ఎక్కడైనా జరిగి యుండవచ్చును. జరుగగలదు కూడా ఇతివృత్తమట్టిది. ఐనా, రాయలసీమలో, ముఖ్యంగా అనంతపురం, కర్నూలు జిల్లాలలో ఏ పల్లెటూరిలోనైనా జరిగినట్లు వ్రాసినాను. ఇందలి భాష రాయలసీమ “యాస”లో ఉన్నది. ఇక్కడికే పరిమితమైన గ్రామీణ మాండలికాలు కొన్ని వినబడును. ఇవి తప్పిస్తే భాష, వాక్య నిర్మాణము ప్రామాణికమే. ఇచట చిత్రించినది గ్రామీణు[ల] జీవితంలోని కొన్ని ఝలక్‌లు. వీరిదేమి జీవితం? అంతల[ో] ఆనందం, ఇంతలో దుఃఖం, అంతలో స్వార్థం, ఇంతల[ో] త్యాగం, అంతలో పెడబొబ్బలు, ఇంతలో ఏడ్పులు, అంతల[ో] చావు, ఇంతలో పుట్టుక. “మహాభారతం”లో మాత్రం వే[రు] విధముగా ఉన్నదా? ఏమంచ, ఇతివృత్తం గ్రామీణుల దైనం[దిన] మాత్రమున నాటకములో అంగాంగ వాస్తవికతను వెదుకనక్క[ర] లేదు. ఇది ఇట్లు జరిగినదా? అది అట్లెందుకు జరుగలేదు అ[నే] ప్రశ్నలు, సందేహాలు రానేవచ్చును. నాటకానుభవానికి కోలరి[డ్జ్] చెప్పినట్లు మన అవిశ్వాసాన్ని ఐచ్ఛికంగా తాత్కాలికంగా నిలి[పి] వేయవలసి ఉంటుంది. “పొయటిక్ లైసెన్సు” ఈయవల[సి] ఉంటుంది. ఈ షరతు ప్రాచీన గ్రీకు త్రాసదాలకు కాళిదాస నాటకాలకు, షేక్సుపియరు డ్రామాలకు గోర్కి “అగా[ధ] నిమ్నముల*”కు, సింజ్ “కడలి రౌతులు**”కు వర్తిస్తుంది. నాటకమును సహృదయతతో చూడండి అని అనను. హృదయ[ం] లేనిచోట హృదయాన్ని పెట్టేదే సాహిత్యం అనే తత్వపువాదన కావున. అది చేయకుంటే కళ కళే కాదు కావున. ప్రపం[చ] పౌరునిగా మారిపోవలెనని ఎంత ప్రయత్నించినా ఏండ్లకొల[ది] వానలు లేక పరియలు పారిన రాయలసీమ నల్లరేగడి మంటి వాస[న] వదలడంలేదు. పెరటిలోని చిన్న దానిమ్మ చెట్టును అభిమానించ[ని] వాడు కాలిఫోర్నియాలోని “ఓకు” మహావృక్షాలను గౌరవించ గలడా? ఫలితం, ఇప్పుడు మీరు చూడబోయే నాటకం”.

అనుచు రంగము దిగుచుండగా జలతరంగ వాద్య[ం] “హంసధ్వని” రాగము (“వాతాపి గణపతిం భజే హం”)లో ప్రారంభించును. తెర పైకి పోవును. ఒకటవ రంగము అయిపోయే వరకు జలతరంగం కొనసాగవలెను.)

---

* “లోవర్ డెప్త్స్” (అగాధ నిమ్నాలు)

** “రైడర్స్ టు ద సీ” (కడలి రౌతులు)

ఈ రెండు నాటకాలు “వాస్తవికత”కు పరాకాష్ఠ రచనల[ని] సాహిత్యవేత్త లంటారు.

## 1వ రంగము

రెండు గుడిసెలు - ఒకటి స్టేజికి కుడిప్రక్క, రెండవది డమప్రక్క. మధ్య చోటులో సుంకన్న, నాగప్ప పులికట్టు[1] ౨ట ఆడుచుందురు. సుంకన్న మేకలు, నాగప్ప పులులు ుంకన్న చేతిలో ఇంకా 5 మేకలు మిగిలియుండును. ఇద్దరు ్రాలోచనలో ఉందురు. ఉన్నట్లుండి-

ుం - ("హూఁ" అని మూలిగి ఒక మేకను వేసి) నాగప్ప బావా! ఈ మ్యాకని కొట్టు సూతాము

ాగ - (వెంటనే మేకను కొట్టి), సుంకన్నా! ఇనాళ్లనుండీ పులి కట్టు ఆడతా వుండావే నీకు మ్యాకలేసేది వస్తాదా అంట. నీకీ నడమ అరువు మరువు[2] పట్టేద్య. యా తట్టు చూస్తా వుండావు? ఈడ మ్యాకేస్తివే, యట్లా నిలస్తాదీ అంట నీవ్ సూరను, వేయను. పులిని మ్యాక కట్టుతాదా? పులి పులే, మ్యాక మ్యాకే (అని నవ్వుతాడు).

ుం - కట్టుతాది బావా కట్టుతాది కట్టి సూపిస్తే తెలుస్తాది. (అంటూ ఓరచూపు చూచును)

[ప్రవేశము యంకడు : వాని చంకలో ఒక కోడిపెట్ట ఉండును. వాడు నాగప్ప ప్రక్క కూర్చొనును.]

యం - (నాగప్పతో) మామా మామా ఆ మూల దనుకకొట్టు. దోవలో 3 మ్యాకలొస్తాయి.

నాగ - నాకు చెప్తావేమిరా! మీ నాయనకి మ్యాకలేసేదే రాదు. ఆ యప్పకి సెప్పు ఒకసారైనా గెలిసీయి.

సుం - గెలుస్తానప్పా గెలుస్తాను గెలిసే కాలం రాకపోతాద్యా. కడాకి మ్యాకల్దే గెలుపనుకో.

[లోపలినుండి ఆడగొంతు "వర్వా యంకిగా మీ యప్పని బువ్వకి రమ్మన్రా. ఈళ్లాటగ్గునుంటే పొద్దే మరుస్తారు."]

యం - రా యన్నా! అమ్మ రమ్మంటాది. (అని సుంకన్న బుజం పట్టి లాగును.)

సుం - నిలిరా గాడిదీ. ఆట ఏమైతాదో సూతాము.

[లోపలనుండి మరల "యంకడూ నే జెప్పిందినపడల్యా?"]

యం - రా నాయనా! (అని లాగును).

నాగ - (ఆట తటాలున చెడిపి) పో బావా! నా సెల్లెలికి కోప మొచ్చిని. ఆనంక నన్నంటాది.

సుం - ఛాఛా! ఈ ఆడోళ్లు 'సుమింతసేపు ఆడనీరు. బతుకంతా బువ్వ, మేత, సేను, నీళ్లు ఇవిటితోనే సరిపాయ....

[ తెర ]

## 2వ రంగము

ఈ రంగం ముగిసేవరకు కుక్క మొరుగు వవ్ వవ్ అంటు అప్పుడప్పుడు వినబడుచుండవలెను.

[కచేరి చావిడి - రెడ్డి, జిల్లేదారుడు[3], సుంకన్న. రెడ్డి, జిల్లేదారుడు కుర్చీలపై కూర్చొని వుంటారు. సుంకన్న చేతులు కట్టుకొని నిలబడి ఉండును.]

జిల్లే - నే విసను సుంకన్నా! ఇదేమి సర్కారనుకొన్నావా? సత్ర మనుకొన్నావా? నీవు గవర్నమెంటు వారినుండి "గ్రోమోర్ ఫుడ్" స్కీముకింద తీసికొన్న బాకి మూడేండ్లయింది వడ్డీ ఈలేదు. అసలు అసలుకే లేదు మొత్తము 152 రూపాయలా 13 అణాలా 7 దమ్మిడీలయింది[4]. వెంటనే చెల్లించకపోతే, నీ ఆస్తిని జప్తుకు రాస్తాను.

---

1) పులికట్టు లేక పులిజూదం అనే ఆట రాయలసీమలో విస్తారంగా ఆడుతారు. నాల్గుపులు (పెద్ద రాళ్లు) లను 18 మేకలు (చిన్న రాళ్లు) కట్టివేయు ఆట. ఇద్దరు ఆడే ఆట, వత్తాసు ఇచ్చే ప్రక్కవారు సరేసరి. చాలా ఉత్సాహాన్నీ ఆవేశాన్నీ కలిగించే ఆట. ఈ ఆటలో మునిగిన వాళ్లని లాక్కొని పోవలసిందే కాని వారంత వారు చాలు చేయరు. ఈ ఆటలో నాటకకర్త (తి) కు మంచి ప్రవీణత కలదు.

2) అరువు మరువు = మతిభ్రమ.

3) జిల్లేదారుడు అంటే రెవెన్యూ ఇన్స్పెక్టరు.

4) ఈ మొత్తం స్థాయి, ప్రాముఖ్యం తెలుసుకొనుట ముఖ్యం. నాటకం స్వాతంత్ర్యం పూర్వం జరిగినదంటిని. 1939 - 40 ప్రాంతమనుకొంటే అప్పటి డబ్బు విలువ నిత్యావసర సరకుల ధరలు, ప్రభుత్వ బడ్జెటు, కూలీ, జీతాలు ఏ స్థాయిలో ఉండెనో అధోజ్ఞాపిక (పట్టిక)లో చివర చూపించి నాను. ఆ కాలం నాటికే "కాలము విపరీతమాయెనే కనకవల్లి" అనే పాట జనశ్రుతిలో ఉండినది. అది రూస్వెల్ట్ "న్యూ డీల్" కాలం అనేది మరువరాదు.

సుం - దయ సూడండి దేవరా! మీరన్నింది కాదన్ను. నన్నేం సేయమంటారు? వానదేవుడు దయసూల్లేదు. మీరన్నా సూడండి. నాల్గు తూములు పత్తివచ్చ. ఆ పుల్లారెడ్డప్ప పాత బాకీకి సరిపాయ. శనక్కాయలు పుచ్చు పట్టి సరీగా రాలేదు. వచ్చినవి భోగయ్యసెట్టి పట్తాయ, సర్కారుకి స్తీ కాయ. మిగిలిన కసిన్ని గింజలు తిస్నికి పెట్టుకొన్నా. ఉన్న రెండు నగలూ కుదువబెట్టిన. ఈ యే డిడిసిపెట్టండి దేవరా! నవణే పాటయ్యోరి తోడు. వచ్చే యేడు దమ్మిడితో కట్టేస్తాను.

జిల్లే - అదేమిలేదయ్యా! అంతా చేసేది నేనే అనుకొన్నావా, నా పైనా అధికార్లున్నారు. తహసీలుదారునుండి మాకు మాట వస్తుంది. విను. సాయంత్రం 4 గంటలకు నేను వేరే వూరు క్యాంపు పోవల్ల. తెచ్చి కట్టితివా? బతికిపోతివి. లేదా నీ ఇష్టం. పోలీసువాళ్ళనే వచ్చి వసూలు చేసుకోండంటాను.

(రెడ్డి "తలారీ! ఆ కుక్క నోరు మూయించు" అని అరుస్తున్న కుక్కను "ఛో ఛో" అని గదుముతాడు.)

సుం - దేవరా దేవరా (అంటూ రెడ్డివైపు చూచును. రెడ్డి అటు వైపు చూచుచున్నట్లు నటించును.)

[ తెర ]

## 3వ రంగము

ఈ రంగంలో ఇచటనుండి జుంజూటి రాగంలో వేణువు వినబడుచుండవలెను.

సుంకన్న ఇంటి ముందర, ప్రవేశము అమీను, జప్తు అధికారి, ఇద్దరు పోలీసులు.

(అమీను ఒకవిధమైన అధికారిక కంఠస్వరంతో)

అమీను - సుంకడూ ఓ సుంకడూ (చుట్టూ కలయజూచుచు) అమిదాల సుంకన్న ఇల్లు ఇదేనా?

(సుంకన్న లోపలినుండి వచ్చి, పోలీసులను చూచి తగ్గి, ఉలిక్కిపడి బుజాన ఉన్న వల్లెను తలకు చుట్టుకొనుచు)

సుం - రాండి ద్యావరా! వరే ఆ మంచమీటికి ఇగ్గుకరారా దొరోళ్ళు వచ్చేర్య.

అమీను - మంచం వద్దు. గించం వద్దు. విను బాకి వసూల కోసరం వచ్చినాం. ముందు వ్యవహారం తేల్చు.

సుం - జిల్లేదారునికి సెప్పినా ద్యావరా! ఈ యేడీలేనన్నానప్పా

అమీను - అదేమీ ఉడకదు. సర్కారు ఉత్తరువు విను-"అమిదాల సుంకన్న సర్కారు వారినుండి తీసుకొన్న బాకీ వడ్డీతో సహా 152 రూపాయలా 13 అణాలా 7 దమిడీలు సకాలంలో చెల్లించనందున ఇంటిని జప్తును చేయడాని ఉత్తరువీయడమైనదని గ్రామస్తులు తెలుసుకోవలెను"

సుం - పిల్లలోణ్ణి ద్యావరా! కావలిస్తే ఈపుమీద కొట్టండి కడుమీద కొట్టొద్దు.

అమీను - సర్కారుకు వీపు కడుపు అనే భేదం లేదు. నీవు జ కట్టకపోతే, సర్కారుత్తరువు అపలుజరపాలసొస్తుం పోలీసులూ! ఇంట్లో సామానులు బయటకెయ్యండి. (జప్తు అధికారిని పురమాయించును).

సుం - సామీ సామీ (అని అడ్డము వచ్చును).

అమీను - ఏయ్ దారి విడు (అనుచు సుంకన్నను త్రోయు సుంకన్న పడును).

ప్రవేశము నాగప్ప.

"జుంజుటి" రాగం ఆపి ఇచటనుండి రంగాంతం వర హిందుస్తానీ రాగం "నీలాంబరి" రాగములో వేణువు వాయించుండవలెను. ఈ రాగం స్నేహస్మృతి చిహ్నం.

నాగ - అ, అ, సుంకన్నబావా (అనుచు సుంకన్నను లేవనెత్తు

సుం - ఆ యేడు గ్యాపకం ఉందా వంకసేను కత్తువ ఏసుక దానికి తీసుకొన్న బాకీ బాపతు బావా! దాని వసూలి జప్తు చేస్తుండారు.

నాగ - బీదబిడ్డల మింద బింకాలా ద్యావరా పేదోళ్ళకి కనికా చూపించండయ్యా.

---

5) నవణేపాటయ్య - కర్నూలు జిల్లా ఆలూరు తాలూకా జోహరాపురం గ్రామములో కొర్ర ధాన్యము కల్లము చేసిన తర్వాత రైతులు ఒక దేవతకు ఉత్సవం చేసెదరు. ఆ దేవత పేరు "నవణేపతి" (కన్నడం మాట). అంటే కొర్ర ధాన్యాధిదేవత. ప్రియంగునాథుడు. బదరీనాథ కేదారనాధుల వలె నవణేపతి (ఉచ్చారణలో "నొనేపాటి") ధాన్యదేవత. ఆ గ్రామంలో ఇటీవల వరకు మగవారి పేర్లలో "నొనేపాటి" అనేది ఎక్కువగా వినవచ్చేది.

జప్తు అధి - దాక్షిణ్య పాఠాలు నాకు నేర్పుతావురా నీవవతలికి పో.

నాగ - పోతాను. నా బాధ కష్టాలు నావి కావా? రవంత నిలండి. (అనుచు లోపలికి వెళ్ళి కొన్ని సొమ్ములు పట్టుకొని వచ్చును).

నాగ - బాకీ మొత్తానికి జమ కట్టుకోండయ్యా.

అమీను, జప్తు అధి - (మెత్తబడి) మేమేం జేసేదయ్యా ఇవి సర్కారు వ్యవహారాలు. రూల్సు, రూల్సు. రూల్సు చూడకుండా కరుణ జూస్తే, మేం జైలు చూడవలసి వస్తుంది తెలుసా? ముట్టిన బాకీకి రసీదిదిగో తీసికో.

నాగప్ప రసీదును తీసికొని సుంకన్న చేతిలో పెట్టును. సుంకన్న రసీదును రెండు చేతులతో పట్టుకొని, దిగాలుగా చూచుచు "సెల్లెలి నగలు నా సెల్లెలి నగలు" అని పలవరించుచుండును. కంటనీరు ఏకధారగా కారుచుండును. చుట్టు ఒక చిన్న గుంపు చేరిఉండును.

[ తెర ]

## 4వ రంగము

ప్రవేశము యంకడు "కోడి పోయె నక్కమ్మ కోడి బోయెనో జెగ్గినక జెగ్గినక" అని ఎగురుచు ఏదో వెదుకుచున్నట్లు చుట్టూ చూచుచు వచ్చును.

(ఈ రంగంలో చిటికెలు డక్కా లయబద్ధంగా వాయించుచుండవలెను. "మోర్సింగ్" ఉండిన మరియు బాగు).

యం - ఓ నాగప్ప మామా! ఓ పుల్లమ్మత్తా! యవ్వా ఓ పుల్లమ్మవ్వా - వ్వా వ్వ్వ్!

(ప్రవేశము ముసలి పుల్లమ్మ. సహజ కఠోరముగా కనించును.)

పుల్ల - యా మప్పా! యంకప్ప మనవఁడా! అంతగా అరవకపోతే ఏం పోయింది. మా యింట్లో అరసేవాళ్లు లేరనా? పండుకున్న సిన్నోడు లేసినాడే!

యం - మరీ మరీ అవ్వా! మా కోడి యామన్నా మీ యింట్లోకి వచ్చిందా? యాడ బుడికితే కూడా కనపడల్యా.

పుల్ల - మీ కోడి మా యింట్లోకి యాలరా వస్తాది? వస్తే కాళ్లిరగదంతాము.

యం - కాళ్లిరుస్తానంటామేవవ్వా! మొన్న మీ మొండి తోకావు మా యింటి ముందర ఆరేసిన కందులు మేస్తుంటే మట్టసంగా మీ దొడ్లోకి తోలాస్తినే.

పుల్ల - నీ పంత్యార[6] సచ్చినోడ గింత లేవే ఎంత వదరుతావురా. మా యింటోకొస్తే మీ కోడే కాదు నీ కాళ్లూ ఇరుస్తాను. పోతావా లేదా! (అని యంకని చెవి గూబలు పిండి వీపు మీద రెండు దబీ దబీమని బాదును. యంకడు "ఊ" అంటూ ఏడ్చును).

[ ప్రవేశము సుంకన్న ]

సుం - ఆఁ ఆఁ అదేమి ముసల్దానా? పిల్లోన్ని సంపేస్తుండావే.

పుల్ల - పిల్లోన్ని సంపేందుకు మేం గొడ్డు సన్నాసులం గామప్పా! కొక్కిరించి ఎదురుసెప్పి సస్తావుంటే ఎత్తుకోని ముద్దు పెట్టుకోమంటావా?

సుం - పోన్లే పిల్లోడు కదా

పుల్ల - బలే పిల్లోన్ని కన్నావు లేప్పా. అంత ముద్దయితే మీ యింట్లోనే సావనీయి. మా పానాలు తీకుండా.

సుం - మాట మాటకీ సావుమాట తప్పితే సచ్చేదానికి యింక యావ మాటలు రావే. సచ్చేది వాడు కాదు.

పుల్ల - మరి నేనా? ఆఁ ఆఁ మా కొంపకొచ్చి నన్నే సావమంటావా! ఓయమ్మో! యిదేమి కరమమురా బగమంతుడా! ఒరే సుల్లోడా! ఓప్పో నాగా! నా గొంతు పిసికేసి సంపండిరా! మీ మూలాన్ని ఈ ముసలిముండ మాటలు పడాల్సొచ్చె ఈడు సావ! ఈన్ని గుంతలో పెట్టా! (అనుచు యంకని మీదికురుకును. సుంకన్న ఆమెను నివారింపబోవును. ఆ త్రోపుకు ఆమె క్రింద పడును.)

ప్రవేశము నాగప్ప. పడియున్న పుల్లమ్మను చూచి ఉగ్రుడయి

నాగ - ఏయ్ సుంకా! ముసల్దానిమీద శానా జోర్ చేస్తుండావే! నీకుద్దిగా నేనుండాను. రాలే గెడపాట్లు[7] పట్టుదామి. కాళ్లిరిసి నోట గుక్కుతాను సూతువుగాని (అని మీసాలు దువ్వుతాడు).

---

6) పంత్యార = పనితేట, అంటే పని అయిపోనూ అని అర్థము. ఇది శాపనార్థం.

7) గెడపాట్లు అంటే ద్వంద్వయుద్ధము.

సుం - ఆహాహా! మీసాలు నీకేనేంలే వుండేది మాకూ వుండాయి. నిమ్మకాయలు నిలబెట్టే మీసాలు.

(అని నాగప్ప మీదికి ఎగబడుచుండగా)

[ తె ర ]

## 5వ రంగము

(కోర్టు : ఠాణాలో 11 గంటలు కొట్టుట వినబడును.)

జవాను - నిశ్శబ్దం. నిశ్శబ్దం. కోర్టువారు తీర్పునిస్తున్నారు. నిశ్శబ్దం.

మేస్ట్రీటు - (కాగితము విప్పి) ముద్దాయి ఉంగరాల నాగప్పవైన నీవు ఆమిదాల సుంకన్న కూతురు గర్భిణీ స్త్రీ రంగమ్మను కొట్టినట్లు రుజువు కాబడినది. ఇందువల్ల ఐ. పి. సి. ఫలానా సెక్షన్ ప్రకారం నీ వీపుపై 20 కొరడా దెబ్బలు కొట్టే శిక్షను ఈ కోర్టు విధించుచున్నది. శిక్ష వెంటనే అమలులోనికి వచ్చునట్లు తీర్మానించడమైనది.

(కోర్టులో కలకలం)

జవాను - నిశ్శబ్దం నిశ్శబ్దం.

నాగ - (కోప దుఃఖాలతో వణకిపోవుచు) ఖజాన ఎక్కించుకోని తిరిగిన కున్నెమ్మ[8]ను కొట్టినానంట! ఒకనికి దమ్మిడీ బాకీ లేకుండా బతికితి. ఒగబికి పెట్టి వుద్దారం సేస్తిని నా వుప్పునే తింటాను. అట్లా నాకి కొరడా దెబ్బలా కొట్టండి, కొట్టండి. ఈయాల నా ఈపు మండుతాది. దీన్ని తెచ్చిపెట్టెనోడిదేదో రేపు మండక పోతాద్యా.

సుం - ద్యావరా, ఇనండి నాదేదో మండుతాదం'ట

మేస్ట్రీటు - అవునా నాగప్పా! ఏమన్నావ్?

నాగ - నేనేమీ అనల్యా ద్యావరా!

మేస్ట్రీటు - చూడు నాగప్పా నీవు చేసిన అపరాధంలో ఎంత ప్రమాదం వుందో చూడు. ఎంతటి అపాయమైనా జరిగి వుండవచ్చును. కదా. రెండు ప్రాణాలు పోయి వుండవచ్చును. నీ తప్పు ఒప్పుకొని సుంకన్నను క్షమాపణ వేడుకో. సుంకన్న తప్పక క్షమిస్తాడు. రాజీ కండి. నేను శిక్ష రద్దు చేస్తాను.

(కోర్టులో కలకలం. గుమాస్తా, ప్రాసిక్యూటరు సంప్రతించుకొందురు. ప్రాసిక్యూటరు లేచి)

ప్రాసి - యువర్ ఆనర్. ఐ.పి.సి. ఫలానా సెక్షన్ ప్రకారం ఒకసారి ఇచ్చిన జడ్జిమెంటును ఆదే కోర్టులో అప్పుడే మార్చడానికి వీలులేదు

మేస్ట్రీటు - సైలెన్స్! దయాస్వరూపుడైన భగవంతుని శాంతినీ న్యాయస్వరూపుడైన చక్రవర్తి[9] శాసనాన్ని నెలకొల్పుట కోర్టు కర్తవ్యం. ఏమంటావు నాగప్పా!

నాగ - ఏమీ లేదు ద్యావరా! మీ కధికారం వుంది. నాకు ఈపుంది కొట్టండి.

(ఠాణా నుండి 12 గంటలు వినబడును)

[ తె ర ]

## 6వ రంగము

[సుంకన్న ఇల్లు. సుంకన్న తండ్రి యల్లప్ప వృద్ధుడు, మంచము మీద పండుకొని దగ్గుచుండును. పాతకాలంలో తెలుగు సినిమాలలో వృద్ధ వేషధారి, సినిమా తుదిలో మరణశయ్య "సీను" పాత్ర అయినసుప్రసిద్ధ "కారెక్టర్ ఆక్టర్" శ్రీ దొరస్వామి వలె నటించవలెను.

ఇప్పుడు "భటియాలీ" రాగము[10]లో వేణువు శబ్దము ప్రారంభము కావలెను. యంకడు వగర్చుచు వచ్చి మంచము ముందు కుప్పకూలి]

యం - తాతా తాతో! నాగప్ప మామని జైలుకేస్తారంట (ఊఁఊఁ అని ఏడ్చును.) పోలీసోళ్లు సంపుతారంట. ఊఁ ఊఁ.

యల్ల - ఆఁ ఏమీ యాలరా?

---

8) కున్నెమ్మ అంటే చిన్నారి పాప.

9) ఇచట మేస్ట్రీటు బ్రిటిషు చక్రవర్తిని పొగడుచున్నాడు.

10) "భటియాలి" రాగం బెంగాలులో పద్మా (గంగ) నది మీద పాడే పడవపాట రాగం. దీని ఛాయలన్ని జానపద సంగీతాల లోనూ ఉన్నాయి. మనలో "గుర్రాల గోపిరెడ్డీ, ప్రక్కూరికి బలీ బతివా" అనే జానపద గీతం భటియాలీ రాగమే. అట్లే మెట్టపొలాల్లో కొర్ర, జొన్న కల్లాలయ్యేటప్పుడు ధాన్యాన్ని గాలిలో తూర్పువేయుచు "పొలిక, పొలిక" అని పాడే పాటా భటియాలీ రాగమే.

**యం** - మరీ మరీ! యాకటి[11]తో వుండే రంగమ్మక్కని కొట్టినా
డని పోలీసోళ్లు పట్టుకపోయేర్య. రంగమ్మక్కని కొట్లేదు.
నాకు తెల్సు.

**యల్ల** - ఇదేం సిత్రంరా! నెట్టేకంటయ్యా[12] ఈరబ్రమ్మం చెప్పలా
గుండ్లు తేలి బెండ్లు మునిగే కాలం వస్తాదని? నాగడు
బసవణ్ణే[13] ఇట్లా పాడు పని సెయ్యడు.

(అని ఖంగు ఖంగున దగ్గుచుండును. సుంకన్న "సచ్చె,
పీడాపాయ" అనుచు ప్రవేశించును.)

**యల్ల** - ఎవర్రా?

**సుం** - వాడే నాగప్పగాడు! కొరడా దెబ్బలు వేస్రి.

(అని తటాలున దిగాలుగా మంచముప్రక్క చతికిలబడును)

**యల్ల** - బాగాలేదు నాయనా! బాగాలేదు మీ యవారం యేమీ బాగా
లేదు. యాలొచ్చిన రగడ్రా యివి. వకతావున తరాలుగా
కాపుర మున్నోళ్లిట్లే నేమిరా బతికేది? (దగ్గును). నాగని
తండ్రీ నేనూ మా కాలంలో ఎట్లుంటిమిరా? (దగ్గును)
ఎంతొద్దికా, ఎంతాసరా! వాల్లొచ్చి యల్లయ్యప్పో! మా
గుంటక పలుగిరిగింది అనేవోళ్లు. నాను మా కొత్త పలుగు
తీస్కొపోండిలే అనేవాణ్ణి. మన వామిదొడ్లో మ్యాత
ఐపోయుంటేగినా, వాళ్లు రాత్రొ రాత్రి నాకి తెలీకుండా
సంగిమోటు[14] గడ్డి, మన దొడ్లో పారేసి పొయ్యేవాళ్లు.
(దగ్గును) ఈ రగడకి ముందు మీరెట్లా బతికితిరి నెప్పు[15]
తెచ్చుకో. ఒక కోడిక్యాసరం ఇంత బమ్మాండమా? నీకీ
కేసులో సవరమైనదెంతో చెప్పు! మునుపటి డంతొచ్చెనా
మాసూలు నీకు? నాగప్ప తనింటిదాని సొమ్ములిచ్చి నీ
యింటి జప్తు నిలిపె గదరా! లేకుంటే నీ చేతికి చిప్పే
కదరా! (దగ్గును). ఇంతకీ ఈ రగడలో నాగప్పదేనా
తప్పు? మాటకి మాట, సేతకి సేత సేసినాడు. మీసా
లుండేది నిమ్మకాయలు కట్టేదానిక్కాదురా. నీకి కానోడు
నీకి చెరుపు సేసి నీకి సిక్కితే "నిన్నిడిసిపెట్టినాను పోలే,
జోక"[16] అని దువ్వడానికిరా! (దగ్గును).

**సుం** - మరి తప్పంతా నాదేనంటావు. వాడేం జేసినా సరా? వాడు
మనింటికొచ్చి నన్నూ నావోళ్లనీ తన్నినా, వాణ్ణి నే మెచ్చు
కోవల్లా?

**యల్ల** - వాడట్లా సేయలేదే! సేసినాడే అనుకో ఆడనే తత్వం
వుండాది. పో! నా మాటినుకో. నాగప్పనీ, యింటోళ్ళనీ
మనింటికి కొండొనిరా పాయసం కాసి, సంజీవరాయనికి
పెట్టి పండగ తినండి. మళ్లీ జతగాళ్లు కాండి. నీ మనసు
లోంది నాకు తెల్సు. బిరీన పిల్సుకరా! పోమ్మా పో!

**సుం** - అట్లే సేస్తానప్పా (అని లేవబోవుచుండగా నేపథ్యం నుండి
వినబడును. ఇచట వేణుగానం ఆపివేయవలెను.)

**నాగ** - అదికాదే. అయిందేదో సిచ్చ అయింది. ఇంకయ్యేదేముందీ
అంట! వానిమీద నేనూ ఒక తప్పుడు కేసు పెడతాను.
దీపాంతరం పంపిస్తాను గల్లు[17] కియిస్తాను. వూరికే
ఇడుస్తానా ఆమెళ్ల నాకొడుకుని.

**సుం** - సూడి సూడి, వాడేం కూస్తుండాడో, ఊహూఁ నేను పోను.

[ తెర ]

## 7వ రంగము

[రాత్రి - చీకటి. సుంకన్న ప్రవేశము. నేపథ్యము నుం
తప్పెట వాద్యము, నక్క కూత వినబడవలెను.]

**సుం** - ఈ దొంగ నా కొడుకు ఏం జేసినా సేసేవోడే నంద
జూస్కొని ఇంటి కగ్గిపెట్టినా పెట్టేవోడే. గుడిసి సుట్ట
వకసారి తిరిగైనా వస్తాను.

(అని మెల్లగా అడుగులు వేయుచు వచ్చును. స్టేజి అవత
చివర ఒక కొరివి కనిపించును. దానివైపు పోవును
అతడవతల చివర చేరేటప్పటికి కొరివి మాయమై స్టే
ఇవతల చివర కనిపించును. సుంకన్న అవతలవైపు

---

11) యాకటి అంటే గర్భం, చూలు.

12) నెట్టేకంటయ్య - నెట్టికంటి ఆంజనేయస్వామి. ఈ దేవు
గుడి గుంతకల్లు జంక్షనుకు కొద్ది మైళ్ళలో కసాపురం (కాళ్య
పురి)లో ఉన్నది. రాయలసీమలో మగవారి పేర్లు "నెట్టేకల్లు"
అని వుంటాయి. కన్నడంవారూ (బ్రాహ్మణేతరులు) పెట్ట
కొంటారు.

13) బసవణ్ణ (ఎద్దు) సాధుత్వానికి చిహ్నం.

14) సంగిమోటు అంటే ఎక్కువ, చాలా.

15) నెప్పు అంటే జ్ఞాపకము.

16) జోక (కన్నడపదం) భద్రంగా పో అని అర్థము.

17) "గల్లు" అంటే ఉరిశిక్ష. "గాలోస్" శబ్దభవం.

నుండి జాగ్రత్తగ చూచును. స్టేజి ఇవతలవైపు నాగప్ప, గుడిసె ప్రక్కన ఉండు ఒక గడ్డికుప్పకు కొరివితో చిచ్చు పెట్టుచుండును.)

సుం - ఆఁ ఆఁ నిలీ, వరే దురమార్గుడా! అని అనుచుండగా నాగప్ప పారిపోవును. కాలుచున్న గడ్డికుప్పను ఆర్ప కుండ సుంకన్న "పట్టుకో పట్టుకో" అనుచు నాగప్పను వెంబడించును. నాగప్ప కొరివితో సుంకన్న నెత్తిపై బాదును. సుంకన్న పడిపోవును. నాగప్ప పారిపోవును. మంటలు పైకెగయుచుండగా, నేపథ్యమున హాహాకార ములు వినిపించుచుండగా)

[ తె ర ]

## 8వ రంగము

ఈ రంగములో హిందుస్తానీ రాగం "జోగియా"లో షహనాయి అయినా, కర్ణాటక రాగం "రేవతి"లో నాగస్వరమైనా నేపథ్యము నుండి వినబడుచుండవలెను.

[బయలు. చెట్టుక్రింద మంచము. మంచముమీద యల్లప్ప పరుండి యుండును. యంకడు మంచము కోడు దగ్గర మోకాళ్ళ మధ్య తలపెట్టి "తాతా తాతా" అని ఏడ్చుచుండును. చుట్టూ ఒక గుంపు కూడియుండును. సుంకన్న అటు ఇటు చూచుచు మెల్లగా వచ్చును. యల్లప్ప సుంకన్నవైపు తిరిగి)

యల్ల - ఒరే సుంకడూ!

సుంకన్న ఏమీ మాట్లాడడు.

యల్ల - ఏయ్ సుంకా!

సుంకన్నకు వినిపించినట్లు లేదు.

యల్ల - నాయనా! సుంకన్నా!

సుం - ఆఁ (మేలుకొన్నట్లు ఉలికిపడి యల్లప్పవైపు చూచును).

యల్లప్ప - నేనేమి సెప్పితినిరా తండ్రీ, రగడలింతేరా, మీ క్యాపాలు మీ కొంపల్నే కాల్చె (ఆయాసంగా) సగమూరి కగ్గిపెట్య.... వక్కరేణిలో[18] నీల్లుండబట్టి సరిపాయె, లేకుంటే, వూరంతా బుగ్గయ్యేది కదరా! ఏమొచ్చెరా నీకు కానీ నాగప్పకు కానీ.

సుం - అగ్గి పెట్టినోడు వాడు, నేను కాలితో తొక్కి మంటను ఆర్పిండాల్సిందే. ఆ తప్పు నాదే అనుకో.

యల్ల - నీ తప్పొప్పుకొంటివి. ఎదుటివాని తప్పును మింగేది రాలేదే నీకు. ఎవరగ్గి పెట్టితేనేమి, కాలిందందరి కొంపలురా! మంటలార్పడానికి దాతనై ఆర్పలేదని నీవే అంటివి. మరి జాస్తి తప్పు నీదే కాల్యా. మంట ఆర్పల్లరా ఎంత సిన్నదైనా ఆర్పల్ల. పగనీ అంతేరా, పగ, చిచ్చురా. తప్పు సేసినోణ్ణిడిసిపెట్టల్ల. ఈడ మనం ఈ గొనం సూపిస్తే పైన బగమంతుడు (అని వ్రేలు పైకి చూపి గట్టిగా దగ్గును. గొంతు గుర గుర అను చుండగా ప్రాణము వదలును. నేపథ్యము నుండి చిన్న పాప ఏడ్పు "క్యారు" మని వినపడును.)

సుం - (యల్లప్ప దేహముపైబడి) అయ్యో! ఏమి సేస్తినప్పా నీవు సెప్పినట్లే సేస్తాను. నా నాగప్ప బావ కాళ్ళమింద పడతాను. రచ్చించమంటాను, ఛమించమంటాను. ఛమించకపోతే తల పగులగొట్టుకుంటా నంటాను. నాగప్ప బావా! నాగప్ప బావా (అని నిష్క్రమించును).

[ తె ర ]

## 9వ రంగము

(సుంకన్న, నాగప్పలు పులికట్టు ఆడుచుందురు. సుంకన్న మేకలు, నాగప్ప పులులు)

సుం - నాగప్ప బావా! ఈ మ్యాకని కొట్టు సూతాము. (అని ఒక మేకను వేయును.)

నాగ - లేదు బావా! నేనేమంత మొద్దోణ్ణా? ఈ మ్యాకని కొట్టితే, సెవిలోని ఆ పులి గతేం గావల్ల అంట. ఊహూ! ఈ పక్కకి జరుపుతా (అని పులిని ప్రక్కకు జరుపును).

(యంకడు ఒక పసిపాప నెత్తుకొని వచ్చి నాగప్ప ప్రక్క కూర్చొనుటకు ప్రయత్నించుచుండగా)

నాగ - ఏంలే యంకిగా! మేనకోడల్నెత్తుకోని వచ్చినావు. కోణి యాడదా చేస్తివి? (అని నవ్వును).

---

18) వక్కరేణి అంటే మంచినీరు నిలువవుండే పెద్ద జలాశయము. ఇవి కర్నూలు, అనంతపుర జిల్లాలలో పల్లెటూళ్ళలో త్రాగు నీటి ఆధారాలు. ఇవి వాన నిలువ ఉండు నీళ్లు. రాయలసీమ స్పెషాలిటీ రోగమైన అతి బాధాకరమైన "నారి కురుపు" వక్కరేణి నీరు త్రాగినందువలన వచ్చును.

**యంక** - (వండ్లీ గిలించుచు, నాగప్ప ప్రక్క కూర్చొని) మామా మామా! ఆ మ్యాకని కొట్టి కొండమిందికి పో!

సుం - ఊ యంకా! మీ మామ కాట చెప్పిరా! ఒకసారైనా గెల్నియి (అని హిహిహి అని నవ్వును).

నాగ - (ఆలోచించి నిదానముగా పులిని జరుపుచు) పులుల పని బిగిసిపోతా వుందే సుంకన్న బావా! ఈ ఆటలో తిరుమలరావు స్వామి ఏసినట్లే స్తివే మ్యాకల్ని! మ్యాకలు పులుల్ని కట్టుతాయనుకోలేదు (అని హాహాహా అని నవ్వును)

**యం** - ఈ యేల తాతుంటే బాగుండేద్య.

సుం - ఇవి మ్యాకలైనా కూడగట్టుకోని నడుస్తాయి, పులుల్ని కడతాయి. బూమ్మీద శానావాని పద్దతింతే. కడకి మ్యాకల్దే రాజ్యం అని వీరబ్రహ్మం సెప్పినాడంట.

(ఇచటనుండి నాగస్వరం సౌరాష్ట్రి రాగం (పవమాన సుతుడు.... "నీ నామ రూపములకు" అనే త్యాగరాజకృతి)లో ఆలాపించవలెను.)

(లోపల నుండి "ఆడగొంతు" వరే యంకా మీ మామని బువ్వకి రమ్మనరా. ఈళ్లాటగ్గుసుంటే పొద్దు గిద్దూ మరుస్తారు")

యం - మామా! బువ్వకి రావల్లంట.

(అని నాగప్ప బుజం పట్టి లాగును).

సుం - నిత్రా! ఆట మంచి మోపులో వుంటే నీదొక గద్దలం.

(లోపలనుండి "యంకడూ, మీ నవ్వుల్లో నే పిల్చిందిన పడల్యా? మీ మామని రమ్మనరా).

**యం** - రా మామా అంటే! రా రద అత్త పిలుస్తా వుండాది.

సుం - (ఆట చెడిపి) పులులు మూలకెళ్లి సచ్చింటే ఇంకా యేమో గెలిసేవాణి వలె నిక్కుతావు. పోరాదా నా సెల్లెలికి క్యావ మెస్తాది. ఆనక నన్ననీని.

నాగ - ధా ధా ధా ధా! ఈ ఆడోళ్లు రొవంతసేపు ఆణ్ణివ్వరు. బతుకంతా బువ్వ, చేను, మ్యాత, నీల్లు ఇవేనా, (ప్రేక్షకుల వైపు సాభిప్రాయముగా చూచుచు) మనిషైనంక ఏదైనా మంచిది చేయల్ల.

సుం - (అంగీకార సూచకముగా తలూచుచుండగా, నాగస్వరం మంగళ చరణానికి వచ్చుచుండగా)

[ తెర ]

## అధోజ్ఞాపిక

ధరవరలు - నాడు నేడు - కొలమానములు వెలలు ఇప్పటివాని ప్రకారము లెక్కగట్టి ఈయబడినవి.

| అంశము / వస్తువు | నాడు 1939 - 40 | నేడు 1989 - 90 |
|---|---|---|
| కేంద్ర బడ్జెటు (సంస్థానాలు మినహా) | రూ 82 కోట్లు | |
| కేంద్ర బడ్జెటు(అఖిలభారత) | | రూ. 82,000 కోట్లు |
| రూపాయ విలువ | 100 పైసలు | 1 పైస |
| బంగారం (10 గ్రా॥) | రూ. 20 | రూ. 3500 |
| వెండి (10 గ్రా॥) | 35 పైసలు | రూ. 71 |
| ఇంటి అద్దె (నగరంలో) | రూ. 25 | రూ. 1000 |
| (చిన్న వూరిలో) | ఊరకనే | రూ 200 |
| బియ్యం సంచితో సహా | రూ. 8 | రూ. 300-700 |
| కందిపప్పు | కెజి. 20 పైసలు | కెజి. 12 రూ. |
| చింతపండు | కెజి. 10 " | కెజి. 12 రూ. |
| చక్కెర | కెజి. 25 " | కెజి. 8 రూ |
| బెల్లము | కెజి. 10 " | కెజి. 7 రూ |
| మిర్చి | కెజి. 25 " | కెజి. 20 రూ |
| నేయి | కెజి. 30 " | కెజి. 50 రూ |
| వేరుసెనగనూనె | కెజి. 15 " | కెజి. 25 రూ |
| పాలు | లీటరు 25 " | లీటరు 6 రూ |
| సాదా పంచె జత | రూ 1-50 " | రూ 60 |
| సాదా (పత్తి) చీర | రూ 1-25 " | రూ 50 |
| ఇడ్లీ (ఒకటి) | 3 పైసలు | 50 పైసలు |
| కాఫీ | 3 " | రూ 1-50 పైసలు |
| హేర్ కట్ | 6 " | రూ 6 |
| చెప్పుల జత | 50 " | రూ 60 |
| సినిమా (క్రింది క్లాసు) | 6 " | రూ 5 |
| చెఱకుగడ | 1½ పైస | రూ 3 |
| దినకూలి | 25 పైసలు | రూ 15 |
| గుమాస్తా జీతం(నెలకు) | రూ 30 | రూ 1500 |
| హైస్కూలు ఫీజు | నెలకు రూ 5-25 పై॥ | ఉచితము |
| సైకిలు | రూ 25 | రూ 800 |
| కారు (ఫారిన్) | రూ 1000 | రూ 5 లక్షలు |
| హోటలు భోజనము | 13 పైసలు | రూ 5 |
| "హిందూ" పత్రిక | 12 " | రూ 1-70 పై |
| టాయిలెట్ సబ్బు | 25 " | రూ 4 |
| మాట | అమూల్యము | మూల్య రహితము |
| కవి, పండిత సత్కారము | రూ. 116-1116 | ఇప్పుడూ అంతే |

## శబ్దాల్ని ప్రేమిస్తూ!....

### శ్రీ భగ్వాన్

దీపాన్ని వెలిగించే ముందు
అగ్గిపుల్ల చేసే శబ్దంలో
నవోజ్వల చైతన్యపు కాంతి ఉంది.

కంటి జీర ఎరుపెక్కే ముందు
ఊపిరి చేసే శబ్దంలో
మహోన్నత నవ్య ప్రపంచపు రూపం ఉంది.

ఎగిరే జెండా రెపరెపల శబ్దంలో
ఐకమత్యమ్యనే అద్భుతాయుధం ఉంది.
ఎగిరే గువ్వల రెక్కల టపటపల శబ్దంలో
శాంతి శస్త్రం ఇమిడి ఉంది.

పక్షుల కిలకిల శబ్దాలు
ఉషోదయాగమన సూచికలు
నదీ ప్రవాహపు గలగల శబ్దాలు
నవనాగరికతా సంకేతాలు.

కడుపు మండినప్పుడు వెలువడే
ఆకలి కేకల శబ్దాలు
ప్రపంచం నలుమూలలా ప్రతిధ్వనిస్తాయి.

కన్ను పగిలినప్పుడు జారే
వేదనాస్రు బిందువుల శబ్దాలు
గుండె గుండెలో జ్వలిస్తాయి.

మనసు రగిలినప్పుడు
జీవితం అరణ్యమవుతుంది
అరణ్యం తుపాకీ పేలిన శబ్దమవుతుంది.

పీడిత జన జీవనసాగర మథనోద్భవ శబ్దాలను
తలమీద కెత్తుకుని
అమాయక జన హృదయాంతరంగ జ్వలిత శబ్దాలను
తనువెల్లా పరచుకుని
పిడికిళ్ళలో భుగభుగల
భగభగల నినాదాల శబ్దాల్ని బిగించుకుని
సర్వమానవ శ్రేయోకాంక్షతో
శబ్దాల్ని ప్రేమిస్తూ
గమ్యంవైపు సాగిపోతున్నా!....

## ఒక్క నిప్పు హే....!

### శ్రీ పసునూరు శ్రీధర్ బాబు

అక్షరాలన్నీ రాలిన రిక్త పుస్తకంలా
మనసు అవ్యక్తమై అల్లాడుతుంటుంది
మాట్లాడే చిలుక పారిపోయి మిగిల్చిన
బోసిపోయిన ఖాళీ పంజరంలా
మొహం వెలవెలాబోతుంటుంది
బూజుపట్టిన మేడలాంటి గుండెలో
అలజడ్లు సాలీడులై సామ్రాజ్యా లేర్పర్చుకుంటాయ్
ఆశల సీతాకోక చిలుకలు అందులో చిక్కుకుని
ఒక్కొక్కటిగా నిర్జీవమైపోతుంటాయ్....
మరుగుతున్న ఆశయాలు మస్తిష్కంలోంచి బయల్పడి
నుదుటిమీద సెలయేరుల్ని స్రవిస్తున్నప్పుడు
చూపులు అశ్రువులుగా కరిగేలోపే
శవంగా శయనించటమే మేలనిపిస్తుంది!
ఆయుధాగార విస్ఫోటనానికి అగ్గిపుల్లే చాలన్నట్లు
ఒక్క నిప్పుహే....
దేహాన్ని దహిస్తుంది!

డా॥ యు. ఎ. నరసింహమూర్తి

# చలం - సృజన

బ్రహ్మ రాత తెలుసుకోవడం కష్టం. కవి ఎలా రాయగలుగుతున్నాడో తెలుసుకోవడం కష్టం. ఎవడు ఎప్పుడు ఎందుకు ఎలా ఎంతకాలం రాస్తాడు? అనే ప్రశ్నలకు నిర్దిష్టమైన సమాధానం కోసం అన్వేషణ కొనసాగుతూనే వుంది. కొందరు విశ్వాసాల మీద, కొందరు తాత్త్వికజ్ఞానం మీద, కొందరు శాస్త్రీయ పరిజ్ఞానం మీద ఆధారపడి అన్వేషణ కొనసాగించేరు. సమగ్రమైన ఇదమిత్థమైన సమాధానం ఇంకా రాలేదు. చలం కవి విమర్శకుడు, తార్కికుడు, తాత్త్వికుడు. అతనికీ కొన్ని విశ్వాసాలున్నాయి. అతని దృష్టిలో రాతలన్నీ కవిత్వమే. ఈ రాతలకు మూలం ఏమిటి? వృద్ధి క్షయా లెలా సంభవిస్తాయి? విలువలెలా రూపొందుతాయి? ఎలా అంతరిస్తాయి? మొదలైన విషయాలను గూర్చి చలం ఎక్కువగానే ఆలోచించేడు.

సృజనకు మూలద్రవ్యం తప్పనిసరి. కవిని బ్రహ్మ అంటే అన్నారు గాని ఎక్కడా లేనిదానిని అతడు సృష్టించలేడు. బయట వొస్తువు లేనిదే దానినించి రాగల ఆనందాన్ని కల్పించుకోగలమనసే వుంటే అది ఎంత అదృష్టం! అంటాడు చలం. అనుభవ పునశ్చరణే మానసిక వ్యాపారం. భౌతిక జగత్తు అనుభవాలకు మూలం. అందుచేత సృజన ఉన్న వస్తువును ఆశ్రయించుకునే సాగుతుంది. భౌతిక జగత్తు సర్వసామాన్యమైనది. కాని ఏదన్నా రసం మనసుకి అందినప్పుడు ఆ రసాన్ని గాక ఆ రసం రేపే జ్ఞాపకాల్ని, అసోసియేషన్స్‌ని మాత్రమే అనుభవిస్తారు చాలామంది. కవి రసాన్ని అందిపుచ్చుకొని మనుషులు చూడని అంటుకోని ఆశయాల్ని వాళ్ళ అందుబాటులోకి తీసుకువస్తాడు. కవిత్వంతో వాళ్ళ ఆలోచనల్ని ఉద్రేకింపజేస్తాడు. జీవితంలో కొత్త సమన్వయం చూపిస్తాడు అంటాడు చలం. ఐతే ప్రకృతిని ఇతరులకంటె భిన్నంగా చూడగల శక్తి కవికి ఎలా వచ్చింది? అనే ప్రశ్న మళ్ళీ వస్తుంది. అందుకే చలం నండూరివారిని సగం కొంటెగా సగం యాగర్‌గా "అసలు సోర్స్ ఏమిటి?" అని అడిగాడు

"పూర్వ జన్మనించి తెచ్చుకున్నాను" అన్నాడు చిరునవ్వుతో గొప్పగా గంభీరంగా - నండూరి. చలం ఏమంటాడు! తన నమ్మకాన్ని పక్కన పెట్టి 'ఆ అనుభవం మొదట్లో వాస్తవంగా జరిగినప్పుడు ఎంత గొప్పదై వుండాలి!' అంటూ ఆశ్చర్యపోయేడు. ఈ వెదుకులాటలో వెలుగునీడలు రెండూ వున్నాయి. ప్రస్తుత జీవితం ఎంత అథమంగా వున్నా ఏదో ఒక మూడ్ లేక హైయర్ ఇన్‌స్పిరేషన్ కారణంగా, ఏ పూర్వ సంస్కారాన్నించో ఉత్తమ కావ్యం కలగవచ్చా? అనే సంశయం అతనిని బాధించింది. పూర్వ సంస్కారం మాట ఏమోగాని గొప్ప కవుల జీవితాలన్నిటా ఒక ఘర్షణ కనిపిస్తూందని చలం తెలుసుకున్నాడు. ఆ ఘర్షణకు రూపం ఏదైనా కావచ్చును. రచయిత స్ట్రగుల్ పడ్డకొద్దీ, అతనిలో రసం విస్తీర్ణమై కాయితంపై పలుకుతుంది. ముఖ్యం ఇంటర్నల్ స్ట్రగుల్ అంటాడు చలం.

చలం సృజనతత్త్వానికి సంబంధించి కూడా రెండు పడవలపై కాళ్లు పెట్టినట్లు కనిపిస్తుంది. ఒకచోట నిజమైన కవిత్వం సబ్ కాన్షియస్ లోంచి బయల్దేరుతుందన్నాడు. కవిగాని పోతన్న కృష్ణుడి ఘట్టాలలో కవిత్వంలోకి బ్రేక్ అవడం ఇందుకు ఉదాహరణగా పేర్కొన్నాడు. ఒక అనుభవాన్ని కాన్షియస్‌నెస్ పై పొరల్లోంచి అంతరమైన డెప్త్స్‌లోకి నెట్టేసి ఆ అనుభవం లోంచి కవిత్వాన్ని ఆత్మ విశాలత్వాన్ని సేకరించుకునేందుకు ప్రయత్నిస్తాడు చలం. ఇది శాంత మహాసముద్రం నుండి పూర్వ ఉద్రేక తరంగాలను ఏరుకునే ప్రయత్నమేనా? 'కళలకైనా ఆత్మ విద్యే ప్రధానమేమో' అంటాడు చలం ఇంకొకచోట. అతని దృష్టిలో తన ఆత్మతో విశ్వం ఆత్మని అందుకోవడం ఆత్మవిద్య. త్యాగరాజు, షేక్స్పియర్ వంటివాళ్ళు ఇలాంటి ఆత్మవిద్య తెలిసినవాళ్ళన్నాడు. అయితే ఫ్రాయిడ్ చెప్పిన సబ్ కాన్షియస్ ఈ ఆత్మవిద్య ఒకటి కావు. ఆత్మ ఔన్నత్యం - ఆత్మ మాధుర్యం అన్న మాటలకు ఆత్మవిద్య అన్నమాటకు బోలెడంత భేదం వుంది. ఐతే చలం ఆ భేదాన్ని పాటించి వుండడు. ఒక అనుభవాన్ని జ్ఞాతంలోంచి అజ్ఞాతంలోకి నెట్టడం అజ్ఞాతం నుండి జ్ఞాతానికి అందంగా చేదుకోవడం కూడా శాస్త్రీయమైన విధానం కాదు. అది ప్రయత్న సాధ్యమైనదైతే ఎందరో ప్రయత్నించి గొప్ప

కవులుగా, కళాకారులుగా తయారయ్యేవారు ఆ మార్గం సరైనది కాదు గనకనే చలం స్పష్టంగా ఆధివాస్తవికుల పద్ధతిని వ్యతిరేకించాడు. చాలామందిలాగానే సృష్టిశక్తి యెక్కువగా వున్నవాడు గాని యితరుడు గొప్ప కళాశక్తి గలవాడు కాలేడు' అని తీర్మానించాడు. సృష్టిశక్తి ఎలా వస్తుందనే అసలు ప్రశ్న అక్కడ మాత్రం చలం అది ఇన్‌స్పిరేషన్, పూర్వజన్మ సంస్కారం, ఆత్మవిద్య - 'ఏదో ఆన్నినో లేక అన్నీ వాకటినో నాకు తెలియదు' అన్నాడు. తన సాహిత్య జీవిత పరిణత దశలోనైతే 'ఈశ్వరుడు ఏమీ యిస్తూంటే రాస్తున్నాను నాకేమీ తెలియదు ఆ రోజుల్లో కూడా నా ఆత్మ వ్రాయిస్తే వ్రాసినవే ఆ కథలూ, నవలలూ, నాటకాలున్నూ' అన్నాడు చలం. ఒకప్పటి ఆత్మ-చివరి దశలో ఈశ్వరుడు ఇద్దరూ ఒకరేనా!

సరే! ఎలా రాస్తున్నాడో తెలియదు. ఎందుకు రాస్తున్నాడు? అంటే అసలు అతనికే తెలియని ప్రోద్బలం అతన్ని బాధిస్తుంది. తనను తాను ఇచ్చేసుకునే ప్రయత్నంలో రాస్తాడని ఒకచోట అన్నాడు తనను ఎవరికి ఇచ్చేసుకుంటాడు? ఎవరికి మాత్రం ఇతగాడు ఎందుకు? ఇచ్చేస్తే మాత్రం పుచ్చుకోవడానికి అందరూ సిద్ధంగా వుండాలా? ఎవరూ ఉదారంగా ఇతరులను పుచ్చుకోరు. ప్రతివాడూ తననుతాను పుచ్చుకోవడానికే చూస్తాడు. కవి తనను తాను ఇచ్చుకున్నానని అనుకుంటూ ఎవడికి తెలియని వాడికి అందిస్తూ వుంటాడు. ఇది ఇచ్చేవాడికీ పుచ్చుకునేవాడికీ మధ్యనున్న సంబంధం. కవి తనకు తెలియని తనను అందిస్తున్నాడని ఎవడు గ్రహిస్తాడో, అంగీకరిస్తాడో, విశ్వసిస్తాడో వాడు మాత్రమే కవి ఇచ్చినదానిని పుచ్చుకుంటాడు. అందుచేత రాయడంలో తనను తాను ఇచ్చేసుకోవడంకంటే కూడా ఇంకా ఏదో వుంది.

ఎవరికీ కాకపోయినా కల్పించడమనేది కవికి ఆనందం అంటాడు చలం ఇంకొకచోట. ఆ ఆనందాన్ని ఇతరులు కూడా పంచుకోవడం కవికి ఇష్టమే. సమకాలికులు ఆనందించకపోయినా భవిష్యత్తు పులకరించే అవకాశం వుందనే విశ్వాసంతో రాసే కవులున్నారని రాస్తూ చలం భవభూతిని, భారవిని పేర్కొన్నాడు. ఆ ధైర్యానికి ప్రోత్సాహానికి ఓదార్పుకి తన కల్పనలో వుండే ఆనందం కారణమంటాడు. అటువంటి కవి స్థితిని తన పాలు తాగే బిడ్డ ముఖం చూసి పరవశించే తల్లి స్థితితో పోల్చాడు. కవికి కావ్యానికి మధ్యనుండే సంబంధం అది! అది తన సృష్టి అనుకోవడంలో వుంది అది అంతా. ఆ సృష్టి తన విశ్వాసానికి ప్రతిరూపం. తన మనసు కేంద్రంగా కల్పనా వలయాలను సృష్టించినవాడు క్షణాలలో విస్తరించి క్షణాలలో అదృశ్యమయ్యే ఆ వలయాలలో చిక్కుకుంటాడు. ప్రపంచం మనసుని పొదివి పట్టుకున్నవాడు భవిష్యత్తులోకి బాణాలు విసురుతాడు.

రాత ఒక వీక్నెస్. 'ఒకరికి చెప్పగలమనుకోవడం అహంభావం. ఒకరికి చెప్పాలనుకునే కోర్కె మనోదుర్బలత్వం' అన్న హరీన్ ఛట్టో మాటలను చలం అంగీకరించినట్లే కనిపిస్తుంది. అహంభావం మానసిక వ్యాపారం. అది ప్రబలంగా వున్నంత కాలం మనసు దేనితోనూ తృప్తిపడదు. అశాశ్వతమై యెప్పుడూ మారే ఆశలతో ఆరాటపడుతూ వుంటుంది. ఆ ఆశలను ఊరడించడానికి సృజన వ్యాపారం కొనసాగుతుంది. ఒక కళాత్మక సృష్టితో మనసు ఊరడిల్లదు. భౌతిక ప్రపంచంలాగే కవి మనసు సైతం ఎప్పటికప్పుడు ఇవాల్వ్ అవుతుంది. సౌందర్య దాహం ఎప్పటికప్పుడు ఇనుమడిస్తుంది. తన మనసు కల్పించుకున్నదే సౌందర్యం. ఆ సౌందర్య రహస్యాలను అందరకూ అందించాలనే అహంభావం ఒకదాని వెనుక ఒకటిగా కళా రూపాలను సృష్టించుకుంటూ పోతుంది. ఆ సృష్టి రహస్యాలను లోకం ఎంతగా ఆకళించుకుంటే కవి అంతగా పరవశించిపోతాడు. తాను గుర్తించిన అందాన్ని ఇతరులు గుర్తించకపోతే కవికి మరణబాధ. అనంతైశ్వర్యాలు ఆ బాధ ముందు తీసికట్టు అని చలం భావన. ఈ పద్ధతిలో మానసిక వ్యాపారానికి మేథోస్థితికి గల సంబంధం ఎలాంటిదో నిర్ణయం కావడంలేదు. అహానికి పరిమితు లున్నాయా! ఉన్నాయి. అహంకారం సంకుచితమైనదైతే కళ వికసించదు. దాని చైతన్యపరిధి విస్తరించాలి. అందుకే చలం 'అహానికి లోకానికి భేదం లేదని తిరిగి తిరిగి రూఢి చేసుకుంటాడు కళాశీలి' అన్నాడు.

రాయడం ఒక వీక్నెస్ అనుకున్నట్టుగానే ఒక మనోజాడ్యం అనుకోవడం కూడా వుంది. ఒక స్థాయిలో వుండే మనోజాడ్యం అంటారు. ముదిరితే పిచ్చి అంటారు. ఏ ఆశయానికో, అన్వేషణకో, కళకో జీవితాన్నర్పించినవాడు పిచ్చివాడంటాడు చలం. రచయితగా చలానికి పట్టిన పిచ్చి ఎలాటిదో అందరికీ తెలిసినదే. కాని చలం మాత్రం ఎప్పుడూ నా రాతలన్నీ నిర్లక్ష్యంతోనే రాశానంటాడు. సారస్వతానికి సేవ చేద్దామనే పవిత్రోద్దేశ్యం లేనేలేదన్నాడు. శృంగారం ఒక గొప్ప కళగా భావించి స్త్రీ విమోచనం కోసం చలం రాసేడని అదే అతని ఆశయమో, అన్వేషణమో, పిచ్చో అనుకుంటాం మనం. మనం నిజమా? చలం నిజమా? 'ఒక పువ్వు పూసింది' లాంటి రచన

లన్నింటికీ మనోజాఢ్యం కారణమేమో! అన్న సందేహం చలానికి కలిగింది. తన చుట్టూ గిరి గీసుకుని ఒక ప్రపంచాన్ని కల్పించుకుని తిరగడం, చెట్టూ-చేమ లన్నిటిలో ప్రాణం వుందను కుని మనుష్య భావాలను వాటికి ఆరోపించడం సాధారణమైన మనసు చేయగలిగిన పని కాదు. తాను అలా చేయడం తన మనసు అభివృద్ధి పొందిన దనడానికి చిహ్నమా? రోగ లక్షణమా! అనే సందేహం కలిగింది. చలాన్నే కాదు. చాలామంది గొప్ప రచయితల్ని ఈ సందేహం బాధించింది. అది పిచ్చిలాటిది కాని పిచ్చి కాదన్నారు. 'లాంటిది' అంటే ఏమిటో మరి!

ప్రతిసృష్టికి ఒక మహత్తర ప్రోద్బలం వుందనేవాను న్నారు. వీక్నెస్ - మనోజాఢ్యం ఇలా విచికిత్స కొనసాగించిన చలం ఒకచోట 'ఆనాటి అతని బాధ ఈనాటి నా శక్తి' అన్నాడు. మొక్కపాటి రామ్మూర్తి చలం స్నేహితుడు. సృష్టికి కురుపుగా ఉండలేక ఆత్మహత్య చేసుకున్నాడు. చలం రక్తానికి, వేళ్ల కొనలకి విపరీతమైన ఉద్రేకాన్నిచ్చినవి మొక్కపాటి రామ్మూర్తి బాధ, ఆశయాలు, సందేహాలు, గాఢత్వాలు! చలం ఇలాగనడం రామ్మూర్తితో అతనికి గల అనుబంధాన్ని సూచిస్తుంది. కాని రామ్మూర్తి లేక చలం లేడా? ఒక్క రామ్మూర్తేనా - అలా ఉద్రేకపరిచే ఇతర ప్రకృతి లేదా? అనే ప్రశ్న ఎప్పుడూ మిగిలే వుంటుంది. ఎందుకు రాస్తాడు అన్నదానికి ఒకే సమాధానం కనబడదు.

రచయిత వ్యక్తిత్వానికి జీవితానికి గల సంబంధాన్ని గూర్చి కూడా చలం ఆలోచించేడు. చలం దృష్టిలో జీవితమంటే కాలంలో కదలిక. అతని దృష్టిలో కళాత్మకంగా బతకడం ఒక గొప్ప కళ. యోగ్యతా పత్రంలోని "తనకూ లోకానికీ జరిగే అంతర్బహిర్యుద్ధరావమే కవిత్వం" అన్నమాట చాలా వ్యాప్తి పొందింది. ఎవరంటేనేం? అది చలం మాట కూడా. కవి ఒక బతుకు బతుకుతూ వుంటాడు - ఇంకొక బతుకును కోరుకుంటూ వుంటాడు. ఈ రెండింటి మధ్యనున్న అంతరం కవి అశాంతికీ, అన్వేషణకూ మూలంగా నిలుస్తుంది. ఆ ఏటికి ఎదురీదడంలోనే గొప్ప కళ ఉద్భవిస్తుంది. లక్షల కొలది నోరులేని పిల్లలు, దరిద్రపు బళ్లలో దినదినము పడుతూన్న దిక్కుమాలిన వేదన చలం బాధలో ప్రతిఫలించింది ఎందరు స్కూళ్ల ఇనస్పెక్టర్లు లేరు? ఆ పసిపిల్లల పిచ్చిచూపులు వాళ్ల ఆత్మల్ని మండించ లేదేం? వాళ్లకు మరో లోకాన్ని చూసే కన్ను లేదు. వాళ్ళలో నిజంగా ప్రేమించే హృదయం లేదు. 'నా జీవితానికీ, నా రాతలకీ ఎంతో కలయిక కనబడుతుంది నాకు' అంటాడు చలం. 'తనలాగే ఇతరులు కూడా జీవితంతో సంబంధం వున్న రాతలే రాస్తు న్నారా? అని పరిశీలించి నా మిత్రులలో గొప్ప కవిత్వం రాసేవారి జీవితాలకీ ఆ కవిత్వం ఆశయాలకీ సంబంధం కనబడదు నాకు' అని ఖచ్చితంగా చెప్తాడు. అతనికి కృష్ణశాస్త్రి ఊర్వశిలో ఆత్మ కనబడలేదు. ప్రపంచపు ఆకలి ఆర్తనాదాలు ఘోషించే కవికి ఎదుటనున్న డొక్క పీక్కుపోయిన కడుపు కనబడకపోవడం చలం దృష్టిలో గొప్ప నేరం వియోగ గీతాలు, స్మృతి గీతాలు రాసిన కవులెందరికో ఆ గీతాలకు ఆలంబనమైన వ్యక్తి కనిపిస్తే వారి కవిత్వం ఆఖరైపోతుందంటాడు చలం అంటే వారిలో నిజమైన ప్రేమ లేదన్నమాట. ఐతే ఆ రచనలన్నీ ఎందుకు పేరు పడ్డాయి? అని ప్రశ్న. 'కవిత్వం పేరిట ఏ అసందర్భమైనా మెప్పు పొందుతుంది' అని చలం సమాధానం. జీవితాన్ని ప్రతిఫలించేలా రాయడంకన్నా, జీవితాన్ని మీరి రాయగలవారు యుగపురుషు లంటాడు చలం. కాలాంతానికి కాలునితో కలియబడి కుస్తీపట్టే కవుల కళాత్మక దీక్షను చలం వాక్యం కదను తొక్కి స్తుంది. సాధారణ మానవులకు ఇది సాధ్యమయ్యే పని కాదు. ఇరుకులో మురికితో కూరుకుపోయి కూడా ఊపిరి తీసుకోడానికి వాళ్లు అలవాటుపడతారు. పరిస్థితులతో సమాధానపడతారు విపరీత మైన భావనాశక్తి, సృష్టిశక్తి కలవారు జీవితంతో సామరస్యాన్ని సాధించలేక మథనపడతారు. ఆ మథనం లోంచి రసం పుట్టుంది. 'రసం కళలోని ఆత్మ' అంటాడు చలం.

ఒకనాటి సమాజం చలాన్ని బహిష్కరించడానికి - ఆరా ధించడానికి అతను పాటించిన విలువలు కారణం. సృజనలో విలువల పాత్ర ఏమిటి? ఒక వ్యక్తి స్రష్టగా మారేముందు సమాజంలోను, కళలలోను కొన్ని విలువలుంటాయి చాలామంది ఆ విలువలను గుడ్డిగా అనుసరిస్తారు. 'గొప్ప గొప్పవాళ్లమని విర్రవీగే కవులు యింకా కృతయుగంనాటి వర్ణనల్లో మూలుగుతూ వుంటారు? అంటూ చలం విమర్శకు గురైనవారంతా తమకు ముందు స్థిరపడి చలామణీలో వున్న విలువలను అనుసరించిన వారే. నిజానికి వాళ్లు స్రష్టలు కారు. స్రష్ట ఎప్పుడూ కొత్త విలువలను సృష్టిస్తాడు. ఐతే స్థిరంగా ఏర్పడ్డ విలువలను తప్ప లోకం స్వీకరించదు ప్రతి కొత్త సృష్టిని పాత విలువలతో పోల్చి చూస్తుంది. అప్పుడు మొదలైన ఘర్షణలోంచే తిర స్కారాలు పురస్కారాలు మొదలవుతాయి. గొప్ప సృష్టికి అది కూడా హేతువే. అభ్యాసంతో, పాత విలువలతో కూడిన సృష్టి కొనసాగుతుంది. ప్రతిభతో కొత్త విలువలను రూపొందించే

సృష్టి మొదలవుతుంది. అంగీకారమయిన విలువల్ని కొన్నిటిని పునాదిగా తీసికొని తక్కింది కొత్తగా కల్పిస్తేనే ప్రజల మనసుల్లో స్థలం ఏర్పడుతుంది అందాలికి అంటాడు చలం.

చలం రెండు రకాల రచయితలను, రెండు రకాల సాహిత్యాన్ని గూర్చి చెప్పాడు. రచయితల్లో ఒక ఉద్గ్రంథానికి కదలిపోయేవాళ్లు కొందరు, గొప్పది ఏదీ వ్రాయకపోయినా సారస్వతానికి కొత్త జీవనాన్నిచ్చేవారు కొందరు ఉంటారన్నాడు. తాను ఇందులో రెండవ మార్గానికి చెందినవాడనని చలం భావన. రెండు మార్గాలలోనూ చలం ఉన్నాడని విశ్వసించేవారున్నారు. అలాగే అందమైన పటమల్లే గోడను వేళ్లాడుతో - మనసుని అందాలతో నింపే సాహిత్యం ఒకరకం, ఉరిమి చించి చెండాడి మంచికో చెడ్డకో జీవితాన్ని ఇన్‌ఫ్లూయెన్స్ చేసేది ఒకరకం అని సాహిత్యాన్ని రెండు రకాలుగా చూసేడు. మొదటిరకం బళ్లకొద్దీ పుట్టొంటే రెండోది వేళ్లమీద పుట్టుందన్నాడు. తనది ఇందులో రెండోరకం సాహిత్యమన్నాడు. కొత్త జీవాన్నిచ్చి ఒక సమాజాన్ని ఇన్‌ఫ్లూయెన్స్ చెయ్యడానికి చలం రూపొందించుకున్న కొత్త విలువలే కారణం. ఆ విలువలు నిలుపుకోడానికి కారణం ప్రేమ నిండిన అతని మనసు.

రాసే లక్షణాలన్నీ వున్నవాడు నిరంతరం రాయగలడా? నిరంతరం ఒక స్థాయిలోనే కాకపోతే పరిణతరీతిలో రాసుకుంటూ పోగలడా? ఎప్పుడు సృజన వ్యాపారం విజృంభిస్తుంది? ఎప్పుడు మందగిస్తుంది? ఎప్పుడు అంతరిస్తుంది? అనే ప్రశ్నలింకా ఉన్నాయి. చలం ఆలోచనలలో వీటికి కూడా సమాధానం దొరుకుతుంది. సమాజం పరవశించిపోయేలా ఆనంద తేజోంబునిధుల నాలపించినవారు, ఎన్నెలల సొగసంత కుమ్మరించినవారూ, వెలుగుల రవ్వలజడి కురిపించినవారూ ఆ పని నిరంతరం చేయలేకపోయారన్న సంగతి ఎవరికీ తెలియనిది కాదు. 'ఒకరి కవిత్వం చచ్చి కుళ్లు కంపు కొడుతోంది, ఇంకొకరి ఎంకి అస్థిపంజరమయింది, మూడోది దయ్యమై పలుకుతోంది' అన్నాడు చలం. ఈ ముగ్గురూ చలం దృష్టిలో ఒకప్పుడు గొప్ప స్రష్టలే. రాత ఒక వృత్తిగా పెట్టుకుని నిరంతరంగా రాస్తే మాత్రం ఏముంది, 'ఈ బల్లలోనన్నా ఏదన్నా రసం వుంది కాని అతనిలో లేదు' అంటాడు చలం కుటుంబరావు గురించి. అందుచేత నిరంతరమూ రాయడమూ కష్టమే. రసవంతంగా రాయడం అంతకన్నా కష్టమే. 'మానవతత్త్వాన్నే నిరూపిస్తే నేను ఏ నాలుగు కథలో రాయగలను. కాని కథని పైకెత్తి ఆకాశంలో ప్రవేశపెట్టారూ - ఒక్క స్వరాన్నే అనంతంగా ఆలపించగలం'- అంటాడు. ఇక్కడ వస్తువు - తత్వం ఒక్కటే ఐనా సృష్టి రూపాలు అనంతంగా రూపొందించవచ్చునన్న విషయం తెలుస్తుంది. గొప్ప రచయిత లెందరో ఈ అనంతరాగాన్ని ఆలపించారు.

సృజన శక్తి మందగించడానికి మనకి కనిపించే కారణాలు రెండున్నాయి. కనిపించనివి కూడా వుంటాయి. స్వేచ్ఛగా రాసిన దానికి చలామణీ లేకపోవడం ఒకటి. ఇంకొకళ్ల ఆజ్ఞ ప్రకారం కళని వంకర తిప్పడం ఒకటి. చలం మీద ఎందరో పబ్లిషర్లు పడ్డారు. సినిమావాళ్లు వచ్చారు. రేడియోవాళ్ల సంగతి వుంది. స్వేచ్ఛగా రాసినదానికి ప్రతిఫలం వచ్చేది కాదు. సినిమావాళ్ల కోసం రాసింది వాళ్ళకు నచ్చేది కాదు. ప్రకాశకులు - పత్రికాధిపతులు - ఆకాశవాణి - చిత్రపరిశ్రమ ఉత్తరోత్తర ప్రకర్ష గల దుర్మార్గులుగా చలం భావించేడు. వాళ్ళవల్ల ఎంతటి బాధ అనుభవించాడో? అనిపిస్తుంది. చలంలాంటి స్వేచ్ఛాజీవులు సైతం కళని ధనానికి దాస్యం చేయించే బానిసత్వానికి పాల్పడవలసిన సమాజం మనది. ఇది సృజనశక్తిని మందగింపజెయ్యడమే కాదు. ఆ బానిసత్వం క్రమంగా రచయిత ఆత్మలోకి పాకి, ఆ జీనియస్‌నీ, స్వేచ్ఛనీ, ధైర్యాన్ని చంపేస్తుందంటాడు చలం. తన కళకి ప్రజాదృష్టి పడితే రచయిత తాను కలలు కనే అందాన్ని అందుకోలేడంటాడు. అటువంటి సందర్భంలో రాసిన రాతలు సహజంగా వుండవు. చలం రచనలు కొందరితో పోలిస్తే ఎక్కువే. కాని కావలసినప్పుడల్లా రాయలేకపోవడం అతనికి వుంది. 'తలని ఎంత పిండినా, పీకినా ఏ కథా రావడం లేదు' 'ఇంక ఏమీ రాయలేనేమో!' అంటూ మధనపడిన సందర్భాలెన్నో వున్నాయి. కోయిలకీ కాలమూ స్వరమూ స్థలమూ ఇచ్చి పాడమంటే ఎలా? అని ప్రశ్నిస్తాడు చలం.

సృజనాత్మక కళాకారుడికి బాధే సౌఖ్యం. బాధగా వుంటే బతుకుతున్నామని అర్థం అంటాడు చలం. అదృష్టం రచయితని శవాన్ని చేస్తుందట. మన తెలుగు కవులే బాధల్లో వుండి రాసిన

దానికి అదృష్టం పట్టిన తర్వాత రాసినదానికి గల తేడాను గ్రహిస్తే చలం అన్న మాటల్లోని సత్యం తెలుస్తుంది. సృజన అంతరించే మరొక మార్గం ప్రజాదరణ. ప్రజాదరణ పొందటం కన్న మృత్యువు లేనేలేదు కవికి అని చలం నిశ్చలంగా చెప్తాడు. గొప్ప గొప్ప రచయితలు సాహిత్యరంగం నుండి సజీవంగా అంతర్హితులవడానికి ఇది కూడా కారణమే. చాలామంది ఆర్టిస్టులు ఈ లోకపు రొదలో తమ శక్తిని నశింపజేసుకుని ఆరిపోతారు త్వరలో అన్నాడు. ఈ రొద ఎలాంటిది? పురస్కారమా? తిరస్కారమా? రెండూ కావచ్చును. ఆదరణ లభించినప్పుడు తమాయించుకునే నిబ్బరం, పోరాటానికి కావలసిన ఓపిక లేనప్పుడు రచయితలు అలసిపోతారు.

సృజనశక్తి అంతరించడానికి ఇంకొక గొప్ప కారణం చెప్పాడు చలం. ఈ సందర్భంలో రచయితలు మూడు రకాలుగా కనిపిస్తారు. ఆవేశపు పొంగులో అందినదాన్ని అందినట్లుగా రాసేవాళ్లొకరు. వీళ్లెందరో వుంటారు. అందినదాన్ని అనుభవించి రసాత్మకంగా పలికేవాళ్ళు ఇంకొకళ్ళు. వీళ్ళని గొప్ప రచయిత లంటాం మనం. ఇక్కడ రసాత్మకంగానైనా కవి ఎందుకు తన అనుభవాన్ని బయటకు వెళ్ళగక్కుతున్నాడు? అనే ప్రశ్న వేసుకున్నాడు చలం. 'ఆ అనుభవపు ఆందాన్ని భరించుకునే లోతులు అతనిలో లేకపోబట్టి' అనే సమాధానం లభించింది. అప్పుడు మూడో రకం కవులు అతని దృష్టిలో మెదిలేరు. 'లోకపు అందాన్నంతా తాగి తనది చేసుకుని లోపలే నిలుపుకోగల లోతులు' ఆ మూడోరకం కవులలో వుంటాయి. అందువల్లనే 'ఎదిగే ప్రతి ఆర్టిస్టూ మౌని అవుతాడు' అంటాడు చలం. సౌందర్యాన్ని స్వాయత్తం చేసుకోవడంతో ఆరంభమై, సౌందర్యానికి వశుదయ్యేదాకా పరిణతి చెంది ఆంధ్రదేశం నుండి అరుణాచలం దాకా విస్తరించిన ఒక తేజంలోని రహస్యం కవిత్వదృష్టికీ ఆధ్యాత్మిక దృష్టికీ గల సాన్నిహిత్యమే అని ఋజువు చేశాడు చలం.

---

# వైఫల్యం

**శ్రీ కలువకొలను సదానంద**

నా పూర్వీకు లెవరో
ఎప్పుడో వేసిన ఈ బాట
ఇప్పుడు గతుకుల మేట.
కాళ్ళకు కొట్టుకుంటున్న
రాళ్ళు రప్పలే దీన్నిండా!
వగర్చుతూ బిరబిరా
ముందుకు సాగిపోయేవాళ్ళేగానీ
ఆగి, అడ్డొచ్చిన రాళ్ళను ఏరి
గిరాటేద్దా మనుకునేవాళ్ళే లేరు.
చేతులు కలిపి ఆ పని
చేద్దాం రమ్మని పిలిస్తే
ఒక్కడూ తోడు రాడు.
ఒంటరిగానే బాటను బాగుచేద్దామని
ఒక్కక్షణం ఆగాను;
హోరున సాగే జనస్రవంతి
అమానుష పద తాడనంతో
క్షతగాత్రుణ్ణై చతికిలబడ్డాను!
అప్పుడే చూశానక్కడ,
నాకంటే ముందు నడిచి వెళ్ళిన
సంస్కర్తల అస్థికలను!

'కన్నడ మూలం :
కీ. శే. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

తెలుగు అనువాదం :
శ్రీ శంకరగంటి రంగాచార్యులు

# వాల్మీకి గేయ పరిస్పందము

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥

పూజ్యుడును, కవికోకిలయును అయిన వాల్మీకి తన కృతి యైన శ్రీమద్రామాయణము 'పాఠ్యే గేయేచ మధురం' (1-4-8) అని నిర్దేశించినాడు. అందులో పఠించుట యందలి మాధుర్యము నీ విధముగా వర్ణించినాడు:

ఉదార వృత్తార్థపదైః మనోహరైః
స తస్య రామస్య చకార కీర్తిమాన్।
సమాక్షరైః శ్లోక శతైః యశస్వినః
యశస్కరం కావ్య ముదారధీః మునిః॥

తదుపగత సమాస సంధియోగం
సమ మధురోపనతార్థ వాక్యబద్ధం।
రఘువర చరితం— (1-2-42, 43)

(ఉదార బుద్ధి గలవాడును, కీర్తిశాలియు అయిన ఆ ముని-వాల్మీకి-యశశ్శాలియైన ఆ రాముని చరితమును శ్రేష్ఠమైన వృత్త, అర్థ పదములు గల, మనోహరమైన, సమానమైన అక్షరములు గల వందలకొలది శ్లోకములతో యశస్కరమయిన కావ్యముగా రచించెను.

ఆ కావ్యము శాస్త్రానుగుణమైన సమాస, సంధి, పద వృత్తములు గలది; సమమైన, మధురమైన అక్షరములు గల, అర్థసహితములగు మాటలు గలది - శ్రీరామ చరితము.

ఆ కావ్యము యొక్క పద, వాక్య, వృత్త, అర్థములకు సంబంధించిన గుణములు ఎంత మధురముగా నుండునన్న విషయము ఆబాలవృద్ధము ఇంతవరకును అనుభవించుచున్నదియే. రసభావముల మాధుర్యము మాత్రము ఆయా కావ్యములను చదివిన సంస్కారపు పరిపాకమున కనుగుణముగా ఆయా సహృదయులు అధికాధికముగా చవిచూతురన్న విషయము అందర కును విదితమైనదియే.

మహాకవి రాజశేఖరుడు కావ్య సౌందర్యమును అనుభవించుటకు; అనుభవించునట్లు చేయుటకు, పాఠ్యశిల్పమే ప్రధాన సాధనమని అభిప్రాయపడినాడు:

కరోతి కావ్యం కావ్యేన సంస్కృతాత్మా యథా తథా।
పఠితుం యః పరంవేత్తి తస్య సిద్ధా సరస్వతీ॥

(కావ్యమీమాంస - 7)

(కావ్యమును చదివి ఆత్మ సంస్కారమును పొందినవాడు ఏదో విధముగ కావ్యము రచించును. కాని ఎవడు చక్కగా పఠింపగలుగునో, అతనికే సరస్వతి సిద్ధించును.)

ఇంతేకాదు - 'గేయగర్భే స్థితః పాఠే సర్వోపి ద్రవిడః కవిః' (కావ్యమీమాంస-7)

(తమిళ కవులందరును పఠనమును గానగర్భమున పెట్టుదురు) అని చెప్పి, తమిళులు చదువుటలోని గేయ గుణమును గేలి చేసినట్లు కనబడును. ఇతరులు కొందరు కూడ ఈ విధము గనే భావించవచ్చునేమో! వాల్మీకి మాత్రము రచయితకును, పఠితకును పాడుటయందు అభినివేశమును బోధించుననుట సుస్పష్టమే.

అది యుక్తమే. వేదసూక్తము నుండి ప్రారంభించి, గద్య పద్య రూపమైన సమస్త భారతీయ సాహిత్యమును సృష్ట్యాది నుండి నేటివరకును స్వర సన్నియోగముచేతనే పాడబడుచున్నదన్న విషయము సంప్రదాయము తెలిసినవారికి క్రొత్త కాదు. గేయ గుణములు కూడ పాఠ్యగుణముల వలెనే యథోచితముగ అభ్యాసమునకు తగినట్లు, సందర్భము ననుసరించి నిర్వహింపబడుచున్నవి. ఆంగ్లేయుల సంప్రదాయమున పెరిగిన నేటివారు కొందరు చదువుటయందు పాడుటను పూర్తిగా తిరస్కరింతురనుట వేరుమాట.

వాల్మీకి అసాధారణ ప్రతిభకు కావ్యరచన యందును, గాన రచన యందును ఆనందానుభవము ఒకే విధమైనది. రెండిటిని

పరస్పరోపకారముగా, సమానముగా అది నిర్వహించినది అని చెప్పవచ్చును. వ్యాధుడు చంపిన పక్షిని తిలకించి అతనికి కలిగిన మహాశోకము శాప రూపమును ధరించి, శ్లోకమై మాత్రమే కాక, గానమై కూడ నోటినుండి బయటికి వచ్చినది. ఆ శాపశ్లోకము:

మానిషాద ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీః సమాః।
యత్ క్రౌంచ మిథునాదేకమవధీః కామ మోహితం॥ (1-2-15)

'పాదబద్ధః- అక్షరసమః- తంత్రీలయ సమన్వితః' (1-2-18) (పాద పాదములై, సమానములగు అక్షరములు గలది; తంత్రీలయముతో కూడినది) అని శిష్యుడగు భరద్వాజునికి కవి స్వయముగా వివరించును. చతుర్ముఖ బ్రహ్మ అరుదెంచిన వేళ కూడ అతనివద్ద మౌనము వహించి అదే శ్లోకమును మనస్సున కవి పాడుకొనుచునుండెను. వాల్మీకి శిష్యు లందరును దానినట్లే గ్రహించిరి; పాడిరి కూడ. సమమైన అక్షరసంఖ్య గల నాలుగు పాదములచేత నిబద్ధమై, సహజముగనే శ్లోక రూపమున ఆ శాపము వెలికి వచ్చుట మన కాశ్చర్యము కాదటి! దానిని పాడిన మాత్ర మేమి తప్పు? కాని ఆ పాటకు 'తంత్రీలయ సమన్వితః' అను విశేషణము కొంత మన గొంతులో పట్టుకొనును. వాల్మీకి శాప కాలము నందును వీణ తీగలను మీటుచుండెనని మన మూహించ వలెను కదా! అతడప్పుడు తమసా తీర్థమున స్నాన మొనరించి వెనుదిరిగి వచ్చుచుండెను కదా? ఇచట వ్యాఖ్యానము చేసిన గోవిందరాజులు 'తీగలు కలిగిన వాద్యముతో పాటు పాడుటకు వీలైనది' అని వివరించి మనలను కొంత సమాధానపరచును. అంతేకాక ఇచ్చట ఇంకేమి చెప్పనగును!

ఇట్లు రచింపబడిన కావ్యమును వాల్మీకి ఆనతి మేరకు అతని శిష్యులును, గాయకులును అయిన కుశలవులు శ్రీరాముని ముందు సభలో పాడిరి. వారి ఆ గానము 'మార్గవిధాన సంపత్తి'తో నడచినది. సంగీత లాక్షణికులు ఆ కళను మార్గ, దేశి యను రెండు పద్ధతులుగా విభజించి, ఇట్లు వివరింతురు:

తత్ర మార్గః స ఉచ్యతే,
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః।
దేవస్య పురతః శంభోః నియతాభ్యుదయప్రదః॥
దేశే దేశే జనానాం యత్ రుచ్యా హృదయ రంజకం।
గీతం చ వాదనం నృత్యం తద్దేశీత్యభి దీయతే॥

(సంగీత రత్నాకరము 1-1-22; 24)

(మార్గి అనునది చతుర్ముఖ బ్రహ్మ మొదలగువారిచే గవేషించి, గ్రహింపబడినది. భరతముని ప్రభృతులు పరమేశ్వరుని యెదుట ప్రయోగించినది. నియతముగా అభ్యుదయమును ప్రసాదించునట్టిది. మరి ఆయా దేశములందు జనుల అభిరుచి కనుగుణముగా, హృదయరంజకముగా ప్రయోగించు గీతవాద్య నృత్యములు మూడును దేశి అనబడును) అని.

దేశి యన్న ఇష్టము వచ్చినట్లు నడిపించునది - "దేశిత్వం నామ కామచార వర్తిత్వం" అని ఒకమాటతో దేశి లక్షణమును చెప్పి ముగించును రత్నాకర వ్యాఖ్యాత, కల్లినాథుడు.

కాలక్రమమున స్వాభావికముగ నూతన ప్రియులైన జనుల అనాదరణ వల్ల మార్గపద్ధతి మరుగున పడును. దాని స్థానమునకు దేశి వచ్చి మార్గియై నూతన దేశి పుట్టుటకు కారణమగును. ఆ దేశియును అట్లే. ఇట్లు ఈ వివర్తక్రమము అవిచ్ఛిన్నముగా నడచును. లోక వ్యవహారము నుండి తొలగి లక్ష్యములు మరుగున పడి, పిదప కొన్ని లక్షణ గ్రంథములు మాత్రము శుష్క వృక్షముల వలె పరిశేష బహుమానమును పడయును. ఆయా కాలపు దేశి సంప్రదాయమునకు నూతన లక్షణము లప్పుడప్పు డుప్పతిల్లును. క్రీ. శ. పదుమూడవ శతాబ్దమున శార్ఙ్గదేవుడు మార్గ సంగీతమునకు విస్తారమగు లక్షణములు చెప్పుచు 'సంగీత రత్నాకరము' అను ఒక గ్రంథమును రచించెను. ఆ గ్రంథమును పదునారవ శతాబ్దమున గోవింద దీక్షితులు తన 'సంగీత సుధ' యను గ్రంథమున-

....లక్ష్మ విరోధి లక్ష్యం
అబోధ కాత్యల్ప తర ప్రయోగాం,
అబోధి తాస్పష్ట పదార్థ బోధాం,
త్యక్తా మతో గాయక వైణికాద్యైః॥

(2 - 407, 8)

(దీనిలోని లక్ష్యము లక్షణమునకు విరుద్ధముగ నున్నది. ఇచ్చిన ప్రయోగములు మిక్కిలి స్వల్పములు. అవియును అర్థము కావు. పదార్థముల భేదము అర్థము కాదు; తెలియదు. అందు వలన గాయకులు, వైణికులు దానిని త్యజించినారు.)

అని తిరస్కరించినాడు. ఇప్పుడు గోవింద దీక్షితుల గ్రంథమునైతము అట్లే నిరాకరింపబడవలసి యున్నది, నిరాకరింపబడియును ఉన్నది అనుటలో సందేహము లేదు. ఆయా కాలపు ఇతర లక్షణ గ్రంథములు కూడ ఇట్లే అయినవి.

చదవదగిన గ్రంథమునకు లిపి యుండును. అందుచేత లిపి తెలిసిన అందరును దానిని చదువగలరు, నిజము పఠనక్రమ

స్థూల రూపమునే లిపి ఎఱుకపరచును. కాకుస్వర ప్రభృతి అనేక పాఠ రహస్యములు తెలుపనేరదు. చదువు వచ్చిన వారందరును చక్కగా చదువనేరరు కదా! చదువుట, చదువువాని సంస్కార సంపద కనుసారముగా రసభావార్థములను హెచ్చు తక్కువలుగా ప్రకటించును. గేయమున కైనచో బహుకాలము భారతదేశమున లిపియే ఉండలేదు. కేవలము గురువు పాడినట్లే పాడి శిష్యులు పాటలను గ్రహించుచుండిరి. ప్రాయికముగా నూరేండ్ల క్రిందట పాటలకు లిపి యని ఒకటి ఏర్పడినది. అది కూడ పాఠ్య లిపి వగిదిగనే గేయపు స్థూలమైన ఆకారమును మాత్రము ప్రదర్శించును.

అందువలన శ్రీమద్రామాయణ పఠనమునకు వాల్మీకి నిర్దేశించిన మార్గ విధాన సంపద అన్వేషించిన కూడ అగపడనట్లు నష్టమైనదని నిశ్చయించవలసి యున్నది. అథవా, వాల్మీకి వరకును పోవనేల? నిన్న మొన్నటివారైన జయదేవాది వాగ్గేయకారులు రచించిన గీతగోవిందము మొదలగు వానియందును కవులు నిర్మించిన పాటల రూపము ఇపుడు మనకు లభ్యము కానే కాదు.

రామాయణ కావ్యపు గేయమును వాల్మీకి మూడు విధములుగా వర్ణించును :

ప్రమాణైః త్రిభిః అన్వితం (మూడు ప్రమాణములు కలది).
జాతిభిః సప్తభిః బద్ధం (ఏడు జాతులచేత కూర్చబడినది)
తంత్రీలయ సమన్వితం (తంతి యొక్క లయతో కూడినది) అని.

(1 - 4 - 8)

అందులో ఆ ప్రమాణము లేవి? 'త్ర్యస్య, చతురస్ర, మిశ్రములు - అన్నవి' అని గోవిందరాజులు టీక. త్ర్యస్ర ప్రభృతి గుణములు లయను సూచించును. మూడు మాత్రలు గలది త్ర్యస్రము; నాలుగు మాత్రలు గలది చతురస్రము; ఈ రెంటిని కలిపిన యేడు మాత్రలది మిశ్రము; ఐదు మాత్రలది ఖండము; తొమ్మిది మాత్రలది సంకీర్ణము - అని ప్రమాణములు ఎక్కువగా లక్ష్య లక్షణములందు కనిపించును. వానిలో మూడు ప్రమాణముల విషయమున అనుగ్రహము కానీ, మిగిలిన రెండిటి ఎడ్ల అనాదరముగానీ వాల్మీకి కెందుకు? చతురస్రము, ఖండము - ఈ రెంటి మిశ్రణమే అనియును, విశేషము లేనిదనియును, సంకీర్ణ ప్రమాణమును ఉదాసీనము చేయనిండు. సర్వలోక ప్రియమైన, విశిష్ట స్వరూపమున్న ఖండ ప్రమాణమును త్యజించుటకు కారణమేమి? అందుకనియే తోచును గోవిందరాజులు 'ద్రుతమధ్య విలంబితము లైనను కావచ్చును' అని పైకల్పికమైన అర్థము నచట చూపినాడు. ఇరువది నాలుగువేల ఈ రామాయణ సంహితలో, ఏయే శ్లోకములలో, ఎక్కడెక్కడ, ఎట్లెట్లు ఆ మూడు ప్రమాణములను వాల్మీకి ఇమిడ్చినాడు? - అని ప్రశ్నించిన ఉత్తరమేమి?

ఇట్లే ఏడు జాతులచే కూర్చబడినది అనునపుడును ఆ ఏడు జాతులు ఏవేవి? భరతముని నాట్యశాస్త్రపు 28వ అధ్యాయమున జాతుల వివరణ మున్నది. అయినను అచ్చటి పాఠము కడు కలుషితమై నావంటివానికి విషయము స్పష్టముగా తెలియుట లేదు. రాగభేదమునకు మూలమైన షడ్జ - ఇత్యాది స్వరభేదములను క్రమముగా ఆరోహణమున, అవరోహణమున ఉంచినదే జాతి అని కొందరి అభిప్రాయము. ఆ జాతులు షాడ్జి, ఆర్షభి - ఇత్యాదులైన ఏడు స్వరముల వలన ఏడు విధములుగా నగును - అందురు లాక్షణికులు. వానిలో శుద్ధజాతు లేడు; వికృత జాతులు - పదుకొండు; మొత్తము పదునెనిమిది జాతులని నిర్ణయము. జాతియే ఇపుడు మేళమను వ్యవహారమున నున్నది. రామాయణము నందెచ్చట కూడ రాగమను సంకేత శబ్దము కానరాదు. జాతులే రాగములకు మూలములని గ్రహించినచో, అపుడు ఏ జాతికి ఏ శ్లోకములో ఎటువంటి విన్యాసముతో ప్రయోగము నడచినది? ఈ ప్రశ్నకు సమాధానము దొరకదు.

'తంత్రీలయ సమన్వితం' అన్నది రామాయణపు గేయపు మరియొక లక్షణము. తంత్రీ శబ్దమునకు తంతులతో కూడిన వీణ యని తాత్పర్యము. లయ శబ్దము తాళవేణు మృదంగాదులు ఒకే కాలమున ముగియుటను తెలుపును. ఈ రెండిటితో కూడినది." అని గోవిందరాజుల వివరణ. ఆ వీణ ఎటువంటిది? ఆధార శ్రుతిని మాత్రము చూపునట్టి తంబూరియా? లేక పాడెడు అన్ని శబ్దములను అనువదించు విపంచియా? పాడునట్టి సమయము అంతంతయు కుశలవుల వెనుక తాళము వేయువాడును, వీణ వాయించువాడును, మృదంగము మ్రోగించువాడును పోవుచుండిరని భావించవలయునా? అంతియే కాదు; తపోవనమున పాఠము నేర్చుకొనిన కుశలవులకు పై వాద్యగాండ్రతో సహపాఠిత్వ మెప్పుడు? అది లేకున్నచో, ఆ మూడు వాద్యక్రియల ఏకకాలపు ముక్తాయింపు ఎట్లు నిర్వహించుట? ఇక లయ అన్న మాటకు సామ్యమని మాత్రమే అర్థమయినచో, అపుడు దేనికి దేనితో సామ్యము? అక్షర సంఖ్యా సామ్యము కావ్యపు శ్లోక పాదములలో కలదనుట నిజము. కాని పాడుటలో అది పనికిరాదు. ఎందుకనగా, లఘు

గురువులన్న విభాగము గల అక్షర ప్రమాణము వేరు వేరుగ నుండును. పాటలో లయానుభవమునకు సాధకమయినది మాత్రా సంఖ్యాసామ్యమే కదా? చూడుడు. అనుష్టుప్ శ్లోకమున ఒక దానిలో పదుకొండు, మరొకదానిలో పన్నెండు, ఇట్లు పదునైదు వరకు మాత్రలు పాదములో వేరు వేరుగా నుండును. ఇతర వృత్తములందును ఇట్లే. అచట సామ్య నిర్వహణ మెట్లు? గురు లఘ్వక్షరములను కుదించి, పెంచి మాత్రా సామ్యమును సాధించ వలెను. అయిన అది పాఠ్యమునకు హింస కలిగించును. కుశ లవుల కావ్యగానము విన్న మునులు: "అహో గీతస్య మాధుర్యం, శ్లోకానాంతు విశేషతః" (1-4-17) అని కదా పఠనము దగు మాధుర్యమును పొగడిరి? అందువలన తంత్రీలయ సమన్వితం అనుచోట తంత్రీ నాదముతో శారీరపు నాదమును లయించుట సామ్యమని వివరించిన అర్థము అగును.

ఇంకొకచోట కుశలవుల పాడుట 'సమతాళలయాన్వితం' (7-21-15) 'తాళలయోప పన్నం' అనియును వర్ణింపబడినది. లయబద్ధములైన చతురశ్రేత్యాది గణములను ప్రతి ఆవృత్తిలోను సమసంఖ్యతో కూర్చుట, సశబ్ద, నిశ్శబ్ద క్రియలతో అది స్ఫురించునట్లు చేయుట తాళమనిపించుకొనును. అది అనేక విధ ములు. రామాయణమున ఎన్ని, ఏ ఏ తాళములు, ఎచ్చట కూర్చ బడినవి అనుటకు స్వల్పమును సూచన లేదు.

కాని ఇంతమాత్రము నిశ్చయముగ ప్రచురమైనది. పూజ్యు డగు వాల్మీకికి చిదచిదాత్మకమగు విశ్వమే సంగీతమయము. శ్రీరాముని అవతార సమయమున 'జగుః కలంచ గంధర్వాః, ననృతుః చ అప్సరో గణాః' (1-18-15) (గంధర్వులు మధుర ముగా పాడిరి; అప్సరలు గుంపులు గూడి నృత్యము చేసిరి.) అని చెప్పబడినది. అదేమియును ఆశ్చర్యము కాదు; ఎందుకన, గంధర్వులును, అప్సరసలును ఇటులే కార్యమును చేయు అభ్యాస మున్నవారు కారు! కాని అయోధ్యలో-

రథ్యాశ్చ జనసంబాధాః, నట నర్తక సంకులాః।
గాయనైశ్చ విరావిణ్యో, వాదనైశ్చ తథా పరైః॥

(1-18-17)

(వీధులు జనులతో నిండినవి; అందులో నటులు పలువు రుండిరి. పాడుచున్న, వాయించుచున్న వందిమాగధుల చప్పుడు లతో మ్రోగుచుండినవి.)

ఇతర సమయములందును ఆ పట్టణము, 'దుందుభీభిః మృదంగైశ్చ, వీణాభిః పణవైస్తదా, నాదితాభృశం' (1-5-18) (దుందుభుల చేతను, మర్దళముల చేతను, వీణలచేతను, పణవముల చేతను, నాదపూర్ణమై యుండినది.) శ్రీరామచంద్రుడు 'సమ్య గ్విద్యావ్రతస్నాతః' (2-2-34) (విద్యల నన్నిటిని చక్కగా అభ్యసించి, అభిషేకము పొందినవాడు) అంతియేకాదు— 'గాంధర్వేచ భువిశ్రేష్ఠః' (2-2-35) (భూలోకమున సంగీత విద్య యందు శ్రేష్ఠుడైనవాడు.) కపి రాజ్యమైన కిష్కింధ యందును ఎప్పుడును 'గీత వాదిత్ర నిర్ఘోషః మృదంగాడంబరైః సహ' (పాడుట, వాద్యములు మ్రోగించుట, మద్దెల నగారాల చప్పుడు) వినవచ్చుచుండెను. లక్ష్మణుడు మిగుల క్రుద్ధుడై సుగ్రీవుని దండించుటకై అతని అంతఃపురమును-

ప్రవిశన్నేవ సతతం శుశ్రావ మధుర స్వరం।
తంత్రీగీత సమాకీర్ణం సమగీత (తాళ) పదాక్షరం॥

(4-33-21)

(ప్రవేశించినంతనే అచట మధుర స్వరముతో కూడిన వీణ, పాడుట - వీనితో కూడిన సమమైన పాటయొక్క పదములు, అక్షరములు ఉన్న గానము వినెను.)

సీతను వెదకుచు రాత్రి లంకలో ప్రతి గృహమును ప్రవే శించి చూచిన అంజనేయుడు,

శుశ్రావ మధురం గీతం త్రిస్థాన స్వరభూషితం।
స్త్రీణాం మదసమృద్ధానాం దివిచాప్సరసామివ॥ (5-4-10)

(స్వర్గములోని అప్సరసలవలె మత్తుగొనియున్న మహిళలు మూడు స్థానములందును స్వరముల నలంకరించి మధురముగా పాడుచుండుట వినెను)

రావణుని అంతఃపురమున రాత్రి మద్యమును సేవించి, బడలిక చెంది, తూగిడించుచున్న రాక్షస స్త్రీల ఈ క్రింది చిత్ర ములు హనుమ కనుల బడెను:

అంగహారైః తథైవాన్యా కోమలైః నృత్తశాలినీ।
విన్యస్త శుభసర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ॥ (5-10-36)

(నర్తనము చేయుచున్న ఒక అంగన కోమలములైన అంగ విక్షేపములతో అట్లే అందమయిన తన తనువును పానుపు మీద పడవేసి పరుండియుండెను.)

కాచిద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే।
మహానదీ ప్రకీర్ణేవ నలినీ పోతమాశ్రితా॥ (5-10-37)

(ఒకతె పెద్ద నదిలో వ్యాపించిన తామరతీగ పడవను చేరి యున్నట్లు వీణను కౌగిలించుకొని, నిద్రించుచు కనిపించినది.)

అన్యా కక్షగతేనైవ మడ్డుకేనా సితేక్షణా।
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా॥ (5-10-38)

(మరియొక నల్లకనుల నాతి చంకలో మడ్డుకమును కఱచుకొని, వాత్సల్యమున పసిబిడ్డ నెత్తుకొన్న తల్లివలె నిదురలో ప్రకాశించుచుండెను.)

పటహం చారుసర్వాంగీ పీడ్య శేతే శుభస్తనీ।
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ॥ (5-10-39)

(సర్వాంగములందును సౌందర్యము పొంగుచున్న శుభస్తనియైన భామిని బహుకాలానంతరము లభించిన ప్రియవల్లభుని ఆలింగనమున పట్టునట్లు పటహమును హృదయమునకు హత్తుకొని పండుకొని యుండెను.)

కాచిద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా।
రహః ప్రియతమం గృహ్య సకామేవ చ కామినీ॥
(5 - 10 - 40)

(కమలముల వంటి కన్నులు కల కామిని మరియొకతె కామమున ప్రియతముని ఏకాంతమున బిగి కౌగిలింతలో పట్టుకొన్నట్లు మురళిని కౌగిలించుకొని నిదురించుచుండెను.)

విపంచీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ।
నిద్రావశమనుప్రాప్తా సహకాంతేవ భామినీ॥ (5-10-41)

(నియతముగ నర్తనము చేయు నింకొకతుక విపంచి-ఏడు తీగల వీణ-ను తీసికొని కాంతునితో పండుకొన్నట్లు నిదురలో మునిగినది.)

అన్యా కనకసంకాశైః మృదు పీనైః మనోరమైః।
మృదంగం పరిపీడ్యాంగైః ప్రసుప్తా మత్తలోచనా॥
(5-10-42)

(మత్తుగొన్న కన్నులున్న మరియొకర్తుక పసిడిరంగు గలిగి మృదువై బలిసియున్న మనోహరములైన అవయవములతో మృదంగమును హత్తుకొని నిదురించుచుండెను.)

భుజపార్శ్వాంతరస్థేన కక్షగేన కృశోదరీ।
పణవేన సహానింద్యా సుప్తా మదకృతశ్రమా॥
(5 - 10 - 43)

(పలుచని నడుము గల పడతి యొకతె మత్తుతో బడలిపోయి, భుజపార్శ్వముల నడుమ చంకనున్న పణవ వాద్యముతో కూడ పండుకొన్నది.)

డిండిమం పరిగృహ్యాన్యా తథైవాసక్త డిండిమా।
ప్రసుప్తా తరుణం వత్సం ఉపగుహ్యేవ భామినీ॥
(5 - 10 - 44)

(ఇంకొక ఇంతి రెండు పుక్కిల యందును రెండు డిండిమ వాద్యములను పెట్టుకొని, ప్రాయపు భర్తను, శిశువును కవుగిలించుకొన్నట్లు పండుకొన్నది.)

కాచిదాడంబరం నారీ భుజసంయోగ పీడితం।
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా॥
(5 - 10 - 45)

(మరియొక తామరరేకుల వంటి కనులు గల తరుణి, మత్తుతో మతి చెడినది, ఆడంబర వాద్యమును రెండు చేతులతోను బిగువుగా పట్టుకొని పండుకొనియున్నది.)

కలశీమపవిధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ।
వసంతే పుష్పశబలా మాలేవ పరిమార్జితా॥ (5-10-46)

(మరొకతుక ఘటవాద్యమును త్రోసివేసి నిద్రించుచున్నది-వసంత కాలమున రంగు రంగుల పూలతో కూర్చిన కడిగిన మాల మాదిరిగా)

ఇట్లు వేరు వేరు

ఆతోద్యాని విచిత్రాని పరిష్వజ్యావరాః స్త్రియః।
నిపీడ్యచ కుచైః సుప్తా కామిన్యః కాముకా నివ॥
(5-10-49)

(విచిత్ర వాద్యముల నాలింగనము చేసికొని, స్తనములతో హత్తుకొని, ఇతర కామినులు కాముకులను కౌగిలించుకున్నట్లు పరుండియున్నారు.)

ఇటువంటి సంగీత సామ్రాజ్యమును పరిపాలించుచున్న రావణుడు సీతకు ఆశ చూపుటకు - 'గీతం నృత్తంచ వాద్యంచ లభ మాం ప్రాప్య మైథిలి' (5-10-10) (సీతా! నన్ను పొందిన నీకు గీత నృత్త వాద్యముల ఆనందము లభించును) అని సగర్వముగా ప్రతిజ్ఞ చేయునన్నచో అందులో ఆశ్చర్యమేమి? ఎక్కువెందుకు? వాల్మీకి భావనలో పంపా సరస్సు తీరమున-

మత్తకోకిల సన్నాదైః నర్తయన్నివ పాదపాన్।
శైలకందర నిష్క్రాంతః ప్రగీత ఇవచానిలః॥ (4-1-15)

(మదించిన కోయిలల తీయని గొంతుకలతో కొండ గుహల నుండి వెడలిన గాలి, చెట్లను నర్తనము చేయించుచు, పాడుచున్నట్లు తోచును.)

గురువులన్న విభాగము గల అక్షర ప్రమాణము వేరు వేరుగ నుండును. పాటలో లయానుభవమునకు సాధకమయినది మాత్రా సంఖ్యాసామ్యమే కదా? చూడుడు. అనుష్టుప్ శ్లోకమున ఒక దానిలో పదునాల్గు, మరొకదానిలో పన్నెండు, ఇట్లు పదునైదు వరకు మాత్రలు పాదములో వేరు వేరుగా నుండును. ఇతర వృత్తములందును ఇట్లే. అచట సామ్య నిర్వహణ మెట్లు? గురు లఘ్వక్షరములను కుదించి, పెంచి మాత్రా సామ్యమును సాధించ వలెను. అయిన అది పాఠ్యమునకు హింస కలిగించును. కుశ లవుల కావ్యగానము విన్న మునులు: "అహో గీతస్య మాధుర్యం, శ్లోకానాంచ విశేషతః" (1-4-17) అని కదా పఠనము దగు మాధుర్యమును పొగడిరి? అందువలన తంత్రీలయ సమన్వితం అనుచోట తంత్రీ నాదముతో శారీరపు నాదమును లయించుట సామ్యమని వివరించిన అర్థము అగును.

ఇంకొకచోట కుశలవుల పాడుట 'సమతాళలయాన్వితం' (7-21-15) 'తాళలయోపపన్నం' అనియును వర్ణింపబడినది. లయబద్ధములైన చతురస్రత్ర్యాది గణములను ప్రతి ఆవృత్తిలోను సమసంఖ్యతో కూర్చుట, సశబ్ద, నిశ్శబ్ద క్రియలతో అది స్ఫురించునట్లు చేయుట తాళమనిపించుకొనును. అది అనేక విధ ములు. రామాయణమున ఎన్ని, ఏ ఏ తాళములు, ఎచ్చట కూర్చ బడినవి అనుటకు స్వల్పమును సూచన లేదు.

కాని ఇంతమాత్రము నిశ్చయముగ ప్రచురమైనది. పూజ్యు డగు వాల్మీకికి చిదచిదాత్మకమగు విశ్వమే సంగీతమయము. శ్రీరాముని అవతార సమయమున 'జగుః కలంచ గంధర్వాః, ననృతుశ్చ అప్సరో గణాః' (1-18-15) (గంధర్వులు మధుర ముగా పాడిరి; అప్సరలు గుంపులు గూడి నృత్యము చేసిరి.) అని చెప్పబడినది. అదేమియును ఆశ్చర్యము కాదు; ఎందుకన, గంధర్వులును, అప్సరసలును ఇటువంటి కార్యమును చేయు అభ్యాస మున్నవారు కారు! కాని అయోధ్యలో-

రథ్యాశ్చ జనసంబాధాః, నట నర్తక సంకులాః।
గాయనైశ్చ విరావిణ్యో, వాదనైశ్చ తథా పరైః॥
(1-18-17)

(వీధులు జనులతో నిండినవి; అందులో నటులు పలువు రుండిరి. పాడుచున్న, వాయించుచున్న వందిమాగధుల చప్పుడు లతో మ్రోగుచుండినవి.)

ఇతర సమయములందును ఆ పట్టణము, 'దుందుభిభిః మృదంగైశ్చ, వీణాభిః పణవైస్తదా, నాదితాభృశం' (1-5-18) (దుందుభుల చేతను, మర్దళముల చేతను, వీణలచేతను, పణవముల చేతను, నాదపూర్ణమై యుండినది.) శ్రీరామచంద్రుడు 'సమ్య గ్విద్యావ్రతస్నాతః' (2-2-34) (విద్యల నన్నిటిని చక్కగా అభ్యసించి, అభిషేకము పొందినవాడు) అంతియేకాదు— 'గాంధర్వేచ భువిశ్రేష్ఠః' (2-2-35) (భూలోకమున సంగీత విద్య యందు శ్రేష్ఠుడైనవాడు.) కపి రాజ్యమైన కిష్కింధ యందును ఎప్పుడును 'గీత వాదిత్ర నిర్ఘోషః మృదంగాడంబరైః సహ' (పాడుట, వాద్యములు మ్రోగించుట, మద్దెల నగారాల చప్పుడు) వినవచ్చుచుండెను. లక్ష్మణుడు మిగుల క్రుద్ధుడై సుగ్రీవుని దండించుటకై అతని అంతఃపురమును-

ప్రవిశన్నేవ సతతం శుశ్రావ మధుర స్వరం।
తంత్రీగీత సమాకీర్ణం సమగీత (తాళ) పదాక్షరం॥
(4-33-21)

(ప్రవేశించినంతనే అచట మధుర స్వరముతో కూడిన వీణ, పాడుట - వీనితో కూడిన సమమైన పాటయొక్క పదములు, అక్షరములు ఉన్న గానము వినెను.)

సీతను వెదకుచు రాత్రి లంకలో ప్రతి గృహమును ప్రవే శించి చూచిన ఆంజనేయుడు,

శుశ్రావ మధురం గీతం త్రిస్థాన స్వరభూషితం।
స్త్రీణాం మదసమృద్ధానాం దివిచాప్సరసామివ॥ (5-4-10)

(స్వర్గములోని అప్సరసలవలె మత్తుగొనియున్న మహిళలు మూడు స్థానములందును స్వరముల నలంకరించి మధురముగా పాడుచుండుట వినెను)

రావణుని అంతఃపురమున రాత్రి మద్యమును సేవించి, బడలిక చెంది, తూగిడించుచున్న రాక్షస స్త్రీల ఈ క్రింది చిత్ర ములు హనుమ కనుల పడెను:

అంగహారైః తథైవాన్యా కోమలైః నృత్తశాలినీ।
విన్యస్త శుభసర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ॥ (5-10-36)

(నర్తనము చేయుచున్న ఒక అంగన కోమలములైన అంగ విక్షేపములతో అట్లే అందమయిన తన తనువును పానుపు మీద పడవేసి పరుండియుండెను.)

కాచిద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే।
మహానదీ ప్రకీర్ణేవ నలినీ పోతమాశ్రితా॥ (5-10-37)

(ఒకతె పెద్ద నదిలో వ్యాపించిన తామరతీగ పడవను చేరి యున్నట్లు వీణను కౌగిలించుకొని, నిద్రించుచు కనిపించినది.)

అన్యా కక్షగతేనైవ మడ్డుకేనా సితేక్షణా।
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా॥ (5-10-38)

(మరియొక నల్లకనుల నాతి చంకలో మడ్డుకమును కలుచుకొని, వాత్సల్యమున పసిబిడ్డ నెత్తుకొన్న తల్లివలె నిదురలో ప్రకాశించుచుండెను.)

పటహం చారుసర్వాంగీ పీడ్య శేతే శుభస్తనీ।
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ॥ (5-10-39)

(సర్వాంగములందును సౌందర్యము పొంగుచున్న శుభస్తనియైన భామిని బహుకాలానంతరము లభించిన ప్రియవల్లభుని ఆలింగనమున పట్టునట్లు పటహమును హృదయమునకు హత్తుకొని పండుకొని యుండెను.)

కాచిద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా।
రహః ప్రియతమం గృహ్య సకామేవ చ కామినీ॥
(5-10-40)

(కమలముల వంటి కన్నులు కల కామిని మరియొకతె కామమున ప్రియతముని ఏకాంతమున బిగి కౌగిలింతలో పట్టుకొన్నట్లు మురళిని కౌగిలించుకొని నిదురించుచుండెను.)

విపంచీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ।
నిద్రావశమనుప్రాప్తా సహకాంతేవ భామినీ॥ (5-10-41)

(నియతముగ నర్తనము చేయు వింకొకతుక విపంచి-ఏడు తీగల వీణ-ను తీసికొని కాంతునితో పండుకొన్నట్లు నిదురలో మునిగినది.)

అన్యా కనకసంకాశైః మృదు పీనైః మనోరమైః।
మృదంగం పరిపీడ్యాంగైః ప్రసుప్తా మత్తలోచనా॥
(5-10-42)

(మత్తుగొన్న కన్నులున్న మరియొకర్తుక పసిడిరంగు గలిగి మృదువై బలిసియున్న మనోహరములైన అవయవములతో మృదంగమును హత్తుకొని నిదురించుచుండెను.)

భుజ పార్శ్వాంతరస్థేన కక్షగేన కృశోదరీ।
పణవేన సహా నింద్యా సుప్తా మదకృతశ్రమా॥
(5-10-43)

(పలుచని నడుము గల పడతి యొకతె మత్తుతో బడలిపోయి, భుజ పార్శ్వముల నడుమ చంకనున్న పణవ వాద్యముతో కూడ పండుకొన్నది.)

డిండిమం పరిగృహ్యాన్యా తథైవాసక్త డిండిమా।
ప్రసుప్తా తరుణం వత్సం ఉపగుహ్యేవ భామినీ॥
(5-10-44)

(ఇంకొక ఇంతి రెండు పుక్కిల యందును రెండు డిండిమ వాద్యములను పెట్టుకొని, ప్రాయపు భర్తను, శిశువును కవుగిలించుకొన్నట్లు పండుకొన్నది.)

కాచిదాడంబరం నారీ భుజ సం యోగ పీడితం।
కృత్వా కమల పత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా॥
(5-10-45)

(మరియొక తామరరేకుల వంటి కనులు గల తరుణి, మత్తుతో మతి చెడినది, ఆడంబర వాద్యమును రెండు చేతులతోను బిగువుగా పట్టుకొని పండుకొనియున్నది.)

కలశీమ పవిధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ।
వసంతే పుష్పశబలా మాలేవ పరిమార్జితా॥ (5-10-46)

(మరొక తుక ఘటవాద్యమును త్రోసివేసి నిద్రించుచున్నది-వసంత కాలమున రంగు రంగుల పూలతో కూర్చిన కడిగిన మాల మాదిరిగా)

ఇట్లు వేరు వేరు

ఆతోద్యాని విచిత్రాని పరిష్వజ్యావరాః స్త్రియః।
నిపీడ్యచ కుచైః సుప్తా కామిన్యః కాముకా నివ॥
(5-10-49)

(విచిత్ర వాద్యముల నాలింగనము చేసికొని, స్తనములతో హత్తుకొని, ఇతర కామినులు కాముకులను కౌగిలించుకున్నట్లు పరుండియున్నారు.)

ఇటువంటి సంగీత సామ్రాజ్యమును పరిపాలించుచున్న రావణుడు సీతకు ఆశ చూపుటకు - 'గీతం నృత్తంచ వాద్యంచ లభ మాం ప్రాప్య మైథిలి' (5-10-10) (సీతా! నన్ను పొందిన నీకు గీత నృత్త వాద్యముల ఆనందము లభించును) అని సగర్వముగా ప్రతిజ్ఞ చేయుటన్నచో అందులో ఆశ్చర్యమేమి? ఎక్కడెందుకు? వాల్మీకి భావనలో పంపా సరస్సు తీరమున-

మత్తకోకిల సన్నాదైః నర్తయన్నివ పాదపాన్।
శైలకందర నిష్క్రాంతః ప్రగీత ఇవచానిలః॥ (4-1-15)

(మదించిన కోయిలల తీయని గొంతుకలతో కొండ గుహల నుండి వెడలిన గాలి, చెట్లను నర్తనము చేయించుచు, పాడుచున్నట్లు తోచును.)

పుష్పసంఛన్న శిఖరాః మారుతోత్క్షేప చంచలాః।
అమీ మధుకరోత్తంసాః ప్రగీతా ఇవ పాదపాః॥
(4 - 1 - 20)

(ఈ చెట్లు కొమ్మల తుదలలో పూవులను కప్పుకొని, గాలి త్రోపుడుల చేత అల్లాడుచు, తుమ్మెద మ్రోతలచేత పాడుచున్నట్లున్నవి.)

వర్షాకాలమున పర్వత గుహలలో విశ్రాంతి గొనుచున్న శ్రీరాముడు జానకీ వియోగముతో దిక్కుతోచని పరిస్థితిలో నున్నను కూడ, అతని భావనా ప్రపంచమున-

షట్పాద తంత్రీ మధురాభిధానం
ప్లవంగ మోదీరిత కంఠతాలం।
ఆవిష్కృతం మేఘ మృదంగనాదైః
వనేషు సంగీత మివ ప్రవృత్తం॥ (4-29-36)

(తుమ్మెదలు వీణ తీగల విధమున మధురముగా మ్రోగుచుండగా, కప్పల గొంతుల చప్పుడు తాళము కాగా, మేఘధ్వానము మృదంగనాదము వలె నుండగా, కాననమున సంగీత సభ జరుగుచున్నట్లుండెను.)

ఇటువంటి మరి యే కావ్యమునను లేని సంగీత సంపద- మహత్సంగీత సంపద - మన చేతులకు చిక్కకయే నశించిపోయినది. భారతదేశపు టీ భవితవ్యమునకు ఎంత బాధపడినను తీరదు. లేక, విధి అనతిక్రమణీయము. దానిని నిందించి ఫలమేమి? విషాదమున మాత్రము మునిగియు నటువంటి నిర్వేదము చేత ఫలితమేమి? ఇప్పుడును మనకు అనన్య సామాన్యమైన గొప్ప సంగీత కళాసంపద కలదు. అది మార్గ విధాన సంపద కాకపోయిన కానిండు; ఇప్పటి దేశీయ విధానము చేతనే అభిరుచికిని, శక్తికిని, తగినట్లు శ్రీమద్రామాయణము పఠించుచు, గానము చేయుచు, ధన్యులవుదము గాక.

తదుపగత సమాస సంధి యోగం।
సమమధురోప నతార్థ వాక్యబద్ధం॥
రఘువర చరితం ముని ప్రణీతం।
దశ శరసశ్చ వధం నిశామయధ్వం॥ (1-2-43)

'ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్థతాం'
(7-111-25)

(యదేచ్ఛముగా దీనిని గురించి మాటలాడుడు. విష్ణువు బలము వృద్ధియగును గాక!)

(ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సంస్కృత శాఖ వారు 1965 ఫిబ్రవరిలో జరిపిన 'రామాయణ సమీక్షా' గోష్ఠిలో సంస్కృతమున చేసిన ఉపన్యాసము.)

---

# అలలుగా సాగిన నీ గీతం...

శ్రీ కొడిమెల శ్రీరామమూర్తి

నీ పాట ఈ రేయిని వెలిగిస్తోంది!
నీ గానం పరచుకొనే వెన్నెలను పరవశింపజేస్తోంది!
నీ రాగం బంగారుతీగెలా సాగుతూ
నైట్‌క్వీన్ పరిమళాన్ని కురిపిస్తోంది.
నీ గాత్రం గాలిలో తరంగాలుగా చుట్టి
జాబిలి కిరణాలతో ఆటలాడే విహంగాలను
దారి మరిచేలా చేస్తోంది!
అలలుగా సాగిన నీ గీతానికి తారకలు మురిసి
నక్షత్రాలనే నీ నడుముకు ఒడ్డాణంగా
ఇవ్వడానికి ఆయత్తమవుతున్నాయి.
ఇప్పుడందరికీ తెలిసింది
నీ సంగీతంలో మహత్తు!
అదుగో వందలాదిమంది
కాగడాలను వెలిగించి చీకట్లను
చీల్చుకొంటూ
ఇటే వస్తున్నారు ప్రవాహంగా
వారంతా నిన్ను నాకు దూరం
చేస్తారేమోనని నా భయం!

# 'సర్వమాత్మానం పశ్యతి'

## శ్రీ శివలింగం

పాపపు కనుపాపలతో
వెతికితే కనబడదు.
చీకటి ఎద పేటికలో
వెలిగే ఆత్మ దీపం.
హఠాద్దర్శన మివ్వదు
విద్యుద్దీపంలా.

అసలీ చూపే పెద్ద మాయ.
స్క్రియలిస్టు పలకల గాజుకళ్ళల్లో
రంగుల వికృతాకారాలు అసంబద్ధ రూపాలు
మార్క్సిస్టు రంగుటద్దాల్లోంచి
అంతా అరుణ రాగం. కరుణామయం
దిగంబర బూతు నీతి కవిత
చిందించింది అవినీతి రక్తం

చెదరిన కల్లోంచి
తెరచిన కన్రెప్పల నుంచి
జారి ముక్కలైంది
విప్లవ వాస్తవికత

పాజిటివిజం లాజిక్ మ్యాజిక్ లోంచి
అయోమయం బావిలో పడి
మరచిపోయాను కర్త కర్మలు.

అస్తిత్వంలో అంతా నైరాశ్యంతో పోరాటం
ఆపాదమస్తకం పాకుతున్న మేధా దారిద్ర్య వ్యాధి

కాలం వయొలిన్ కమాను మీద
అర్థంకాని ఆధునిక వ్యర్థ గీతాలాపన
చీకటి ఎద పేటిక పగిలేలా.



# మైత్రీ బంధం

## శ్రీ డి. యమునాచార్య

ఒక చిగురాకుతో
హిమబిందువు చేస్తున్న
స్నేహితాన్ని తెంపి
గాలి నేలపాలు చేసింది.

తెగపడ్డ ఆ స్నేహితుడు
సూర్యునికి చిక్కకుండా
పుడమి పొరల్లో తడి కోసం తపించే
విత్తుకు తనివితీరా దాహం తీర్చాడు.

విత్తనం గర్భాన్ని ధరించి,
వృక్షమై జన్మించి,
రాలే హిమ బిందువులకు
అర్ద్రతతో ఆకుల అరచేతులు చాచి
స్వాగత మిస్తోంది.

పరస్పరానురాగ పునీతమైన
వాటి జీవనహేల
నన్ను మురిపిస్తోంది వేళ.



# కలగూరగంప

## అర్జునుని కుదుటపరచిన కృష్ణ రూపం

ఈ (1989) జులై 'భారతి' కలగూరగంపలో 'కృష్ణస్య మానుషం రూపమ్' శీర్షిక కింద డా॥ గంటి శ్రీరామమూర్తిగారు వ్రాస్తూ డా॥ అరవింద శర్మగారు "విశిష్టాద్వైతా ఎ స్టడీ" అన్న గ్రంథంలో చేసిన ఒక ఊహని (అర్జునుని కోరిక మేరకు మొదట చతుర్భుజునిగా దర్శన మిచ్చినా తరువాత వెంటనే తన మానుష రూపమైన ద్విబాహుత్వాన్ని ప్రదర్శించాడని, దీన్నే సంజయుడు 'స్వకీయం రూపమ్' అనీ అర్జునుడు 'మానుషం రూపమ్' అని వ్యవహరించారని వారి ఊహ) త్రోసిపారేస్తూ "భగవద్గీతలోని అనేక వైరుధ్యాలలో ఇదీ ఒకటని సరిపెట్టుకోవటం వినా గత్యంతరం లేదు" అని నిర్ధారక ప్రకటన చేసారు.

భగవద్గీతలో ఇతరానేక వైరుధ్యాలేవో వాటి గతుల సంగతి ఏమో కాని పదకొండవ అధ్యాయం అయిన విశ్వరూప సందర్శన యోగ విషయంలో కృష్ణస్య మానుషం రూపంగా గానీ అన్యత్రా కానీ గత్యంతరం లేదని సరిపెట్టుకోవలసినంత వైరుధ్యం ఏమీ లేదని గుర్తించవలసి ఉందని మనవి చేస్తూ తదవగాహనకి ఓ దారి కనుక్కోవటమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

డా॥ శ్రీరామమూర్తిగారు ఎత్తిచూపిన ప్రధానమైన రెండు వైవిధ్యాలివి—

1. "ఇక్కడ ఇంకో విషయం గమనించాలి. 11వ అధ్యాయంలో 48, 49 శ్లోకాలు చతుర్భుజమూర్తిని సౌమ్య రూపునిగను 50, 51 శ్లోకాలు మానుష రూపునిగను పేర్కొంటున్నాయి కాని అంతకుముందే 16, 17 శ్లోకాల్లో విశ్వరూపాన్ని వర్ణిస్తూ అర్జునుడిలా అంటున్నాడు.

కిరీటినం గదినం చక్రిణంచ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్కద్యుతి
మప్రమేయమ్॥

ఇది దీనిపైనున్న "అనేక బాహూదర వక్త్రనేత్రం"తో సమన్వయించారు. డా॥ శ్రీరామమూర్తిగారి కది సమ్మతం కాదేమో. అలాంటప్పుడు ఎలా సమన్వయించాలో స్పష్టం చేస్తే బాగుండేది.

2. "అంతేకాక దీనివల్ల అర్జునుడు శ్రీకృష్ణుని చతుర్భుజ రూపాన్ని చూసాడనీ అదీ ఐశ్వర్య రూపంలో ఒక భాగమేననీ, అది సౌమ్యం కాదనీ ఉగ్రమనీ దుర్నిరీక్ష్యమనీ తెలుస్తోంది. (అంటే డా॥ శ్రీరామమూర్తిగారు విశ్వరూపమైనా ఐశ్వర్య రూపమైనా చిత్తరువులా స్థిరమైందనుకొంటున్నట్లుంది.) అయితే దేన్ని ఉపసంహరించమని కోరుకుంటున్నాడో ఆ చతుర్భుజ రూపాన్నే తిరిగి ప్రదర్శించమని కోరడం వింతగానూ అసంబద్ధంగానూ తోచక మానదు."

ఎంతో జిజ్ఞాస ఉంటే కాని ఇంత లోతుగా ఆలోచించటం పరిష్కారానికి ప్రాకులాడటం, అది దూరమై ఇలా స్పష్టంగా ప్రకటించటం జరిగే పని కాదు. డా॥ గంటి శ్రీరామమూర్తిగారి యీ జిజ్ఞాసా, కృషి, వ్యక్తీకరణలు అభినందనీయాలు. కాగా విశ్వరూపం 'పురుష సూక్త' వాచ్యమైన రూపానికి అద్దంపట్టి చూపిన సూక్ష్మబింబం అనేమాట గుర్తు ఉంచుకోవటం మంచిది. అందులోనూ వైరుధ్యాలున్నాయి గదా అంటే నిలుకడ ఎరుగని కాలాన్ని పరిశీలించేటప్పుడు ఏదో - ఆది → మధ్య → అవసానం అంటూ ప్రసంగించాలే కాని అనుక్షణ పరిగణనమూ తద్వివరణమూ చేసినా విసుక్కుంటాం దేశతః లేదా వస్తుతః గుర్తించేటప్పుడు ఆ మూడూ భేదరహితంగా ఎలా ఉంటాయి? అలా భేదాలున్నా అది ఒక్కటే 'కాల స్వరూపమ్'. అక్కడక్కడ చూసి ఒకదానితో ఒకటి సమన్వయించటం లేదంటే - అది కాలానికి సంబంధించి మాత్రం గుణమే ఔతుంది గాని దోషం గాదు. "ఆఖ్యాహి మే కో భవానుగ్ర రూపః" ఉగ్రరూపుడవైన నువ్వెవరివో నాకు చెప్పవయ్యా అని అర్జును డడిగితే ఆ ఉగ్ర రూపుడు "కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధః" (శ్లో-32) కాలరూపాన్ని నేను. (నీకు భవిష్యదర్శకమైన) లోకక్షయ కల్పనం కోసం ఇలా పెరుగుదల పొందాను అనటం గుర్తించాలి. ఆ పెరుగుదల నడిమిదే 'రూపం మహత్' (శ్లో-23) ఆకాశాన్నంటుతూ రంగు రంగుల వెలిగిపోతూ నోళ్లు తెరుచుకొని వెలుగులు చిమ్మే కళ్లతో ఉన్న రూపం కూడా అర్జునుని నిలుకడ పొందనీయని రూపం (వర్తమానార్థకమైన) అనాది మధ్యాంతమూ భూమ్యాకాశాలా సర్వదిక్కులా వ్యాపించిన తేజంతో విశ్వం అంతా తలపింపజేసే ఈ మహత్ లేదా అద్భుత రూపం కూడా

ఉగ్రరూపమే. కాని ముందు చెప్పినంత ఉగ్రం కాదు. ఈ రూపంలో సుర సంఘ ప్రవేశం ఉంది. కొందరు భయంతో నమస్కరించటం ఉంది. మహర్షులూ సిద్ధులూ చక్కగా స్తుతించటం ఉంది. రుద్రాదిత్యాదులు ఆశ్చర్యంతో దర్శించటం ఉంది. కాగా నోటి కోరల్లో తలలు చూర్ణం గావటం వంటివి లేవు. కనుకనే ఉగ్రతలో తారతమ్యం. (భూత భవిష్యముల నడిమి వర్తమాన స్థితి చాలా సూక్ష్మం అయింది. అయినా భగవద్గీతలో వర్తమానం మహత్ (23), అద్భుత (20) ప్రయోగాల్లోనూ భవిష్య రూపం ఘోరం (శ్లో-49) ప్రయోగంలోనూ విడమరచి చెప్పి ఉండటం మనం గమనించాలి).

16వ శ్లోకంలో 'నాన్తం నమధ్యమ్' అని ముందు పేర్కొని ఆ తర్వాత 'నపునస్తవాదిమ్' అన్న మొదటిదైన సనాతన పురుష రూపం (18) మరోటి ఉంది. (భూతకాలార్థకమైన) సర్గాది మద్రూపం అది. బ్రహ్మాణ మీశం కమలాసనస్థమ్ (విధాత శివుడు లక్ష్మి అనటం పెద్దలు వదలివేసి 'బ్రహ్మాణం చతుర్ముఖాండాధిపతిమ్, తథేశం కమలాసనస్థమ్ - కమలాసనే బ్రహ్మణిస్థి తమీశం; తన్మతేఽవస్థితమ్' అంటారు. అలా అయితే నా శివలక్ష్మి ప్రస్తావన తప్పేమో) అది పురుషోత్తముని ఐశ్వర్యం రూపమ్. ఇంకా ఋషీశ్వరులూ దేవజాతి సర్పాలూ ఉన్నాయి. (శ్లో-15. కమలాసనస్థమ్ అని బ్రహ్మార్థం పునరుక్తి కాకుండా కమలాసనస్థామ్ లక్ష్మి అంటే బాగుంటుంది. భగవద్రూపం 'ఐశ్వర్యస్య సమగ్రస్య' అంటారే ఐశ్వర్య ప్రతి రూపం లక్ష్మి లేకుంటే ఎలా అని నా భావం) అది అనన్త రూపం (16) సర్వాశ్చర్యమయ రూపమ్ 19వ శ్లోకం వరకూ అదే. అందులో శశి సూర్యులు కళ్లూ అగ్ని నోరూగా దీప్తిమంతం అయినట్లుండగా శ్లోకం చివర 'విశ్వమిదం తపన్తమ్'తో ఉగ్ర రూపానికి మళ్లింది.

'రూపమైశ్వరం'. 1) వినికిడివల్ల అర్జును డూహించి చూసి భరించగలనన్న విశ్వాస రూపంగా 3వ శ్లోక ప్రయోగం ఉంది. 2) కాని అతడు మామూలు కళ్ళతో చూసి భరించలేడన్న ఉగ్ర ఘోర రూపం అనే శ్రీకృష్ణుని తాత్పర్యంగా 8వ శ్లోక ప్రయోగం ఉంది. అర్జునుడి భావం నుంచి శ్రీకృష్ణుడి భావందాకా ఎదిగే చలద్రూపంగా సంజయుడి మాటగ 9వ శ్లోక ప్రయోగం ఉంది. దీన్ని బట్టి భూత - వర్తమాన - భవిష్య పరమైన విస్పష్ట క్రమ వికాసం గల 'కాలస్వరూపమే' 'రూపమైశ్వరమ్' అన్న మాట స్పష్టం ఔతూనే ఉంది కదా!

ఈ మూడు పాదాల 'రూపమైశ్వరమ్' భరించటం కోసం కృష్ణు డర్జునుని మనస్సుని ఎప్పటికప్పుడు దృఢపరుస్తూనే వచ్చాడు. సప్తమాధ్యాయం విజ్ఞానయోగంలో "మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణి గణా ఇవ" (శ్లో-7). చరాచర సర్గంలో అన్నింటినీ మణులుగా చెప్పి వాటిని మాలగా చేసే సూత్రం (దారం) తానై లోపల ఉన్నానన్నాడు. మళ్ళీ 10వ శ్లోకంలో "బీజంమాం సర్వభూతానాం విద్ధిపార్థ సనాతనమ్" అని ఆ చరాచర సర్గంలో అన్నింటికీ బీజం నేనేనని నన్ను తెలుసుకో అని అవన్నీ నాలో ఉన్నాయంటాడు. ఈ రెండింటినీ బట్టి అన్నింటిలో తానున్నాడా? తనలోనే అన్నీ ఉన్నాయా (దైవ భావనలో ఇవి విరుద్ధ విషయాలనుకుంటే సత్యానికి దూరం ఔతున్నట్లే) వంటి విషయ పరిశీలన కర్జునుని బుద్ధికి పరీక్ష పెట్టాడు. అలా అలా విభూతియోగం చివర (10వ అధ్యాయం) "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" నేనీ జగత్తునంతనూ ఒక అంశతో ఆవరించి ఉన్నానన్నాడు. అదే పురుష సూక్తంలో 'పాదోఽస్య విశ్వాభూతాని' అని ఉంది. తర్వాత ఈ పదకొండవ అధ్యాయం విశ్వరూప సందర్శన యోగం మొదట్లో అర్జునుడు 'వచస్తేన మోహోఽయం విగతో మమ' నీ మాటలతో భ్రాంతిపరమైన నా (అజ్ఞాన) భావం తొలగి పోయింది అన్నాడు. అంటూనే క్రిందటి విభూతియోగంలో అది నేనే ఇది నేనే అన్నావే - అందుకు నిదర్శనంగా అవన్నీ నీవైన 'రూపమైస్వరమ్' నాకు చూపించు అన్నాడు. ఆ అర్జునుడి సంగతి శ్రీకృష్ణుడికి బాగా తెలుసు. ద్వితీయాధ్యాయం సాంఖ్య యోగం లోనే 11వ శ్లోకంలో 'ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' ఏమిటోయ్ పెద్ద కవిత్వం చెప్తున్నావని చురక వేసేఉన్నాడు. అందుచేత అతడు మోహం వదలిపోయిందన్నా 7వ శ్లోకంలో "ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్యస చరాచరం మమదేహే గుడాకేశ!" ఈ నా ఒక్క శరీరంలోనే చరాచరం అయిన జగమంతా ఎలా ఉన్నదాన్నలా చూడవయ్యా. "యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి" ఇంకా ఏం చూడాలనుకుంటున్నావో అవన్నీ కూడ చూడు అన్నాడు. కృష్ణుడికి అర్జునుడొక్కసారిగా తన విశ్వరూపాన్ని చూడలేడని తెలుసు. అయినా చూపదల్చుకున్నాడు. కనుక నరుడి గుండెకి బలం కలిగించటానికి చూడవయ్యా నాలో చరాచర ప్రపంచాన్ని అంటూ ప్రోత్సహిస్తూ ఇంకేం చూడాలనుకొన్నా అంటే నువ్వు చూడగలిగిన స్తోమతను బట్టి నువ్వే ఎంచుకో అన్నాడన్న మాట. అంటూనే మామూలుగా చూడటం కష్టం కనుక దివ్యనేత్రా లిస్తా నన్నాడు. అలాగే అయినుడోమాదిరి విశ్వరూపం (16 శ్లో)

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది,
వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

చూసినట్లు చెప్పి అనంతరం తాను ఇష్టపడే (చివర్లో స్వయంగా అడుగుతాడు కూడాను). కిరీటాయుధాలున్న కాంతిమంత రూపాన్ని చూసాడు. మొదట చరాచరం చూసాడే ఆ చరాచరానికి ఆశ్రయం ఏది? ఎక్కడుంది? ఎలా ఉంది? అంటే → అలా ఆశ్రయమైన రూపం తర్వాత గమనించాడు. అది అర్జునుడికి ఓ మాదిరి పరిచయం ఉన్నదే. అది మనం ముందు ఉదాహరించుకొన్న "కిరీటినం.... మప్రమేయమ్" శ్లోకంలో ఉన్నదే

అందులో 'గదినం చక్రిణంచ' అని వాచ్యంగా రెండాయుధాల ప్రసక్తి మాత్రమే ఉన్నా 'గద' జోడీ అయిన పద్మమూ (లేదా నందక ఖడ్గం), చక్రం జోడీ అయిన శంఖమూ కూడా చెప్పినట్లే. అలా పైకి ఎత్తిఉన్న చేతుల్లో ఉండే ఒక ఆయుధమూ క్రిందికి వ్రాలి ఉండే చేతుల్లో ఒకదాని ఆయుధమూ వాచ్యం చేసి వాటి జంట వాటిని స్మరింపజెయ్యటం తక్కువ మాటల్లో ఎక్కువ విషయం అందించే ఒక విధానం అనుసరింపబడింది. సారాంశంగా అప్పు డర్జునుడు చూసింది చతుర్భుజ మూర్తే సుమా అని నిర్ధారణ చెయ్యటమే ఇక్కడ ఉద్దేశం. అది కిరీట ఆయుధాదుల తేజఃపుంజం.

ఈ 16 శ్లోకంలో వాచ్యంగా (చతుర్భుజ) లేని రూపం 'ఇంకేం చూడాలనుకుంటున్నావో అని కృష్ణుడన్నదాని ప్రతిస్పందన 45వ శ్లోకంలో 'మేదర్శయ దేవరూపమ్' దైవభావంగా నేను భావించే రూపం చూపించు నాకు తెలిసిందీ నేను తట్టుకోగలిగిందీ ఇలా ఉంటుంది. అలా కనిపించు అన్ని మళ్లీ "కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి" అని సూటిగా చెప్పేసాడు. చేతుల్లెక్క కూడా "చతుర్భుజేన" అని స్పష్టం చేసాడు. మరైతే అందులో కనిపించిన 'చరాచర జగత్కృత్స్నమ్' మాటేమిటి? అంటే 'ప్రవ్యధితం మనో మే' (45) నా మనస్సు వ్యథ చెందుతూంది. 'తదేవ'. అందువేత-అదే సహస్ర బాహో విశ్వమూర్తే(46) తేనైవరూపేణ (దేవరూపం) చతుర్భుజేన (46) భవ (46) మేదర్శయ. విశ్వమయంగా ఉన్న మూర్తివి సహస్ర బాహువులువాడివి నీ దేవరూపం అయిన చతుర్బాహువు డివిగా అయిపోయి నాకు దర్శనం ఇయ్యి. అనటంవల్ల ఆ 'చరాచర జగత్కృత్స్నమ్' ఉపసంహరింపబడాలని కోరాడన్న మాట.

మరి 'తేనైవరూపేణ చతుర్భుజేన' అన్నది పట్టుకొని నీదైన రూపం (సారథిగా ఉన్న) కృష్ణుని రూపం చతుర్భుజాలను కలిగి ఉందా అని శంకించటం అనవసరం కదా! దైవభావన తోచినప్పుడల్లా శ్రీకృష్ణుడు చతుర్భుజుడుగా కనిపిస్తాడు. అర్జునుడు సందర్భ పడినప్పుడల్లా 'దేవేశ జగన్నివాస (38) దేవవర ప్రసీద (31) ప్రసీద దేవేశ (25) అపశ్యద్దేవస్య శరీరే (13) అని ఆ మూర్తిని తలచుకొని రక్షణకు ప్రాకులాడటమూ ఆ మూర్తియందే ఇతరేతర చరాచరాల్ని దర్శించటమూ ఉంది.

ఈ చతుర్భుజ రూపాన్ని ప్రస్తావించి డా॥ శ్రీరామమూర్తిగారు "ఇక్కడ సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు శంకర రామానుజులిద్దరూ చతుర్భుజ రూపాన్ని సమర్థిస్తూనే వ్రాసారు. ఇతరులు వారి ననుసరించారు. శంకరుల వ్యాఖ్య ఇలా ఉంది. "తదేవరూపం- చతుర్భుజ రూపం శంఖచక్ర గదాధరమ్, స్వకం రూపం వసుదేవస్య గృహేజాతమ్" (వసుదేవుని ఇంట్లో పుట్టిన రూపం అంటే చతుర్భుజ రూపమే కదా)" అని వ్రాసారు. అందులో సందేహమేముంది?

మళ్లీ "ఇక రామానుజులవారు తమ భాష్యంలో ఇలా చెప్పారు. 'స్వకీయ మేవ చతుర్భుజం రూపమ్'," అని ఇంకా "రామానుజులు తమ భాష్యంలో ఈ క్రింది అంశాలను స్పష్టంగా ప్రతిపాదించారు. 1) శ్రీకృష్ణుడు నాల్గు భుజములతోనే పుట్టాడు. 2) ఇందులో రెండు భుజాలను కంసవధ పర్యంతం వసుదేవుని కోరికపై (అయనకు గల కంసభీతిచే) అంగీకరించాడు. 3) కంస వధానంతరం మళ్ళీ చతుర్భుజాలను ప్రదర్శించాడు. 4) విశ్వరూపానంతరం తన పూర్వరూపం స్వకీయ మానవ రూపం పొందినపుడు కూడా చతుర్భుజుడే. - ఈ చతుర్భుజ రూపమే మానవరూప మనటం ఎంతవరకు సబబు?" అని ప్రశ్నించారు. పై వాటిలో 4వ దాన్లో స్వకీయ చతుర్భుజ రూపం మానవ రూపం అని శ్రీరామానుజుల వారనలేదు. భగవద్గీతలోని 46వ శ్లోకానికి 51వ శ్లోక అతుకు పెట్టి డా॥ శ్రీరామమూర్తి గారేర్పరచుకొన్న అభిప్రాయం అది.

46వదైన 'కిరీటినం....' శ్లోకానికి శ్రీ రామానుజ వ్యాఖ్య ఇలా ఉంది. "తథైవ పూర్వవత్కిరీటినం గదినం చక్రహస్తం త్వాం ద్రష్టు మిచ్ఛామి. అత స్తేనైవ పూర్వసిద్ధేన చతుర్భుజేన రూపేణ యుక్తోభవ సహస్రబాహో విశ్వమూర్తే-ఇదానీం సహస్ర బాహుత్వేన విశ్వ శరీరత్వేన దృశ్యమాన రూపస్త్వం తేనైవ రూపేణ యుక్తోభవేత్యర్థః" కాగా డా॥ శ్రీరామమూర్తిగారు ప్రస్తావించిన కంస వధానంతర విషయంగా ఉన్న వ్యాఖ్య సంజయుడి మాటలైన 50వ శ్లోకానికి చెందింది. ఇలా ఉంది.

"ఏవం పాండు తనయం భగవాన్వాసుదేవ సూనురుక్త్వా భూయః స్వకీయ మేవ చతుర్భుజం రూపం దర్శయామాస.

అపరిచిత స్వరూప దర్శనేన భీతమేనం పునరపి పరిచిత సౌమ్య వపుర్భూత్వా ఆశ్వాసయామాసచ, మహాత్మా సత్యసంకల్పః" ఇంతవరకు శ్లోక తాత్పర్యమే. ఇందులో మొదటి పాదానికి చెందిన 'చతుర్భుజం రూపమ్' గురించి ప్రత్యేక వ్యాఖ్య ఇలా ఉంది. "అస్య సర్వేశ్వరస్య పరమ పురుషస్య పరస్య బ్రహ్మణో జగదుపకృతి మర్త్యస్య వసుదేవ సూనోశ్చతుర్భుజ మేవ స్వకీయం రూపమ్. (సర్వేశ్వరుడూ పరమేశ్వరుడూ పరబ్రహ్మ యొక్క జగదుపకారం కోసం వసుదేవ సూనుడైన మర్త్య భూమికి దిగిన మూర్తికి స్వకీయమైన రూపం చతుర్భుజ మూర్తే. ఇక్కడ మర్త్యస్య అనగానే 'మానుషం రూపమ్' అని తేల్చివెయ్యకూడదు. మర్త్యుడై వసుదేవ సూనుడైనప్పటి రూపంగా అర్థం చేసుకోవాలి. అప్పటిది దైవస్వరూపం. చతుర్భుజమూర్తి అని మాత్రమే అర్థం ఎందుకంటే తర్వాత పాద తాత్పర్యమే మానుష రూపం. సౌమ్యరూపం ద్విబాహు రూపంగా గ్రహించవలసి ఉంటుంది). "కంసాద్భీత వసుదేవ ప్రార్థనేన ఆకంసవధాద్భుజద్వయ ముపసం హృతం పశ్చాదావిష్కృతంచ". (కంసుని వలన భయపడే వసుదేవుడు ప్రార్థించగా కంస సంహారం దాకా రెండు చేతులు ఉపసంహరింపబడ్డాయి. (అంటే వసుదేవుని కొడుకై మర్త్య లోకప్రవేశం చేసిన పరమ పురుషునికి నాల్గు భుజాలని అర్థం జేసుకోవాలన్న అవగాహన కుదిరినట్లే గదా). వాడు అంటే కంసుడు చనిపోయిం తర్వాత పునరావిష్కరింపబడ్డాయి. *"జాతోఽస్మి దేవదేవేశ శంఖచక్ర గదాధర! దివ్యం రూప మిదం దేవ ప్రసాదేనోప సంహర. ఉపసంహర విశ్వాత్మన్ రూపమే తం చతుర్భుజ మితి హి ప్రార్థితమ్" ఇది వసుదేవుని ప్రార్థన. తన వ్యాఖ్యకు బలం కోసం శ్రీ రామానుజులు ఉటంకించారు. పూవు గుర్తు అలాంటి సందర్భాల్లోనే వేసారు భాష్యంలో. ఇంతవరకే డా॥ శ్రీరామమూర్తిగారు తీసుకున్నట్లుంది గాని శ్రీరామానుజుల వ్యాఖ్య ఇంకా కొనసాగింది. ఇలా "శిశుపాలస్యాపి ద్వేషతోఽ నవరత భావనా విషయ శ్చతుర్భుజ మేవ. వసుదేవ సూనో రూపమ్. (శిశుపాలుడికూడా శత్రుత్వం వల్ల భావన ఎల్లపుడూ చేయబడే వసుదేవ కుమారుని రూపం చతుర్భుజ రూపమే). సాక్ష్యం *ఉదారపీవర చతుర్బాహుం శంఖ చక్ర గదాధరమితి అని చూపి "అతః పార్థేనాత్ర" అన్నారు. శిశుపాలుడు శత్రుత్వంతో భావన చేస్తాడని అదే పార్థుడిక్కడ అన్నది ఆ భావనా విషయమే. అదె *"తేనైవ రూపేణ చతుర్భుజే నోచ్యతే" (నీదైన చతుర్భుజ రూపంతో (కనిపించు) అన్నాడు-వరకు వ్యాఖ్య సాగింది. ఇప్పుడు అర్జునుడన్న 'తేనైవ రూపమ్' సంజయుడన్న స్వకం రూపం ఒక్కటె అది చతుర్భుజ రూపం. సంజయ కథనానికి ముందు మాట్లాడిన శ్రీకృష్ణుడు 49వ శ్లోకంలో "పునస్త్వం తదేవ మేరూప మిదం ప్రపశ్య" మళ్లీ అదే నా రూపం ఇదుగో చూడు. అన్నది కూడా చతుర్భుజ రూపమే. అదే సంజయుడందుకొని వెంటనే ధృతరాష్ట్రుడికి అది స్వకం రూపవ్ కృష్ణుడు కని చెప్పాడు. అయితే అది 50వ శ్లోకం మొదటి పాదానికే పరిమితం. ఆ పాదాన్ని శ్రీరామానుజుల వ్యాఖ్యలో అవగాహన పొందే ఉన్నాము. రెండవ పాదానికి వచ్చేసరికి ఆ స్వకం రూపం చూపించటమే కాదు దాన్ని ఉపసంహరించి పునస్సౌమ్యవపువై అర్జునుణ్ని ఊరడించాడు. మొదటి పాదంలో భూయః → మరల - చూపించింది చతుర్భుజ వపువు కాగా రెండవ పాదంలో పునః → మరల (చూపి) ఊరడించింది సౌమ్యవపువు. దాని తాత్పర్యం శ్రీ రామానుజులు "అపరిచిత స్వరూప దర్శనేన భీతమేనం పునరపి పరిచిత సౌమ్యవపుర్భూత్వా ఆశ్వాసయామాసచ, మహాత్మా సత్య సంకల్పః" అని యిచ్చారు. ఇందులో మొదటి పాదంలో భూయః చూపిన స్వకం రూపం తర్వాత మళ్లీ అనే పునరపి ప్రయోగం. దాని తర్వాత సౌమ్యవపువు కూడా అనే చివర చ కార ప్రయోగం అనేది స్పష్టమే. ఆ సౌమ్యవపువే మానుషం రూపమ్ 51వ శ్లోకంలో అర్జునుడా విషయం "దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యమ్" అని స్పష్టంగానే ప్రకటించాడు. కాల స్వరూపుడిగా కొంచెం ఎక్కువాను దైవరూపుడిగా (బాబోయ్ ఇంతటివాడితోనా నేనిష్టం వచ్చినట్లల్లా మాట్లాడేది) కొంచెం తక్కువ స్థాయిలోను భయపెట్టే రెండు రూపాలూ (భూయః అని ఒకటి పునః అని మరోటి) ఉపసంహరించి స్నేహితుడు, మేనబావ, గురువు అయి ఉండి ఇప్పుడు సారధ్యానికి వచ్చినదే శ్రీ కృష్ణస్య మానుషం రూపం తస్య సౌమ్యం వపుః.

ఇంత స్పష్టంగా కృష్ణుని మానుష సౌమ్యరూపం భగవద్గీత-దానికున్న శ్రీరామానుజుల వ్యాఖ్యలలో ఉండగా డా॥ అరవింద శర్మగారు "అర్జునుని కోరిక మేరకు మొదట చతుర్భుజునిగా దర్శనమిచ్చినా తరువాత వెంటనే మానుష రూపమైన ద్విబాహుత్వాన్ని (విశిష్టాద్వైత-ఎ స్టడీ వ్రాస్తూ ఆ విశిష్టాద్వైత స్థాపకులైన శ్రీరామానుజుల వ్యాఖ్య సరిగా లేనట్లు ఎంచుకొని) ప్రదర్శించాడని" ఊహ చేయవలసిన అవసరం ఏమి వచ్చింది! "దీన్నే సంజయుడు స్వకీయం (స్వకం) రూపం అనీ అర్జునుడు మానుషం రూపం అనీ వ్యవహరించారని" ప్రకటించి సామాన్య గీతా పాఠకుల్ని కూడా సందేహంలో పడవెయ్యటమూ దానికి

స్పందించి డా॥ గంటి శ్రీరామమూర్తిగారు "అయితే దేన్ని ఉపసంహరించమని కోరుకుంటున్నాడో ఆ చతుర్భుజ రూపాన్నే తిరిగి ప్రదర్శించమని కోరటం వింతగానూ అసంబద్ధంగానూ తోచక మానదు" అని తీర్మానించటమూ సమంజసాలు కావు. మొదటి చతుర్భుజ రూపం 7వ శ్లోకంలో "పశ్య....యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి "గా నీ కిష్టమైన ఇంకేదైనా రూపంగా అంటూ అర్జునుడు వాచ్యంగా అడక్కుండానే హితైషియై వానికి ఇష్ట రూపంగా దర్శనమిచ్చాడు. రెండవసారి దాన్నే అర్జునుడు నోరారా కోరగా దర్శనం ఇచ్చాడు. ఇందులో వైరుధ్యం ఏమాత్రమూ లేదు. ఆ లేనిదాన్ని ఎలాగో సరిపెట్టుకోవలసిన దుర్గతి అసలే లేదని మనవి చేస్తూ ఈ విశ్వరూప సందర్శన యోగానికి గల ఆర్ష ప్రతిపత్తిని శ్రీ నోరి సుబ్రహ్మణ్యంగారు అనువదించగ ఈ మధ్య తిరుమల తిరుపతి దేవస్థానములు పునః ప్రచురణ చేసిన శ్రీ లోకమాన్య బాలగంగాధర తిలక్‌వారి గీతా రహస్యము నుండి గ్రహించి వ్రాస్తున్నాను.

"ఆర్షమగు వృత్తరచనల కుదాహరణములుకై (కాశీనాథ త్ర్యంబక) తెలంగుగారు స్పష్టముగ నిరూపించినవారు కారు. కాని పదునొకండవ యధ్యాయమున విశ్వరూప సందర్శనము నందలి (గీ. 11 అ, 15-30) ముప్పదియారు శ్లోకముల నుద్దేశించియే గీతావృత్తరచన యార్షముగ నున్నదని వారు చెప్పినట్లు నాకు దోచుచున్నది. ఈ శ్లోకములలో ఒకటి ప్రతి చరణ మందును బదునొకం డక్షరములు గలవు; కాని గణ నియమం లేక మొదటి చరణ మింద్ర వజ్రావృత్తముగను రెండవది యుపేంద్ర వజ్రముగను మూడవది శాలినీ వృత్తముగను నాల్గవది మఱియొక వృత్తముగను నున్నవి. ఇట్లు వేర్వేఱగు పదునొకండు వృత్తముల యందలి చరణములీ ముప్పదియారు శ్లోకముల యందును (అనగా 144 చరణములందును) స్పష్టముగ గాన్పించుచున్నవి. అయినను బ్రతిచరణము నందును నక్షరములు పదునొకండుండ వలయు ననియు, మొదటిదియు, నాల్గవదియు, నెనిమిదవదియు, మఱియు చరణముల యందు చివరనుండు రెండక్షరములును గురువులుగను, నాఱవది తఱచుగ లఘువుగను నుండవలయు ననియు వానియందు నియమము గాన్పించుచున్నది దానివలన ఋగ్వేదమందు గాని యుపనిషత్తులయందు గాని యున్న త్రిష్టుప్ వృత్తము మాదిరిగ నీ శ్లోకములు రచింప బడినట్లూహింపవలసి యున్నది." (ద్వితీయభాగము పుటలు 463 & 464) అర్థ తాత్పర్యాలు తెలియకపోయినా పఠనమాత్రం చేతనే పవిత్రులను చేయగల ఋగ్వేద ప్రతిరూప ప్రతిపత్తి ఉన్న విశ్వరూప సందర్శన యోగం యోగ్యుల పఠనంలో ఎప్పటికీ నిలిచిపోవాలనీ అలా నిలిచి ఉండగలదనీ ఎవరు మూర్ఖం అనుకొన్నా స్పష్టం చేస్తున్నాను.

—శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణ శర్మ

# ద్రౌపదికి పరాభవం జరిగినప్పుడు ధృతరాష్ట్రుడు సభలో ఉన్నాడా లేడా?

యుధిష్ఠిరుడు ద్రౌపదిని జూదంలో ఓడిపోయిన తర్వాత దుర్యోధన దుశ్శాసన కర్ణులు ఆమెను దుష్కర్మ దుర్వచనాలతో చాలా అవమానపరచారు. అదంతా ధృతరాష్ట్రుడు సహించాడు, అనగా అంగీకరించాడు. కాని, తర్వాత భీముడు ప్రతిజ్ఞలు చెయ్యగా రాజభవనంలో నక్కల కూతలు విని గాంధారీ విదురులు ధృతరాష్ట్రునికి నివేదించుతారు. అప్పుడు ధృతరాష్ట్రుడు ద్రౌపదికి రెండు వరాలిచ్చి (63-26) పాండవులకి దాస్య విమోచనం చేస్తాడు ఆ పిమ్మట వారి రాజ్యం వారికి తిరిగి ఇచ్చి వేస్తాడు (65). ధృతరాష్ట్రుడు చేసిన ఈ పని చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. తన కట్టెదుట జరిగిన ఆ ఘోరకర్మ ఎట్లా ఉపేక్షించాడు, పిమ్మట అల్పకారణం వలన ఆ మహోదార కర్మ ఎట్లా చేశాడతడు? కనుక ద్రౌపదికి పరాభవం జరిగినప్పుడు ధృతరాష్ట్రుడు సభలో ఉన్నాడా లేడా? అన్న సందేహం కలుగుతుంది దీనిని గురించి పరిశీలించవలసి ఉంది.

జూదం జరుగుతున్నంతసేపూ ధృతరాష్ట్రుడు సభలోనే ఉన్నాడు. ధర్మరాజు క్రమంగా ధనరాశులనన్నీ ఓడిపోగా విదురుడు ధృతరాష్ట్రుడిని జూదం నిలుపు చెయ్యమని ప్రార్థిస్తాడు (56). కాని ధృతరాష్ట్రుడా పని చెయ్యలేదు. యుధిష్ఠిరుడు ద్రౌపదిని పందెంగా ఒడ్డగా సదస్యులందరూ విషణ్ణులయ్యారు. అప్పుడు—

"ధృతరాష్ట్రస్తు సంహృష్టః పర్యపృచ్ఛత్ పునః పునః
కిం జితం కిం జిత మితిహ్యాకారం నాభ్యరక్షత" (58-41)

(సంహృష్టుడైన ధృతరాష్ట్రుడు మాటి మాటికీ అడిగాడు— మా పక్షం జయించిందా? మా పక్షం జయించిందా? అని. తన హర్షాకారాన్ని మరుగు పరుచుకోలేకపోయాడు.) దీనినిబట్టి ధృతరాష్ట్రుడప్పుడు సభలో ఉన్నాడని స్పష్టమవుతున్నది. అనంతర

శ్లోకంలో ద్రౌపదీ ద్యూత పరాజయం కథితమయింది, ఆ శ్లోకంతో అధ్యాయం సమాప్తమయింది.

అనంతరం దుర్యోధనుడు ద్రౌపదిని సభకి తెమ్మని ప్రాతికామిని పంపగా ఆమె అతడిని సుప్రసిద్ధమైన ప్రశ్నతో తిరిగి సభకి పంపుతుంది. తర్వాత రెండు శ్లోకాలిట్లా ఉన్నాయి.

"యుధిష్ఠిరస్తు తచ్ఛ్రుత్వా దుర్యోధన చికీర్షితమ్
ద్రౌపద్యాః సంమతం దూతం ప్రాహిణోద్ భరతర్షభ.
ఏకవస్త్రా అధోనీవీ రోదమానా రజస్వలా
సభా మా గమ్య పాంచాలీ శ్వశురస్యాగ్రతోఽభవత్."
(60 - 14 15)

("పాంచాలి శ్వశురస్యాగ్రతో భవ" అని పాఠాంతరం.)

(దుర్యోధనుని ఉద్దేశ్యం తెలుసుకొని యుధిష్ఠిరుడు ద్రౌపదికి విశ్వసనీయుడైన దూతను పంపాడు. అప్పుడు ఏక వస్త్ర, అధోనీవి, రజస్వల అయిన పాంచాలి ఏడుస్తూ సభకు వచ్చి మామగారి ముందు నిలిచింది లేదా మామగారి ముందు నిలువుము అని ధర్మరాజు కబురు పంపెను).

వీటిలో రెండవ శ్లోకంలో ధృతరాష్ట్రుడు సభలో ఉన్నట్లు కనిపిస్తున్నా అనంతర సన్నివేశాలని బట్టి ఈ శ్లోకాలను పునర్విచారణ చెయ్యవలసి ఉంది.

తర్వాతి శ్లోకంలో (60-16) దుర్యోధనుడు ప్రాతికామికి మళ్ళీ చెబుతాడు ద్రౌపదిని సభకు తెమ్మని. ప్రాతికామి సంశయిస్తూ ఉండగా దుశ్శాసనుడిని పంపుతాడు (60-18). అతడు పాండవుల భవనం ప్రవేశించి (60-19) ద్రౌపదిని జుట్టు పట్టుకుని ఈడ్చి తెస్తాడు. దుశ్శాసనుడిని చూసి ద్రౌపది భవనం లోపల రాజస్త్రీలు ఉన్నచోటుకు పరుగెత్తింది. కాని దుశ్శాసనుడామెను వెంబడించి బలవంతంగా పట్టుకొని సభా సమీపానికి తెచ్చాడు (60-21). ఈ సన్నివేశాన్ని బట్టి అంతవరకు ద్రౌపది సభలో లేదనీ తమ భవనంలో ఉందనీ తర్వాత దుశ్శాసను డామెను బలవంతంగా అక్కడకు ఈడ్చి తెచ్చాడనీ స్పష్టమవుతున్నది. కనుక ఇందుకు విరుద్ధంగా ఉన్న 60-14, 15 శ్లోకాలు అశ్రద్ధేయములూ ప్రక్షిప్తములుగా పరిగణించవలసి ఉంది. కనుక ఆ శ్లోకం ఆధారం చేసుకొని ధృతరాష్ట్రుడు సభలో ఉన్నాడని నిరూపించ కూడదు.

అటు పిమ్మట ద్రౌపది సభాసదులని ప్రశ్నిస్తుంది. తాను జయింపబడినట్లా కానట్లా అని. కోపంగా ఆమె ఎంతసేపు సభాసదులని ఉద్దేశించి మాటాడినా భీష్మాదుల నుద్దేశించి ప్రశ్నించిందే తప్ప ఒక్కసారైనా ధృతరాష్ట్రుడిని ఉద్దేశించి అడుగలేదు. రాజు గాని ఎదుటగా ఉంటే అతనితో మొర పెట్టుకోకుండా భీష్మాదులతో మొరపెట్టుకోవలసిన అవసరం ఏమిటి ఆమెకు? కాని ఆమె ఇలా అంది—

"ద్రోణస్య భీష్మస్య చ నాస్తి సత్త్వం
క్షత్తుస్తథైవాస్య మహాత్మనోఽపి
రాజ్ఞస్తథా హీమ మధర్మ ముగ్రం
న లక్షయంతే కురువృద్ధ ముఖ్యాః". (60-34)

(ద్రోణునికీ భీష్మునికీ మహాత్ముడైన విదురునికీ కూడా ధైర్యం లేదు. రాజుకి కూడా ధైర్యం లేదు. కురు వృద్ధ ముఖ్యులు ఉగ్రమైన ఈ అధర్మాన్ని చూడటం లేదు.) ఈ శ్లోకం వలన అక్కడ అప్పుడు ధృతరాష్ట్రుని ఉనికి గమ్యమానమవుతున్నది. కాని సభలో లేకపోయినా అక్కడ జరుగుతున్న అధర్మానికి రాజే బాధ్యుడు కనుక ద్రౌపది అట్లా అన గలదు. అందుచేత ధృతరాష్ట్రు డప్పుడక్కడ ఉన్నాడని ఈ శ్లోకం నిరూపించదు. కాని ద్రౌపది అడిగిన ప్రశ్నకు ఎవరూ ప్రత్యుత్తరం చెప్పలేదని వికర్ణు డిట్లా అంటాడు-

"భీష్మశ్చ ధృతరాష్ట్రశ్చ కురు వృద్ధ తమావుభౌ
సమేత్య నాహతుః కించిద్ విదురశ్చ మహామతిః"
(61 - 13)

(కురువృద్ధతములైన భీష్ముడూ ధృతరాష్ట్రుడూ కూడా ఏమీ మాటాడలేదు. మహామతి అయిన విదురుడు కూడా ఏమీ అన లేదు.) ఈ శ్లోకం వలన ద్రౌపదీ ప్రశ్న చర్చా సమయంలో ధృతరాష్ట్రుడక్కడ ఉన్నట్లు తోస్తున్నా తక్కిన అన్ని సన్నివేశాలని బట్టి అతడప్పు డక్కడ లేడని తోస్తున్నది. ధృతరాష్ట్రుడు ద్రౌపదీ ప్రశ్నను పరిష్కరించలేదు అని మాత్రమే వికర్ణుడి అభిప్రాయం కావచ్చును.

తర్వాత ద్రౌపదీ వస్త్రహరణం, దుశ్శాసనుడి గురించి భీముని ప్రతిజ్ఞ, ద్రౌపదీ ప్రశ్న గురించిన తిరిగి చర్చ, కర్ణ దుర్యోధనులు ద్రౌపదిని పరాభవించడం, దుర్యోధనుడి గురించి భీముని ప్రతిజ్ఞ క్రమంగా అవుతాయి. ద్రౌపదిని పందెం పెట్టడానికి యుధిష్ఠిరుడికి అధికారం ఉందా లేదా అని తిరిగి చర్చ జరుగుతూ ఉండగా నక్కలు రాజభవనంలో అరచాయి(63-22).

"కం చ శబ్దం విదురస్తత్త్వవేదీ
శుశ్రావ ఘోరం సుబలాత్మజా చ
భీష్మ ద్రోణౌ గౌతమశ్చాపి విద్వాన్
స్వస్తిస్వస్తీత్యపి చైవాహురుచ్చైః.
తతో గాంధారీ విదురశ్చైవ విద్వాం
స్తముత్పాతం ఘోర మాలక్ష్య రాజ్ఞే
నివేదయామాసతు రార్తవత్తదా
తతో రాజా వాక్యమిదం బభాషే.
హతోఽసి దుర్యోధన మంద బుద్ధే
యస్త్వం సభాయాం కురు పుంగవానామ్."
స్త్రియం సమాభాషసి దుర్వినీత
విశేషతో ద్రౌపదీం ధర్మపత్నీమ్."

( 63; 23-25 )

(ఆ ఘోరమైన శబ్దాన్ని తత్త్వవేది అయిన విదురుడూ గాంధారీ, భీష్మ ద్రోణులూ, కృపుడూ విన్నారు. బిగ్గరగా స్వస్తి స్వస్తి అని అన్నారు. అప్పుడు గాంధారీ విదురుడూ ఘోరమైన ఆ ఉత్పాతాన్ని చూసి ఆర్తులై రాజుకి నివేదించారు. అప్పుడు రాజు ఇలా అన్నాడు - దుర్యోధన! నువ్వు చాలా చెడ్డ పని చేశావు. మందబుద్ధీ! కురుపుంగవుల భార్యను సభలో నిలిపి మాటాడడం, పైగా వారి ధర్మపత్నిని ద్రౌపదినే ఇలా చెయ్యడం ఓ దుర్మార్గుడా! చాలా తప్పు.)

గాంధారీ విదురులు ధృతరాష్ట్రునితో మాటాడారు అన్న దానినిబట్టి అతడప్పుడు అంతఃపురంలో ఉన్నాడనీ సభలో లేడనీ అనుమించవలసి ఉంది. ద్రౌపదిని సభలోనికి తెప్పించి పరాభవించినందుకు అతడిని ధృతరాష్ట్రుడు నిందించడం చూస్తే దుర్యోధనాదులు ద్రౌపదికి చేసిన పరాభవం అతడికి అంతకు ముందు బాగా తెలియదనీ అతడి పరోక్షంలో అది జరిగిందనీ తెలుస్తున్నది.

కనుక రెండు పక్షాలుగా తర్కించవచ్చును. ద్యూత సమయంలో సభలో ఉన్న ధృతరాష్ట్రుడు ద్రౌపదీ గ్లహీకరణ పర్యంతం స్వపక్ష జయంతో హర్షం పొంది, ద్రౌపదితో కూడా పాండవులందరూ దాసులు కాగానే సంతుష్టుడై ఆ వ్యగ్రస్థితిలో ఉండడం ఇష్టం లేక ప్రాతికామి అడిగిన ద్రౌపదీ ప్రశ్న విషయంలో ఏమీ చెప్పకుండానే సభనుండి నిర్గమించి వెళ్ళిపోయాడని ప్రథమ పక్షం. రాజు లేనందువలన దుర్యోధనుడు ద్యూత విజయమత్తుడై భీష్మాదులను తృణతుల్యంగా పరిగణించి ద్రౌపదిని అవమానించి ఉండవచ్చును. ఐతే కావ్యంలో ధృతరాష్ట్రుడు సభ నుండి నిర్గమించినట్లు చెప్పబడలేదు. కాని మహాభారతంలో అక్కడక్కడ ఇటువంటి కథన లోపాలు ఉన్నాయి. నక్క అరపుల మాత్రానికి భయపడి ధృతరాష్ట్రుడు ద్యూతంలో గెలిచినదంతా తిరిగి ఇచ్చేశాడన్నది విశ్వసించలేము. దుశ్శాసనుడు ద్రౌపదిని బలాత్కారంగా సభకి ఈడ్చుకు వెళ్లాడని గాంధారికి తెలుసును. కనుక ఆమె ధృతరాష్ట్రునితో చాలా వివాదం చేసి ఆ పని చేయించి ఉంటుందనీ, పాండవ దాస్య విమోచనంలోనూ, వారి రాజ్యం వారికి తిరిగి ఇచ్చివేయడం లోనూ గాంధారి చాలా ప్రాముఖ్యం వహించి ఉంటుందనీ కావ్యంలో కథితం కాకపోయినా ఊహించవచ్చును.

రెండవ పక్షం తండ్రి ముందే దుర్యోధనుడు ద్రౌపదిని పరాభవించాడనీ, సభలో ఉండి కూడా మనో దౌర్బల్యం వలన ధృతరాష్ట్రుడు ఘోరమైన ద్రౌపదీ పరాభవాన్ని ఉపేక్షించాడనీ, తిరిగి మనోదౌర్బల్యం వలననే గోమాయురుతమాత్ర భీతుడై జూదంలో గెల్చుకొన్నదంతా తిరిగి ఇచ్చేశాడనీను. ఈ పక్షానికి 63-25 శ్లోకార్థం చాలా ప్రతిబంధకంగా ఉంది.

కనుక ప్రథమ పక్షం గరీయసమని విజ్ఞులు అభిప్రాయపడతారని నేను ఆశిస్తాను.

**శ్రీ కాకూరి హనుమంతరావు**

# నవనవోన్మేష నవసంఖ్య

"తొమ్మిది" అనే అంకె ఒక్కటిగా నిలిచే అతి పెద్ద సంఖ్య. అతి ప్రశస్తమైన 18 కిది సగభాగం. తొమ్మిది "ఫీనిక్స్" అనే పక్షి లాంటిది. దీన్ని కాలిస్తే, చితాభస్మం నుండి పుట్టుకొని వస్తుందట. తొమ్మిది కూడ అల్లే. చూడండి:

1) ఒక సంఖ్యను 9 తో గుణకారం చేయుము. ఉదా:

$$5746 \times 9 = 51714$$

2) వచ్చిన సంఖ్యలోని అంకెలను కూడుము. ఫలితం 9 అయినా అవుతుంది లేదా 9 తో నిశ్శేషంగా భాగింపబడుతుంది.

$$5 + 1 + 7 + 1 + 4 = 18$$

3) ఆ వచ్చిన సంఖ్యలోని అంకెలను కూడుము, ఫలితం 9 (1 + 8) ఈ పద్ధతి లెక్కలో అంతిమ సంఖ్య తొమ్మిదిగానే వస్తుంది. ఫీనిక్సు పక్షివలె (గణితంలో అంతరించిపోయి) మరలా పుట్టింది. మరే సంఖ్యకూ ఈ గుణం

లేదు. అందుకే "నవ" అంటే క్రొత్తది అని కూడ అర్థం. తొమ్మిది సంఖ్యలో చాలా విశేషాలున్నాయి. అన్నిటికీ "నవ" చేర్చుకోండి.

* రత్నములు : మౌక్తికం, పుష్యరాగం, పద్మరాగం, వజ్రం, ప్రవాళం, మరకతం, నీలం, గోమేధికం, వైదూర్యం. పద్మరాగానికి మాణిక్యం అని కూడ పేరు.
* నిధులు : పద్మం, మహాపద్మం, శంఖం, మకరం, కచ్ఛపం, కుందం, ముకుందం, నీలం, వరం.
* బ్రహ్మలు : భృగువు, పులస్త్య, పులహ, అంగిరస, అత్రి, క్రతు, దక్ష, వసిష్ఠ, మరీచి. వీరిని ప్రజాపతులు అని కూడ అంటారు.
* సాహిత్య రసములు : శృంగార, హాస్య, కరుణ, అద్భుత, వీర, రౌద్ర, భయానక, బీభత్స, శాంతములు.
* భక్తిమార్గములు : శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవ, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం.
* ధాన్యములు : గోధుమ, యవ, పెసలు, సెనగలు, కందులు, అలసందులు, నువ్వులు, మినుములు, ఉలవలు.
* గ్రహములు : సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు.

ఇవి సంప్రదాయ భారతీయ జ్యోతిషశాస్త్ర ప్రకారం గ్రహాలు. ఇందు రాహు కేతువులు కేవలం కల్పితాలు. పాశ్చాత్యుల ప్రకారం సూర్యుడు గ్రహం కాదు, నక్షత్రం. స్వయం ప్రకాశకమైందీ, ఇంకొక పెద్ద గోళం చుట్టు తిరుగనిదీ, వారి ప్రకారం "నక్షత్రం" ("స్టార్") అని పిలువబడుతుంది. స్వయంప్రకాశం కానిదీ, ఇంకొక పెద్ద గోళం చుట్టు తిరిగేది "గ్రహం" అంటారు. "గ్రహం" శబ్దార్థం "తిరిగేది" అని. దీని ప్రకారం సూర్యుడు నక్షత్రం, భూమి సూర్యునికి గ్రహం. ("సాటిలైట్"). చంద్రుడు భూమికి గ్రహం. శనికీ, గురునకూ గ్రహాలు కలవని పాశ్చాత్య జ్యోతిశ్శాస్త్రవేత్తలంటారు. ఇచట పాశ్చాత్యుల జ్యోతిశ్శాస్త్రానుసారంగా గ్రహాలుగా పరిగణించబడే వాటిని ఇస్తున్నాను.

సూర్య మండలంలోని గ్రహాలు ("సాటిలైటు"లు) : ప్లూటో (యముడు), ఎర్త్ (భూమి), నెప్ట్యూన్ (సముద్రుడు), మెర్క్యురీ (బుధుడు), వీనస్ (శుక్రుడు), జుపిటర్ (గురువు), యురేనస్ (వరుణుడు), సాటర్న్ (శని), మార్స్ (కుజ, లేక మంగళ) అని తొమ్మిది. చంద్రుడు భూమికి గ్రహం, పదవ గ్రహం కనిపెట్టినామంటున్నారు పాశ్చాత్యులు. మనవారు "దశమ గ్రహాన్ని" ఎప్పుడో గుర్తించినారు!

* దుర్గలు : నీలకాంతి, క్షేమంకరి, హరసిద్ధి, రుద్రాంశ, అగ్ని, జయరిపుమారి, వింధ్యవాసిని
* నవరంధ్రములు : మానవదేహం నవరంధ్రాలు కలది. దీనిని నవచ్ఛిద్ర సమన్వితం. నవద్వారపురి అని అంటారు.
* నవనాథులు ; ఆదినాథ, మత్స్యేంద్ర, శాబర, ఆనంద భైరవ, చౌరంగి, మీన, గోరక్ష, విలే(రూ)పాక్ష, బిలేశయ, మంధార.
* మానవదేహంలో నవనాడులున్నాయని ఆయుర్వేదం.
* పిల్లికి తొమ్మిది జీవితాలున్నాయని ప్రతీతి.
* హనుమంతుడు నవ వ్యాకరణ పండితుడని ప్రసిద్ధి.
* సమయానికి ఒక కుట్టు వేస్తే తొమ్మిది మిగులుతాయని ఇంగ్లీషు సామెత.
* వస్తువు అధీనంలో ఉండుట చట్టం దృష్టిలో తొమ్మిది అంశాలు.
* అశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు "నవ రాత్రులు" అని పేరు. ఇవి దేవీ నవరాత్రులు. నవమి "మహర్నవమి" గణపతి నవరాత్రులూ కలవు.
* సాహిత్య రత్నాలు : భోజరాజాస్థానంలో కాళిదాసు, భవభూతి, దండి ఆది తొమ్మిది కవులుండేవారని జన వాక్యం. కాని చారిత్రకంగా వీరు వేర్వేరు కాలానికి చెందిన వారు. అటులనే అక్బరు దర్బారులో తానసేనుడు, వీర బలుడు, తోడరుమల్లు, అబుల్ ఫజల్, ఫైజి, రహీం ఖానేఖాన్ వంటివారు. నవరత్నాలని పేరు కాంచిరి.
* సైన్యములు : చతురంగ (రథ, గజ, తురగ పదాతులు) బలములతో కూడిన ప్రాచీన సైన్యాలు, చతురంగ సంఖ్యల బట్టి తొమ్మిది విధములు : పత్తి, సేనాముఖం, గుల్మం, గణం, వాహిని, పృతన, చమువు, అనీకిని, అక్షౌహిణి. విశేష మేమంటే, అన్ని సైన్యాలలో ("పత్తి" తప్ప) చతురంగముల సంఖ్య కూడితే, తొమ్మిది సంఖ్యతో నిశ్శేషంగా విభజింపబడుతుంది.

ం తోకతునుక : భోజరాజాస్థానంలోని పండితులు పిచ్చాపాటీ మాట్లాడుకొంటు వేదవ్యాసుని మహాభారతాన్ని తప్పుల

పడుతుండేవారు. వారు చర్చించేటప్పుడెల్లా ఒక చిలుక అక్కడ వ్రాలి "నవ నవ" అని అరచేదట. ప్రతిదినం ఇట్లే జరిగేది. ఒకనాడది "నవ నవ" అంటూనే, అక్కడే కూర్చొని వింటున్న కాళిదాసు "పంచ పంచ" అన్నాడు దానితో ఆ చిలుక మరి రాలేదు ఇదేమి చిత్రమయ్యా అని వారు కాళిదాసును అడిగితే ఆయన "అయ్యా, మన మేమో వ్యాసులవారిని తప్పు పట్టేస్తున్నాము వచ్చిన ఈ చిలుక వ్యాస సుతుడు శుకమహర్షి. మీరు తొమ్మిది గ్రామరులు స్టడీ చేసినారా అని అడుగుచున్నాడు. కాదు స్వామీ, మేము పంచ వ్యాకరణాలే అధ్యయనం చేసిన వాళ్ళం. మాకు తెలియనివన్నీ తప్పులని తేల్చేస్తుంటాం అని విన్నవించుకొన్నాను. ఇదా మీ పాండిత్యం అని చిలుక మరి రాలేదు" అన్నాడు. అప్పుడు వారు నాలుక కొరికికొని గప్‌చిప్ అయినారు.

—సర్దేశాయి తిరుమలరావు

## లేఖ "తన", "కొత్తళము", "భీష్మాచార్యుడు" - వ్యాఖ్య

భారతి (మార్చి 1990) చదివితిని. అందలి మూడు రచనలలోని మూడు విషయాలపై చిరు వ్యాఖ్యలు చేస్తున్నాను.

**1. "తన"**

వ్యాసం : "నేటి ద్రావిడార్య భాషల్లో సంస్కృతము"
రచయిత : ఆచార్య జాస్తి సూర్యనారాయణ

"తెలుగులో "తనము" అనేది భావార్థకమని అందరికీ తెలుసును. "భావార్థకమైన "తన" ప్రాకృతం నుంచి హిందీ లోకీ, తెలుగులోకి వచ్చిందని చెప్పగలమా?" అంటారు రచయిత.

తెలుగులోని "తన"మునకు మూలం ఋగ్వేదంలోని "త్వన" అనేది. ఇదే ప్రాకృతంలో "త్తణ" అయింది. ద్రావిడ భాషలలో "తన" అయిందని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయమై వుంది.

**2. "కొత్తళము"**

వ్యాసం : "రాయవాచక భాషపై కన్నడభాషా ప్రభావం"
రచయిత : డా॥ కాపు రామాంజనేయులు.

కన్నడమున "కొత్తళము" అంటే బురుజు అని అర్థం. తెలుగులో ఈ కొత్తళము అనే పదం వాడుకలో లేదు. "రాయ వాచకంలో" కన్నడ ప్రభావంతో "కోట కొత్తళములు" అని ప్రయోగించబడినది అని రచయిత సిద్ధాంతం. తెలుగులోని కన్నడ సమాన మరియూ సజాతీయ పదాలను పట్టుకొని ఇవి కన్నడ ప్రభావితములని సిద్ధాంతాలు వ్రాయడం ఇటీవల విశ్వ విద్యాలయ పరిశోధకులకు రివాజయిపోయింది. ప్రస్తుత వ్యాసం తార్కాణం. "కొత్తళం" అనే పదము తెలుగులో వాడుకలో లేదన్నారు. అంటే తెలుగువారు తమ వ్యావహారికంలో "కొత్తళము" అనే మాటను పల్కడంలేదనియా లేక కొత్తళము అనే పదాన్ని తెలుగుకవి (రాయవాచక కర్త కాక) తన కావ్యంలో ప్రయోగించలేదనియా రచయిత అభిప్రాయం? "కొత్తళము" తెలుగు పదమే. మహాకవి ప్రయోగ మిదిగో నాచనసోముని "ఉత్తర హరివంశము" (క్రీ.శ. 14వ శతాబ్దము) 1. కోట సింగా రించి, కొత్తళంబులనెల్ల" (ఉ. హరి వం. ఆ-2, ప-92) 2. వంకదారకుఁ జేరి.... అనే పద్యం (ఉ. హరి. వం. ఆ-3, ప-34) లోని పాదం "తోన నిచ్చెన లెక్కి లోని కొత్తళములోఁ బురణించి చొచ్చిన పోటుమగల"ను చూడదగును. ఈ పద్యాన్ని "శబ్దరత్నాకర" కర్త నాచన సోముని "సర్వజ్ఞత్వా"నికి నిదర్శనంగా ఉటంకించినాడు కూడ. "కొత్తళము" ప్రాచీన కాలంలో కూడా తెలుగు పదమే అని సారాంశము. "రాయ వాచకము", 200 ఏండ్ల తర్వాత వచ్చెను.

**3. "భీష్మాచార్యుడు"**

వ్యాసం : సిరి పంచి కుడుచుట మేలు అని వక్కాణించిన భీష్మాచార్యుడు.

రచయిత : డా॥ మాడభూషి భావనాచార్యులు.

భీష్ముని భీష్మాచార్యు డన్నారు రచయిత. వస్తుతః అక్షేపణేమీ లేదు కానీ తెలుగు మహాభారత సంప్రదాయానుసారం "భీష్మాచార్యులు" అంటే భీష్మ ద్రోణులకు ద్వంద్వ సమాసం. ఇంక, భీష్ముడాచార్యుడుగా ఎక్కడా పేర్కొనబడలేదు, అతడు ఆచార్యుడు కాలేదు కూడ. క్షత్రియుడు కాబట్టి. ప్రాచీన కాలంలో అస్త్ర విద్యకు కూడా బ్రాహ్మణులే ఆచార్యులు ద్రోణుని, కురు పాండవ బాలకులకు, అస్త్ర విద్యాగురువుగ భీష్ముడు నియమించినదీ ఇందుకే. ఇక "ఆచార్యుడు" అంటే వేదవిద్య గరపే బ్రాహ్మణ గురువు. "ఆచార్య దేవోభవ". నేడు విశ్వవిద్యాలయాలలో ఏ విషయాన్ని బోధించే ఉన్నత అధ్యాపకునీ "ఆచార్య" అంటు న్నారు, ప్రొఫెసరుకు పర్యాయ పదంగా.

తి

# గ్రంథ విమర్శలు

## ఫొటోగ్రఫీ గైడ్

[రచన: బి. లక్ష్మణ్, పేజీలు-232, వెల: రు. 32-00. ప్రచురణ, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001]

ఫొటోగ్రఫీలో 30 సంవత్సరాల అనుభవం గల ఫొటోగ్రాఫర్ శ్రీ బి. లక్ష్మణ్ రాసిన ఈ పుస్తకం ఫొటోగ్రఫీకి సంబంధించిన చాలా విషయాలు చక్కగా వివరిస్తుంది. ఫొటోగ్రఫీ నేర్చుకునేవారికి మంచి గైడ్. ఫొటోగ్రఫీలో పెక్కు ఆసక్తికరమైన విషయాలు తెలుసుకునేవారికి ఇది ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఈ పుస్తకంలో విశేషంగా ఆకర్షించిన విషయం రచయిత పట్టుదల. కేవలం నాల్గవ తరగతి మాత్రమే చదువుకున్న రచయిత పట్టుదలగా ఇంగ్లీషు నేర్చుకుని తనకు తెలిసిన కొద్దిపాటి విద్యను ఇతరులకు తెలియజేయాలనే తపనతో కార్యదీక్షాపరుడై అయిదు సంవత్సరాలు శ్రమించి రాసిన కాగితాలు రాయడం రాదని చింపి పారేసి మళ్లీ 1958లో రచన ప్రారంభించి 1972లో పూర్తిచేసిన పుస్తకం అని రచయిత రాసిన మాటలు ఇతరులకు బాగా ఉత్తేజాన్ని కల్గిస్తాయి.

చదువు రాదంటూ చదువరులు సయితం చదవాలనిపించే విధంగా రాసిన ఈ పుస్తకం పరిశోధనాత్మకంగా ఉందనిపిస్తుంది. ఫొటోగ్రఫి అంటే ఏమిటి? దాని చరిత్ర ఎప్పటినుండి మొదలయిందీ ఇత్యాది అంశాలను చర్చిస్తూ ఫొటో లెన్సుల చరిత్రతో సహా - మొదలయింది మొదటి భాగము.

రెండవ భాగంలో 43 రంగాలలో ఫొటోగ్రఫి ఉపయోగాలను రాశారు. ఎస్ట్రొనామికల్, కమర్షియల్, డిటెక్టివ్, ఇంజనీరింగ్, మెరైన్, స్పేస్, అండర్ వాటర్, న్యూడ్, పనోరమ మొదలయిన ఫొటోగ్రఫీల గురించి పరిచయం చేశారు.

మూడవ భాగానికి వస్తే కెమేరా నిర్మాణం మొదలు రకరకాల కెమేరాలను వర్ణిస్తూ దానిని జాగ్రత్తగా ఎలా సంరక్షించుకోవాలో కూడా తెలియజేశారు. ఫొటో తీసేటప్పుడు గమనించాల్సిన విషయాలను ఎన్నిటినో తన అనుభవసారంతో మేళవించి రాశారు.

కెమేరాలో సహకార పరికరాలుగా లెన్సుహుడ్, వైర్ రిలీజ్, ఫిల్టర్లు, సప్లిమెంటరీ లెన్సులు, వైడ్ యాంగిల్ లెన్సులు, జూమ్ లెన్సులు మొదలయిన సాంకేతిక పరమైన విషయాలు వాటి ప్రాముఖ్యత కూడా వివరించారు.

ఫొటో తీసేందుకు కెమేరాలో ఫిల్ము లోడ్ చేయడం ప్రారంభించి ఎక్స్‌పోజర్ ఏ విధంగా ఉండాలి, కదిలే వస్తువుల ఫొటోలు తీసేటప్పుడు ఏ విధమైన జాగ్రత్తలు తీసుకోవాలి, మూడు విధాలయిన కదలిక మార్గాలకు అనుగుణంగా షట్టర్ వేగాలు ఏ విధంగా ఉండాలో పట్టిక వేసి వివరాలు ఇచ్చారు.

రాత్రి సమయాల్లో ఫొటోలు, పాంక్రోమేటిక్ అనే ఎక్కువ స్పీడు కలిగిన ఫిల్ముల తయారీతో మొదలయ్యాయని రాత్రి సమయాల్లో జరిగే నృత్యాలు, రద్దీగా యుండే కూడలివద్ద మోటారుకార్ల రాకపోకలు వంటి దృశ్యాలను కళాత్మకంగా తీయడానికి సాధ్యమయిందని, చివరకు ఈ కొత్త ఫిల్మ్ పుణ్యమా అని పౌర్ణమి చంద్రుని కాంతిలో కూడా ఫొటోలు తీయవచ్చునని రచయిత స్పష్టం చేశారు.

తరువాత ఫ్లాష్ లైట్ ఫొటోగ్రఫీ వర్ణిస్తూ అందులో వచ్చిన మార్పులను చక్కగా రాశారు. ఫ్లాష్ పౌడరు యూనిట్‌తో ఫొటోలు తీసేటప్పుడు ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలో చెప్పడమే గాక కొన్ని సాంకేతిక సూచనలు కూడా ఇచ్చారు. ఫ్లాష్ బల్బులు ఉపయోగించినపుడు ఫొటోగ్రాఫర్‌కు బాగా ఉపయోగపడే కొన్ని ముఖ్య సూత్రాలను కూడా పుస్తకంలో 148 మరియు 149 పేజీలలో చూస్తాం. ఇవి ఫొటోగ్రాఫర్‌లకు అనుభవంలోకి వచ్చే విషయాలయినా కొత్తవారికి, ఔత్సాహికులకు ఎంతో లాభదాయకంగా ఉంటాయి.

విద్యుద్దీపాలు స్టూడియోలలో ఏర్పాటు చేసి, ఫొటోలు తీసేటప్పుడు ప్రత్యేక ఎఫెక్ట్సు కోసం ఏ రకంగా లైటింగ్ ఏర్పాటు చేయాలో సచిత్రంగా వివరించారు. ఫొటో తీసినపుడు వ్యక్తి నీడలు కూడా ఫొటోలో కన్పించడం మనం కొన్ని ఫొటోలు చూసినపుడు గమనిస్తాం. ఈ విధమైన ఏర్పాటువల్ల అటువంటి లోపాలు లేకుండా ఫొటోలు తీయడం సాధ్యం అవుతుంది.

నాల్గవ భాగంలో ఫొటో డెవలప్‌మెంటుకు సంబంధించి కావలసిన ఎక్విప్‌మెంట్, నెగిటివ్ డెవలప్ చేయడం గురించి స్పష్టమయిన సమాచారం రచయిత సమకూర్చారు. డెవలపర్, స్టాప్‌బాత్, ఫిక్సర్, నీరు వివరాలు ఉన్నాయి. రోల్ ఫిల్ము డెవలపింగ్ చేయడంలో అయిదు దశలు ఫిల్ము డెవలపింగ్ సూత్రములు, ఫిల్ముకేర్, రిటచింగ్, ప్రింటింగ్ ఎక్విప్‌మెంట్, ఎక్‌స్ట్రా హర్డు నెగటివ్, హర్డు నెగటివ్, సాఫ్టు నెగటివ్, అండర్ నెగటివ్, గ్లేజింగ్ గురించి విశేషాలుతోబాటు ముఖ్యమైన సూచనలు ఫొటోగ్రాఫర్‌లకు ఎంతో ఉపయోగపడవచ్చు.

ఎన్లార్జర్లుకు సంబంధించి కావలసినంత వివరణ ఇచ్చారు. ఇందులో ఎన్లార్జింగ్ పరికరాలు, ప్రింటింగ్‌కు సంబంధించి బర్నింగ్, డాడ్జింగ్, డిస్టార్షన్ కరక్షన్, కాంపోజిషన్, ట్రిమ్మింగ్ ఉన్నాయి.

అయిదవ భాగంలో ఫోటోగ్రఫిలో ఉపయోగించే రసాయనిక ద్రవ్యములు, వాటిని ఎప్పుడు ఉపయోగిస్తారో మొత్తం ఇరవైమూడు విషయాలుగా తెలియపర్చారు. అన్నిటికంటే ముఖ్యమైన విషయం ఈ రసాయనాలను ఉపయోగించి డెవలపర్, యూనివర్సల్ డెవలపర్, స్పెషల్ నెగటివ్ డెవలపర్, ఫైన్ గ్రెయిన్ డెవలపర్, సూపర్‌ఫైన్ గ్రెయిన్ డెవలపర్, పేపర్ డెవలపర్ వంటి వాటిని ఎట్లు తయారు చేసుకోవచ్చునో రాసిన తీరు ఫోటోగ్రఫీలో ప్రవేశం కోరుకునేవారికి, కొత్తగా ఈ కళలో కృషి చేస్తున్నవారికి ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. రచయిత అభినందనీయుడు.



## పంపుసెట్లు మెకానిజం - రిపేరు

[రచన: ఎస్. శ్రీనివాసన్; బి.ఇ., అనువాదం: శ్రీమతి రాజం పరమేశ్వర అయ్యర్ మరియు బి. మోహనరావు. పేజీలు: 160, వెల: రు. 15-00, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001].

సాంకేతిక (టెక్నికల్) పరమైన సమాచారంతో సామాన్యులు కూడా అర్థం చేసుకోవాలనే ఆశయంతో పంపుసెట్లు, వాటి మెకానిజం, రిపేరుకు సంబంధించిన వివరాలు 14 అధ్యాయాల్లో సచిత్రంగా వివరించిన రీతి ఆకర్షణీయంగా ఉంది.

వ్యవసాయదార్లు, ఇతర వినియోగస్తులు పంపు సెట్లు ఎలా వాడుకోవాలో, చెడిపోకుండా, మూలపడిపోకుండా వాటి విషయంలో ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలో ఈ పుస్తకంలో బాగా వివరించారు. మెకానిక్‌లు తప్పకుండా ఈ పుస్తకాన్ని చదివితే తమ అనుభవాలకు మంచి పరిజ్ఞానం తోడవుతుంది.

సెంట్రిఫ్యూగల్ పంపు వివరణతో మొదలయి ఎన్నో విషయాలను వివరిస్తూ నీటిని 106 మీటర్లు ఎత్తుకు మించి పైకి తరలించడానికి బహు భ్రమణ చక్ర వాల్యూట్ పంపును ఉపయోగించడం గురించి వివరించారు. ఈ పని ఆ పంపు ఎలా నిర్వహించగల్గుతుంది అనే విషయం సామాన్యునికి కూడా సులువుగా అర్థమయ్యేటట్లు చిత్రాల సహాయంతో వర్ణించారు.

టర్బయిన్ పంపు ప్రత్యేకత పరిచయం చేస్తూ భూగర్భం నుండి 305 అడుగుల ఎత్తు వరకూ నీటిని చేరవేయవలసినపుడు ఈ పంపును ఉపయోగిస్తారని చెబుతూ, ఆది ఎలా పని చేస్తుందో చక్కగా వివరించారు.

ప్రైమింగ్ అధ్యాయములో నూతిలోని నీటిని సెంట్రిఫ్యూగల్ పంపు ఏ విధంగా తోడుతుందో, ప్రతి దశలోను ఏ ఏ రకమైన మార్పులకు లోనయి నీరు పైకి లాగబడుతుందో వర్ణించిన పద్ధతి ప్రతి ఒక్కరికి సులభంగా అర్థమవుతుంది. ఆటోమాటిక్ ప్రైమింగ్ విధానాలు, డిఫ్యూజర్ పంపును ప్రైమింగ్ చేయడం, చెక్ వాల్వ్ పనిచేసే తీరు, నీరు గాలి కలిసి సుడులు తిరిగే స్థితి తప్పనిసరిగా పాఠకునికి మంచి అవగాహన ఏర్పడేందుకు సహాయపడతాయి.

ఇళ్లల్లో ఉపయోగించే చేతి పంపులు ఏ విధంగా పనిచేసి మొత్తం నాల్గు స్ట్రోకులలో నీటిని బయటకు విడుదల చేస్తాయో సచిత్రంగా వర్ణించడమే గాక ఫోర్సు పంపులలో వన్ వే, టూ వే, ప్లంజర్ పంపులలో కూడా అటువంటి రకాలను బొమ్మల సహాయంతో సులువుగా అర్థమయ్యేటట్లు పరిచయం చేశారు.

పంపులను బిగించేందుకు వేయవలసిన పీఠములు-దిమ్మెలు వేసేందుకు స్థల నిర్ణయంతో ప్రారంభించి వాటి పునాదులు ఏ రకంగా వేయాలో వర్ణిస్తూ ఒక క్రమబద్ధమైన అమరికకు తీసుకోవలసిన జాగ్రత్తలు వంటి విషయాలు వినియోగదారులకు ఉపయోగపడే విధంగా రాశారు

సెంట్రిఫ్యూగల్ పంపు వినియోగించేటప్పుడు ఏర్పడే ప్రతి చిన్న లోపానికి మెకానిక్ దగ్గరకు వెళ్ళనవసరం లేకుండా పంపు సొంతదారు ఏ విధంగా ఆ లోపాలను సవరించుకోవచ్చునో 9వ అధ్యాయంలో చర్చించారు.

వ్యవసాయ భూములు - నీటి సరఫరాకు సంబంధించి ఒక ఎకరం భూమికి నీరు 1 అంగుళం ఎత్తు సరఫరా చేయడానికి ఎంత పరిమాణం నీరు తోడాల్సింది ఎలా అంచనా వేసుకోవాలో గణితపరంగా నిర్ణయించడమే గాక రైతులకు ఒక ఆధారంగా ఉండేందుకు రకరకాల పంటలకు సరఫరా కావలసిన నీరు ఎన్ని రోజులు పెట్టవలసినది పట్టికలో పొందుపరచారు

వరి, చెరకు, అరటి, కూరగాయలు పండే ఒకొక్క ఎకరం చొప్పున మొత్తం నాల్గు ఎకరాల పంట పొలాలకు నీరు సరఫరా చేసేందుకు ఎంత నీరు అవసరమో, ఎటువంటి పంపుసెట్టు, ఎంత హార్సుపవర్ గల్గినది వాడాలో కూడా తెలియజేశారు. ఈ పుస్తకం రైతులకు, వ్యవసాయదారులకు, మెకానిక్‌లకు కూడా నిస్సందేహంగా ఉపయోగపడుతుందని చెప్పుకోవచ్చు.

# ఆరోగ్యానికి మార్గాలు

(వివిధ వైద్య విధానాల వివరణ)

[రచన: **వేదగిరి రాంబాబు**, పేజీలు: **128**, వెల: రు 20/- ప్రచురణ: మయూర, **1-5-488**, బాకారం, హైదరాబాద్- **500 048**, ప్రతులకు: రచయిత, **10-3-98**, ఈస్టు మారేడుపల్లి, సికింద్రాబాద్-500 **026**]

తాను వైద్యుడు కాదని స్పష్టం చేస్తూ వైద్యపరంగ ఎన్నో విషయాలను చాలా శ్రమించి, సేకరించి ఒక వరుస క్రమంలో పాఠకునికి ఆసక్తికరంగా ఉండే రీతిలో రచయిత రాశారు. పైగా రచనలో చక్కని అర్థ వివరణతోబాటు పల విషయాలను సమన్వయపరుస్తూ రాశారు.

యోగాభ్యాసము ఏ విధంగా మనిషి ఆరోగ్యాన్ని, అందాన్ని అభివృద్ధి చేస్తుందో చెప్పడమే గాక సచిత్రంగా రకరకా యోగాసనాలు ఏ విధంగా వేయాలో కూడా ఈ పుస్తకంలో ఉన్నాయి.

అదేవిధంగా ప్రకృతి వైద్యానికి సంబంధించి ఎన్నో వి షాలు వివరించారు. ఆదిత్య పేటికా స్నానము, మర్దన చికిత్స ఇన్‌ఫ్రారెడ్ కిరణాల చికిత్స వంటివి ఎన్నో వివరించారు. లావ తగ్గడానికి ప్రకృతి చికిత్స ఒక్కటే విధానం కావచ్చు కా ప్రకృతి చికిత్స ద్వారా ఎన్నో రోగాలకు చికిత్సలు చేయవచ్చు గుర్తు చేస్తారు. ఈ ప్రకృతి చికిత్స సొంతంగా చేసుకుంటారేమో అనే ఆలోచనతోనే హైదరాబాద్ అమీర్‌పేటలో ఉన్న ప్రకృ చికిత్సాలయం గురించి గుర్తు చేశారు

పుస్తకం చదివి ప్రకృతి చికిత్సకు వెళ్లడంకన్నా ఆ రంగంలో నిపుణుల ఆధ్వర్యంలో ఈ చికిత్స జరుపుకోవడం ఉత్తమం అనే విషయం గుర్తుంచుకోవాలన్నట్లు తేటతెల్లమవ తుంది. అయితే అచట ఏ విధమైన చికిత్సలు జరుగుతున్నాయనే విషయ వివరణ పుస్తకంలో ముఖ్యంగా మెచ్చదగిన అంశం.

ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన ఎనలేని సమా చారాన్ని సామాన్య పాఠకుడి ముందు వడ్డించిన విస్తరి మాదిరి ఉంచారు. ఆంధ్రప్రదేశ్‌లోని ఆయుర్వేద వైద్యశాల లన్నింటి లోను పెద్దదయిన హైదరాబాద్‌లోని చార్మినార్ ప్రక్కనున్న ఆవరణలోని ఆయుర్వేద వైద్యశాలలకు సంబంధించిన వి షాలు ఎన్నో ప్రత్యక్షంగా పరిశీలించి రాశారు. ఈ సమాచారం

రోగులకు మాత్రమే గాక ఆయుర్వేదం పట్ల అభిలాష గలవారికి కూడ ఎంతో లాభదాయకంగా ఉంటుంది.

ఆరోగ్యానికి ఉపకరించే సీజనల్ ఫ్రూట్స్, ఆరోమాథెరపి, సిద్ధ వైద్యవిధానం, హోమియోపతి, యునాని వైద్యం, ఆక్యుపంక్చర్, ఆక్యుప్రెషర్ వంటివాటిని కూడా వివరించారు. అయితే వీటి వివరణ మరికొంత ఉంటే ప్రయత్నం పరిపూర్ణత సిద్ధించి ఉండేది.

ఈ పుస్తకం నవల మాదిరి గబగబా చదివేయడానికి వీలుగా ఉండదు గాని అవసరం వచ్చినప్పుడల్లా తిరిగి తిరిగి పుస్తకం చదవాల్సి వస్తుంది. అందుకే ఈ పుస్తకాన్ని ఎంత కాలమైనా భద్రపరచుకోవాలి.

# ఎయిడ్స్

[రచన : కన్నడ మూలం: డా॥ పి యస్. శంకర్, ఆంధ్రానువాదం : శర్వాణి, పేజీలు: 64, వెల: రు. 7-00, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీటు, హైదరాబాద్-500 001]

ఎయిడ్స్ వ్యాధి గురించి విశేషమైన ప్రచారం అవసరం. ముఖ్యంగా దానికి సంబంధించిన వాస్తవాలు, అపోహలు తెలియడంవల్ల ప్రజలు జాగరూకతతో వ్యవహరించడం జరుగుతుంది. అందుకే ఎయిడ్స్‌కు సంబంధించిన పరిజ్ఞానం ఎంతైనా కావాలి. పుస్తకం చదువుతూంటే స్వేచ్ఛగా హాయిగా ముందు ఏమి ఉంటుందో అనే ఆసక్తి ఉండేటట్లు రచయిత విషయాన్ని ఒక ప్రణాళికాబద్ధంగా రాస్తే దానిని ఎక్కువమంది చదివే అవకాశం ఉంటుంది. ముఖ్యంగా సైన్సును పాపులర్‌గా రాసే రచయితలు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి.

ఈ పుస్తకంలో రచయిత తనకు తెలిసిన సమాచారాన్ని తనకు వీలైన రీతిలో కొన్నిచోట్ల రోగానికి సంబంధించిన సంఖ్యా వివరాలను ఇస్తూ మరికొన్నిచోట్ల వైద్యపరమైన వివరణలు ఇస్తూ రచన కొనసాగించారు. కొంత భాగం సామాన్య పాఠకుడు అర్థం చేసుకుంటూ సులువుగా పేజీలు తిప్పినప్పటికిని కొన్ని పేజీలు పాఠ్య పుస్తకంవలె తప్పనిసరిగా కన్పిస్తాయి.

అనువాదం విషయానికి వస్తే కొన్ని పదాలు అనువాదం చేయకుండా అదేవిధంగా ఇంగ్లీషులోనే ఉపయోగించి ఉంటే బాగుండేదేమో అన్పించింది. ఉదాహరణకు ప్రతిరక్షకం అనడం కన్నా యాంటీ బాడీ అంటే పాఠకుడికి బాగా అర్థమవుతుంది. అదే విధంగా 'టి' లసికాకణం అనడంకన్నా 'టి' లింఫోసైటు అంటే బాగుండేదేమో. ఇటువంటి పుస్తకాలు అనువాదం జరిగినపుడు తోడుగా కొంత ఆసక్తికరమైన అధునాతన సమాచారం కూడా జతపరిస్తే మరింత ప్రయోజనకరంగా ఉంటుంది.

ఉదాహరణకు విదేశాలకు వెళ్ళదలచినవారు ఎయిడ్స్ బారి నుండి రక్షించుకునేందుకు ఎటువంటి జాగ్రత్తలు పాటించాలి, ఏ పనులు ఎయిడ్స్‌ను వ్యాప్తి చేయవు వంటివి. ఇది కేవలం సూచన మాత్రమే

ఇది తప్పనిసరిగా చదవ తగ్గ పుస్తకం.

— సి. వి. సర్వేశ్వర శర్మ

# భారత పద్య శైలి

[రచయిత: డాక్టర్ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి, ఎం.ఏ. పి.హెచ్.డి., ప్రతులకు: శ్రీమతి చేరెడ్డి లలితాదేవి, 'ఆనందవర్ధన' 11-6-1/16/2, నవోదయనగర్, నరసరావుపేట - 522 601. వెల: రు. 100/-]

"భారతం పంచమో వేదః" అన్నది నానుడి. వేదో పబృంహిత ధర్మ సముచ్చయం, వేదవ్యాసుల భారతంలో నిక్షిప్తమైందనీ, వేద పఠనాధికారం లేనివారు దీన్ని చదువుకొని, ధర్మ సూక్ష్మాలనీ, అవశ్యా వరణీయ ధర్మాల్నీ గ్రహించి మోక్షగాములై జీవికని సార్థకం చేసుకోగలుగుతారనీ, సంప్రదాయపరుల పారంపరిక కథనం.

సంస్కృత భారతాన్ని అనుసరించి, భారత రచన చేసిన కవిత్రయం, మక్కికి మక్కిగ, తమ రచన చేయలేదు-రచనలో ప్రత్యేకం తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకొనే విధానాన్ని పాటించారు - నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు, క్రమంగా "ప్రసన్న కథా కవితార్థయుక్తి" "నానా రుచిరార్థ సూక్తినిధి" "అక్షరరమ్యత", నాటకీయ రచనారీతి, తెనుగుదనం, అలతి, అలతి పదములలో విపుల భావ నిక్షేపము, వర్ణనాత్మక విధానం, పాటించారు.

పరిశీలకులు, పరిశోధకులు, అనూచానంగా కవిత్రయ భారతాన్ని గూర్చి వివరించే స్థూల వివరణ ఇటువంటిదే.

అనుబంధాలు, ఉపయుక్త గ్రంథపట్టిక, ముఖ్యమైన సవరణలు కలిసి 638 పుటల బృహద్గ్రంథంగా వెలువడిన, ఈ

సిద్ధాంత పరిశోధన గ్రంథం రచయిత కృషిని, దీక్షని, పరిశోధనా పటిమని నిరూపిస్తోంది. సంస్కృతాలంకారికులు "శైలీ" పదాన్ని వాడినా, ఆ పదం పాశ్చాత్య సిద్ధాంతంలో "స్టైల్"కి పర్యాయం కాదు. పద్యగతమైన బాహిరాంతర సౌందర్యాన్ని పరిశీలన చేసే సందర్భంలో రీతి - శయ్య - పాకము - అనే మూడు విషయాల్నే తల స్పర్శం వివరించి, నిరూపించారు — ఆ ఆలంకారికులు.

ఒకటి, రెండు శతాబ్దుల క్రింద శైలీ పదం భావ వ్యక్తీకరణ విధానంలోని ప్రత్యేకతను నిరూపించే పదంగా రూఢి అయింది. ఇది పాశ్చాత్య వాఙ్మయ పరిశీలన వల్ల నూత్న దృక్పథంతో వచ్చినట్టిది.

పరిశీలింపవలసిన అంశం పూర్తిగా ప్రాచీనమైనదైనా ఆధునిక దృక్పథంతో పరిశీలించినప్పుడు గూడా అది, సమన్వయం చెందడం వస్తుగత విశేషమున్నూ, రచయిత మేథా సమన్వయమున్నూ కారణాలై భాసించడమే అవాలి.

ఆ సప్తమోల్లాస పరిచ్ఛేదాలున్న ఈ గ్రంథంలో చేసిన ఆత్మీయతా పురస్కృత శైల్యాది సూక్ష్మ సూక్ష్మ విభాగాలు, కొన్ని ప్రధాన విభాగాల్లోనే అంతర్భూతా లవుతాయి - నన్నయ శైలిని, మిగిలిన కవులిద్దరూ ఎలా వాడుకున్నారో, దాన్ని నిరూపించడమూ, అర్వాచీన కవులైన తిరుపతి వేంకట కవులదాకా ఎవరెవరు ఎలా అనుకరించారో సోదాహరణం నిరూపించడమూ రచయిత చూపారు. భాషాగతంగా ఏ ఏ సౌందర్య పోషకాంశాలు ప్రధాన ప్రాచుర్యం వహిస్తాయో అవన్నీ వీరి విమర్శలో రూపొందే వున్నాయి.

పర్యవేక్షక సహాయంతో రచయిత ఎంచుకున్న ప్రణాళిక-త దీక్షా తుదిదాక నడచిన రీతి సమీక్షక దృక్పథానికి ఆలంబనం కదా!

తమిళము, కన్నడము, మళయాళము, తెలుగు సమాన ద్రావిడ భాషా కుటుంబములోనివి - కవిత్రయంవలె కన్నడంలోనూ పంప, పొన్న, రన్న కవిత్రయమున్నది. నారాయణభట్టు సహాయంతో నన్నయ ఏ ఏ సన్నివేశాల్లో, భారత పద్య రచనలో సొగసులు దిద్దాడో ఒకే ఒక్క ఉదాహరణం చూపారు రచయిత. అది కూడా (నందంపూడి శాసనం) అంటూ పేర్కొనడమే.

భారతయుద్ధంలో నరునికి నారాయణుడు చేసిన సహాయమెటువంటిదో, అటువంటి సహాయాన్నే నారాయణభట్టు నన్నయకు చేశాడన్న "పాయక పాకశాసనికి" అన్న పద్యం- ఆది - 1-25 కేవల కృతజ్ఞతాసూచకంగా, తావన్మాత్రకంగా చెప్పినదేనా? అనుష్టుప్ శ్లోకాలుగా ఎక్కువ భాగం రచింపబడుతూ అవసరాన్నిబట్టి అక్కడ, అక్కడ, వృత్తాలు వాడే రీతి భారత, రామాయణ రచయితలైన వాల్మీకి, వ్యాసులలో చూస్తాం-

అలాకాక, వస్తు, సన్నివేశ, పాత్ర చిత్రణ రీతిలో, తన నాటి, సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల్ని ఆకళింపు చేసుకుని, తెలుగుకి సంస్కృత మర్యాదని తీసుకు రావాలన్న తపన వున్న నన్నయకి నారాయణభట్టు దేశి, మార్గచ్ఛందోరీతుల్లోని వైశిష్ట్యాన్ని నన్నయ రచనలో చూపింపచేయడానికి చేసే ప్రయత్నం పరోక్షంగానైనా ఎలా వుంటుందో! రచయిత తమ పరిశోధనలో, తమ ప్రణాళికలో ఎందుకు ప్రధానంగా స్వీకరింపక వదలివేశారో! - భారత రచనాకాలము - నాటి పరిస్థితి - మూలాతిశాయి సౌందర్యం వంటి అంశాల్ని నిరూపించడంలో, తమ ప్రణాళికలో వాటికి పరిధి తక్కువైందేమో అనిపించింది. ముందుగా ఒక ప్రణాళికను సిద్ధపరచుకొని, దాని కనుగుణం నిర్దుష్టంగా, సమగ్రంగా దాన్ని తీర్చిదిద్దిన సందర్భంలో రచయిత కృషి సర్వదా ప్రశంసనీయం. సాహిత్య పిపాసువుల కిది ఆలోచనల ప్రేరకం- పఠనీయం.

— ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు

# ఆంధ్ర మహాభారతములో కృత్ - తద్ధిత ప్రయోగముల విశ్లేషణము

[పి హెచ్. డి సిద్ధాంత గ్రంథము, రచయిత: డా॥ కండ్లకుంట అళహ సింగరాచార్యులు, పేజీలు: 222, వెల రు 48/-లు. ప్రతులకు : ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు]

ఈ పుస్తకము శ్రీ కె. ఏ సింగరాచార్యులు పి.హెచ్.డి. పట్టా కోసం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం. ఈ గ్రంథంలో ఐదు ప్రకరణాలున్నాయి. మొదటి ప్రకరణంలో సంస్కృత వ్యాకరణంలో కృత్ తద్ధిత

ప్రయోగాల గురించి; రెండవ ప్రకరణంలో తెలుగు వ్యాకరణంలో కృత్-తద్ధిత ప్రయోగాల గురించి చర్చింపబడింది. మూడవ, నాలుగవ, ఐదవ ప్రకరణాల్లో క్రమంగా నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల భారత రచనల్లోని కృత్-తద్ధిత ప్రయోగాలు పరిశీలింపబడ్డాయి.

శ్రీమాన్ కె. ఏ. సింగరాచార్యులు కృత్-తద్ధిత ప్రత్యయాలను, ప్రయోగాలను విశ్లేషించేటప్పుడు వ్యాకరణ సంప్రదాయాన్ని పాటిస్తూ, ద్రావిడ భాషల తులనాత్మక పరిశీలన కూడ కావించారు. ద్రావిడ భాషా పదాల వ్యుత్పత్తి లభించని చోట్ల స్వతంత్ర మార్గాన్ని అనుసరించారు. ఆచార్యులవారు నన్నయ భారతంలోని 32 కృత్ ప్రత్యయాలను, 14 తద్ధిత ప్రత్యయాలను పరామర్శించారు. తిక్కన వాడిన 60 కృత్ ప్రత్యయాలను, 26 తద్ధిత ప్రత్యయాలను, ఎఱ్ఱన ప్రయోగించిన 5 కృత్ ప్రత్యయాలను, 9 తద్ధిత ప్రత్యయాలను, 2 అస్పష్ట వ్యుత్పత్తి గల ప్రత్యయాలను పరిశీలించారు. తత్సమ పద బహుళంగా వున్నందువల్ల నన్నయ భారతంలో తద్ధిత ప్రయోగాలు చాల తక్కువనీ, దేశీయ పద ప్రాచుర్యం కారణంగా, తిక్కన భారతంలో తద్ధిత రూపాలు ఎక్కువనీ ఆచార్యులవారి నిర్ధారణ. అలాగే కృత్-తద్ధిత ప్రయోగాల్లో ఎఱ్ఱన తిక్కనలకున్నంత సామ్యం ఎఱ్ఱన-నన్నయలకు లేదనీ సింగరాచార్యులవారు అభిప్రాయపడ్డారు.

## వెలుగుబాట

[గేయ కావ్యం, రచయిత: యం. సి. నాగన్న, పేజీలు: 40, వెల: రు. 8.00, ప్రతులకు: యం. సి. నాగన్న, బలిజపల్లె గ్రామం, మామిళ్ళపల్లె పోస్టు-516 004, కడప జిల్లా]

యం. సి నాగన్న సరళజీవి, సుకుమార హృదయుడు, దైవభీతి గల వ్యక్తి అందువల్లే సంఘంలో నానాటికీ మానవత్వం దిగజారిపోతుందే ఒకటే వేదన పడిపోతున్నాడు. విజృంభిస్తున్న వాంఛలను అదుపులో పెట్టుకొని, ఇతరులకు నొప్పి కలిగించకుండా బ్రతకమని తోడి మానవులను కోరుతున్నాడు రచయిత.

యం. సి. నాగన్న సులభమైన గేయాల ద్వారా మానవతా విలువలను ప్రతిపాదించాడు ఈ 'వెలుగుబాట'లో. ప్రతి గేయం ఐదేసి పంక్తులతో, 'నిజం తెలిసి మసలుకోరా! మానవుడా!' అనే మకుటంతో సాఫీగా సాగుతుంది.

## పర్వతేశ ప్రభు శతకము

[రచయిత : కోట సుందరరామ శర్మ, పేజీలు : 48, వెల: అమూల్యం, ప్రతులకు: త్రిపుర సుందరీ ప్రతిష్ఠానము, చింతగుంటపాలెము, మచిలీపట్టణము-521 001]

పూనా నగరంలోని శంకరుని గురించి శ్రీ కోట సుందర రామశర్మ రాసిన 108 పద్యాల సుందర శతకమిది. ఎడమవైపున తెలుగు పద్యాలు, కుడివైపున వాటికి అనుకరణాలుగు సంస్కృత శ్లోకాలు ముద్రింపబడ్డాయి. శతకంలో శివ వందనము, వరణము, గణనము, కారుణ్యము, శివయాత్ర, నీతి, శరణము అనే ఏడు భాగాలున్నాయి.

కోట సుందరరామ శర్మగారు నిర్మల హృదయంతో గుండె లోతుల్లోంచి పుట్టుకొచ్చిన భావాలకు సరళ సుందరమైన రూపాన్ని కల్పించారీ శతకంలో. మచ్చుకి ఓ పద్యం:

"కన్నుల్ మూసిన, విచ్చినం గనఁగ నౌఁ గైలాస శైలాభమై
మిన్నుల్ వ్రాలిన క్రేవ నీ శిఖరియుం; 'బెజ్జాన', పొన్నానయున్,
మన్నాసన్ విడినట్టి వారి కగు యుష్మత్-సత్య-సందర్శనం,
బెన్నన్ మాదృశ-చర్మ చక్షులకు జాలే, పర్వతేశ ప్రభూ!

— ఘట్టమరాజు



Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247